# సరస్వతీ సంహారము

కన్నడమూలం

బీచి

అనువాదం

'పుట్టపర్తి'

ఆదర్శసాహిత్యమాల

హైదరాబాదు.

ఇది మాసాహిత్యమాల తొమ్మిదవ ప్రచురణం. మెల్ల మెల్లగా ప్రజాదరణ పొందుతున్న సాహిత్యమాలను ఇతోధికంగా ప్రోత్సహించ వలసినదని రచయితలకు, పాఠకులకు మనవి.

కన్నడమూలమును అనువదింప అనుమతించిన శ్రీ బీ. చి. గారికి, సమర్థవంతంగా అనువదించి అందిచ్చిన "సరస్వతీ పుత్ర" "మహా కవి" శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులగారికి, నవల సంపాద కీయ భారంవహించిన మిత్రులు శ్రీ డి. రామలింగంగారికి, కృతజ్ఞతలు.

ఆదర్శ సాహిత్యమాల
హైదరాబాదు,
20-9-1957.

తిరుమల శేషాచార్యులు
కార్యదర్శి

8

# మున్నుడికి బదులు

ఒకాయన పుస్తకం వ్రాసి మరొకాయన్ను పీఠిక వ్రాయవలసిందని కోరుతాడు. ఆ మహాశయుడు గ్రంథకర్తను ముక్తకంఠంతో పొగడి - యింకా యేవేవో విశేషణాలు తగిలించుతాడు. సరస్వతీదేవికి మీరు జేష్ఠపుత్రులని కూడా అంటాడు. ఇలా కాక - "మీ రచనలో నాకు సరిపోని భావాలు కొన్ని యివి." అని తెలపడం చాలా అదృష్టం. సాధారణంగా - పీఠిక వ్రాసేవారు - గ్రంథకర్త పాటకు తాళం వేస్తూ వుంటారు. అలా వేయకుంటే "నా అభిప్రాయం పీఠికాకారునికి అర్థం కాలేదులే" యని గ్రంథకర్త వెంటనే అనివేస్తాడు. ఈ చిత్తవృత్తి మంచిది కాదని - గాడిదకు కూడా తెలుసు. గ్రంథకర్తలకూ - కొంచెం ప్రయత్నిస్తే తెలుస్తుంది. వారికి దేవుడా సద్బుద్ధిని ప్రసాదించవలెనంటే !

"ఈ సాహిత్యకారులు వ్రాసిందంతా గొప్ప సాహిత్యం. నూతన సాహిత్యం, శాశ్వతమైనది. ఈ ప్రతిభాశాలి - యీ గ్రంథం వ్రాయకుంటే జగత్తు పాడైపోయివుండేది." ఇత్యాది...ఇత్యాది... అంటూ యెవరో ఒక దద్దమ్మ దగ్గరనుండి - 'కాండెక్టు సర్టిఫికెట్టు' తీసికొన్నట్లు, ఒక వూరు పేరు లేని విమర్శకుని నుండి అభిప్రాయాన్ని గ్రహించి నేను మెరవణి తిరిగితే నాగతి యేమౌతుంది? కోతులు గూడా నన్ను జూచి హాస్యం జేస్తాయి. ఈ సంప్రదాయం అడ్డగించవలెననే ఉద్దేశ్యంతోనే పూజ్యులైన శ్రీ వి. కృ. గోకాక్ మహాశయుల జాబును యిక్కడ ప్రకటించారు.

ఈ గ్రంథాన్ని మొదలు ప్రకటన కోసరమై ధార్వాడ్‌లోని కర్ణాటక సహకార సాహిత్య సంఘానికి పంపినారు. శ్రీ గోకాక్ మహాశయులు ఆ సంఘపు సలహాదారులలో నొక్కరు. ఈ పుస్తకానికి పీఠిక వ్రాయవలెనని వారిని ప్రార్థించి యుంటిని. నాప్రార్థనను వారు మన్నించి మున్నుడికి బదులు సుదీర్ఘమైన ఒక లేఖను వ్రాసి - నాకింకనూ యెక్కువ ఉపకారమొనర్చినారు. రసహీనమైన దంటునుచప్పరించే మామూలు మనుష్యులు కావలసినంతమంది "ఒద్దురా! రామచంద్రా!" అనేంతవరకు దొరుకుతారు. పుస్తకాన్ని చదువకుండానే తోఁచిన తోఁచకున్నఅభిప్రాయాన్ని వ్రాసిపంపే పెద్ద మనుష్యులకూ కొరఁతలేదు. కాని శ్రీ గోకాక్ మహాశయుల వలె పుస్తకాన్ని చదివి విమర్శించి - ఆశీర్వదించే పెద్దలు చాల కొద్ది: వారుచేసిన యీ ఉపకారానికి ప్రత్యుపకారం నేనేం చేయగలను? ఆ పుస్తరాన్ని యథాతథంగా ప్రకటించడమే నా ప్రత్యుపకారలేశమనుకున్నాను. దాన్ని ప్రకటించడానికి అనుజ్ఞ యివ్వడంకూడా వారు నాకుచేసిన రెండవ ఉపకారం!

శ్రీ గోకాక్ మహాశయులు నా రచనను మెచ్చికొన్ననాఁడు నేను వ్రాయడమే మానేస్తానేమో నన్న భయం నాకున్నది. వారి యభిప్రాయాలపై నాకున్న గౌరవమంతటిది. అందువల్ల-సదా వారు నన్ను విమర్శిస్తూనే వుండవలె! అదే నా ఆశ! గురుశిష్య సంబంధమంటే - యింతకన్న మరేమి ?

ఇంకొకమాట! నావ్రాత ప్రతిని శ్రీయుత 'మాళ్వాడ్' మహాశయుల సన్నిధికి పంపమన్నారు ధార్వాడ్ సంఘం వారు. వారుగూడా ఆ సంఘానికి ఒక సలహాదారు! ఆయన వృత్తితో

ఉపాధ్యాయుడు. మనస్సుతోనూ ఉపాధ్యాయులే! పుస్తక మందిన వెంటనే ఎర్రసిరా తీసికొని - కేవలం అభ్యాస బలంతో - దడదడ తప్పు లనుకున్న వన్నిటిని దిద్దివేశారు. చక్కని వారి యీ అభ్యాసబలాన్ని సంస్మరించకపోతే - నాదిమాత్రం సద్బుద్ధి యెలా కాగలుంది? వారు వారికి తెలియకుండానే నాకు వుపకారం చేశారు. నేను తెలిసి ఆ వుపకారాన్ని స్మరిస్తాను.

ఈ కథలన్నీ తెలిసికూడా - నేనేమీ దిద్దకున్నా - దిద్దడమంటే వేరే కథను వ్రాయడమేనన్నమాట! దీనినే ప్రకటించే సాహసానికి పూనుకొన్న హైదరాబాదు సాధనా ప్రకాశనాధికారి యైన శ్రీ ప్రాకాశాచార్యుల నభినందించకుండా వుండలేను. ఆయన నా మిత్రుడు.

ముఖచిత్రం సుందరంగా వ్రాసియిచ్చిన శ్రీ 'ఆళందికర్' మహాశయులకు నా కృతజ్ఞత!

"సరస్వతీ సంహారాన్ని" నాచేతితో చేయించిన మహాశక్తి తొందరగా లక్ష్మీపూజనుగూడా చేయించుగాక!

బళ్ళారి.
5-10-1956.

అందరికీ మీవాడే,
బీచి.

ఈ సాత్విక పాత్రల యసహాయతను మనోహరముగ చిత్రించు సన్నివేశము పూర్తిగాకమునుపే రంగములోనికి గౌరమ్మ బాళప్ప ప్రవేశింతురు. వారు వీరి మానసిక సుఖమునంతయు సర్వనాశన మొనర్తురు. గోకర్ణేశ్వర దృశ్యముగూడా నీకారణమునకు సృష్టింప బడినట్లె నాకుదోచును. భాస్కరభట్టులది సంధిగ్ధపాత్ర!

సాత్వికుల మనోరంగమును జిత్రింపక వారి యసహాయతను మాత్రమే వర్ణించినచో పాఠకుల హృదయములపైనది విపరీత పరిణామమొనర్చి తీరును. కనుక మీరీ సన్నివేశమును గొంతమార్చుట యుక్తముగాదు. ఈ సంఘములోని సదస్యులు పల్లెటూరివారు. నాలుగు ముక్కలు నేర్చిన నావంటివారైనచో- నెట్లోయొకరీతి యీ పరిణామములకు తట్టుకొనగలరు. మరివారిగతి?

ఈ కారణములతో మున్నుడికిబదులు దీర్ఘమైన యీకమ్మను మీకువ్రాయవలసి వచ్చినది. క్షమింతురుగాక! సమితికిగూడా నీ పుస్తకముపై నాయభిప్రాయమును దెలిపితిని. నాయీస్వాతంత్ర్యమునకు నన్ను తమరు సానుభూతితో జూడవలెను. తమ యితర రచనలందువలెనే దీనియందును కళాప్రతిభకు దక్కువలేదు. నేనువ్రాసిన యీ కొన్నిమాటలు గూడా నాధోరణికి సంబంధించినవే!

ధారవాడ,
21-2-1956.

సప్రేమ వందనములతో,
మీ స్నేహితుఁడు,
వి. కృ. గోకాక్.

గురరాజీ ... ...

కొద్ది రోజులక్రితం అభిప్రాయానికి బదులు తమరు నాకు వ్రాసిన దీర్ఘలేఖను ప్రకటించుకోవడానికి తమ అంగీకారాన్ని కోరుతున్నాను. ఏమరంగీకరిస్తే ధన్యుణ్ణి!

28-9-1956.

సదావిధేయి,

బీచి

మిత్రమా!

నేను వ్రాసిన జాబును ప్రకటించుట నీయుదారతయే! అవశ్యము ప్రకటింపుము.

29-9-56.

నీ ప్రేమ పాత్రుఁడు,

గోకాక్.



అమెరికానుంచి ఆహారాన్నిపంపడానికి వాళ్లు యిష్టపడలేదో - లేక రష్యానుంచి తెప్పించుకోవడానికి అధికారులే భయపడ్డారో? ఎవరైతే నేమి? అంటూ యింటూ భారతదేశంలోని బీదజనులకుమాత్రం అన్నానికి "కటకట" లాడే అవస్థ పట్టింది.

రెండుమూడు వారాలముందే మంత్రులు చౌకడిపోల నేర్పాటు చేశారు. కాని వాటినుంచి బయటకి ఒక్కగింజబియ్యం రాలేదు. ఒక గోధుమగింజ తొంగిచూడలేదు. ఈపరిస్థితిని పోగొట్టుటకు తగిన వుపాయం ఆలోచించడంలో నిమగ్నులైనారు - ఊరినిమేపి పెద్దలైన వారు - ఊరినిమేసి పెద్దలైనవారు. వీరందరూ ముందుకు వచ్చిసమంగట్టి ఊరూరా ఒకచండీహోమాన్ని కొట్టిపారవేశారు.

దినమూ నోరుగొట్టుకొనే వానికి చాలక- "పోరిష్పప్పుము" ఒకటి వస్తే ఇకచెప్పాలా? వానితదాఖా! అలాఅయింది దేశపరిస్థితి! నేను ముందు - నేనుముందని వాలందరూ దూకి సుమారు ఐదారువేల రూపా యలచందాను ప్రోగుచేశారు. అందులో నికరంగా మేయిహాపాయం

ఎంతకూ ఖర్చుపెట్టారు. లెక్కేనదేముంది? వారినెవ్వరూ అడగలేదేమో. వారుచెప్పిందీలేదు. వారు భోజనాలేర్పాటు చేశారు. దాంపత్యమనేది ఒక సంపత్తు. దంపతులకంతా ఆహ్వానాలువెళ్ళినై. “తాళి ” అనేప్పురవిగించిన ప్రతివానికీ సన్మానమే! తాళియనేపేరిట ఒకదారాన్నిబిగించుకున్న ప్రతిస్త్రీకి ఐదువపూజ! పతిదైవానికి ఒక జతపంచలు! సతిదేవానికి ఒక చీర, రవికె! డాల్డానెయ్యితో తయారైన ‘ లాడు ’ వుండలు - తిన్నన్నితిని - తెచ్చుకోగలిగినన్నీ తెచ్చుకొన్నారు మూటగట్టుకొని వూళ్ళోవాళ్ళు. చెయ్యి చాచినవానికంతా నాలుగణారూకల దక్షిణ. ఊళ్ళోవాళ్ళందరూ యీదేశభక్తులుచేసిన అన్నదానానికి వారిని వెయ్యిముఖాలతో పొగిడారు.

భాస్కరంభట్టుకూ రెండుపంచలిచ్చారు. అందులో ఒకటి అంచులో కొంచెం చినిగిందన్న అనుమానంతో గౌరమ్మదానిని తీసికొనివెనక్కిపోయి భోజనాలదగ్గర సత్యాగ్రహంపట్టింది. ఒక గంటకాలం ఆమెధర్మనిష్ఠసాగిన తరువాత సత్యాగ్రహాన్ని గౌరవించే స్వభావంగల దేశనాయకులు వేరే పంచనిచ్చి గౌరమ్మను మర్యాదగా పంపారు.

ఏమైతేనేమి? ఎంతతింటేనేమి? ఇంటికెంత తెచ్చుకుంటేనేమి? ఇంట్లో అడుగుబెడుతూనే గౌరమ్మ బావురుమనియేడ్చింది. ఆమెదుఃఖానికి కారణం బాకప్ప బ్రహ్మచారిగా వుండడం. అప్పుడు గౌరమ్మదుఃఖంజూచిన యిరుగుపొరుగువాళ్ళకు ఆయింట్లో ఎవరో చచ్చివుంటారన్నస్ఫూర్తి తప్పకకలిగివుంటుంది. ఏడ్పులో మధ్యమధ్య గౌరమ్మగారి వాగ్ధోరియిలా ప్రవహించింది:.

“ఆ సాయిపల్లి రామాచారిగాడు దుష్టుడో భ్రష్టుడో అవును నమ్మవే - ఎవడోవాడు ...... వానికి పన్నాయిగేంట్లే ఎమూం సంసహా

వాని కోసకు యింకా ప్రాణియుండి చెరువులో ఏనుగులతో ఆడుకుంటాడు. ఇదిపోతున్నావే - ఈ వెయిగు నాగరత్నమ్మకొడుకు ...... ఆ రోజె ... వాడెప్పుడూ గంతులు వేస్తూనేవుంటాడు ! రాటీ రంగమ్మకొడుకు వాడొక ఉంతరాయి! వాడికింకా అమ్మేపంచకట్టించాలి! ఈ ముండాకొడుకులకంటా పెండ్లైందనేనెపంతో పెండ్లిపాపలాలు - మావాళప్పమాత్రం ఏం పాపం చేశాడూ - అంటాను. వాడికింకాపెండ్లిగాలేదు. అయితేనేం? వచ్చేనెలకు పదిహేనేండ్లు నిండిపోతవి. వాళప్పపొట్టలో ఒక రాయరాస్తే - ఆలోకు మనూ - దానివివాహాన్ని జూసిచస్తే - నాకంతేచాలు ! నాకేం ! యీభూమి మీద చాలారోజులు బ్రతుకవలెనను ఆశలేదంటేలేను........అప్పుడు సంతోషంగా నాపదవరోజు శ్రాద్ధంపెట్టండి. మనవాళన్నకు పెండ్లిపావలా రాకపోయిందీ ! ఇకప్రపంచంలో చేమిదిన్కా వానికి వివాహమయ్యే వరకు ! నేనుయింటిలో ఒంటిగాకూర్చొని కాకిరింపిలిసరేసూ అంటే తినలేను. ఇంటికథ మీకేంపట్టింది?" గౌరమ్మ భాస్కరభట్టువైపు గుర్రురిమి చూస్తూ మాటకుతగినట్టురాగాన్ని జోడిస్తూ ఒకచేయేదుప్పులంకించుకుంది.

ఎలానూ రాత్రికి వంటలేదు. రాత్రిభోజనంగూడా మధ్యాహ్నమే ముగిసింది. మూలన పండుకున్న గౌరమ్మ అంగుళమైనా కదలలేదు. పడకైనా పరుచుకోలేదు.

వాళప్పను అడిగినవారేలేరు. చెంబులోనుక్కుకొని తెచ్చిన పదు నేను ఎంగిలి లడ్లనుమాత్రంతిని ఆకలితో అరుస్తూ - అరచి అరచి-అలాగే పండుకొన్నాడు పాపం !

ఇక భాస్కరభట్టు కథ తెలిసిందే ! శృంగేరిప ...లో యిచ్చిన శాలువముసుగుపెట్టుకొని పడుకున్నాడు. ఆయనతన ... వ్వకుంటూ ఇలా అనుకున్నాడు :

సరస్వతీ సంహారము

"ఈ బాళిగాడనే పిచ్చిగుఖ్ఖానికి ఆయుస్సింకాయెంతుందో! చాలని దానికి వీనివైభవానికొక కన్యనుగూడా అరూలివ్వాలట! వీనివంశం అభివృద్ధిగాకపోతే ఏ సింహాసనంపాడైపోతుంది? ఈ పాడుగుండాకొడుకునుగూడా భూమిమీపైన ప్రతికించినావేమప్పా! పరమేశ్వరా!" ఇంతేగాదు. ఇలాంటివింకాయెన్నో అనుకున్నాడు భాస్కరభట్టుమనస్సులో!" అనుకుంటూ అనుకుంటూనే తెల్లారేవరకు హాయిగానిద్రించాడు.

తెల్లారింది. మనుగుడీప చంకలోపెట్టి తల్లి గౌరమ్మప్రయాణంకానే అయింది.

"అచ్చినిచూచి చాలా రోజులాయె! ఒకటి రెండురోజులుండివస్తా నప్పా! బాళా! హరంగితంచెయ్యొద్దు! ఇల్లుదాటిపోవద్దు. ఎట్లా మీ నాయన అన్నంవండుకుంటాడుగా!"

నాయన తోడిన అన్నంరాశిముందు గూర్చున్న బాళప్ప వుత్సాహంగా తండ్రినడిగాడు:

"అమ్మ ఎక్కడికి వెళ్ళిందప్పా?"

భాస్కరభట్టుఅన్నాడు:

"నీవుగొంతుపిసికి బాయిలో వేయాలని నీకోపెండ్లాన్ని తీసికోరావడానికి పోయింది, సరేగాని అన్నంకుప్పముగించు."

౨

బ్రహ్మానందశాస్త్రిగారంటే ఎవరికితెలీదు। ఆయనప్రందేవ్వారిలో మాత్రమేగాదు-చుట్టుపట్టుగ్రామాలలోగూడా ఆయనపేరుప్రసిద్ధి. అంతేనా? రెండుమూడు జిల్లాలలో ఆయనపేరు ప్రాకిపోయింది. ఇకపల్లెల్లో అం దామా? చిన్నచిన్న ఆడపిల్లలకంలా బ్రహ్మానందశాస్త్రిగారంటే తమ్ముళ్ళ అనేఅభిప్రాయం.

ఆప్రాంతంలో బ్రహ్మానందశాస్త్రిగారిని తెలియనివారులేరు.ఆయ పూర్తిగా అర్థంచేసికొన్నవారూ లేరు. కొందరు ప్రాపంచికులాయ పిచ్చివాడనుకుంటే ఊళ్ళోని స్త్రీలంతా ఆయన్ను ఒక అవతారం అను కున్నారు. కొందరికి బ్రహ్మానందశాస్త్రి పరకవియనిగుర్తు. ఆయనగొప్ప పండితుడని కొందరి అభిప్రాయము. ఏడుమందిగుడ్డివాండ్రు పరీక్షించిన ఏనుగులాగుంది ఆయనపరిస్థితి. ఎదుటివారెంతవరకు యోచిస్తే శాస్త్రి జీవితం వారికంత మాత్రమర్థమౌతుంది. ఇంతకూఎవ్వళ్ళో అందరిదృష్టి బ్రహ్మానందశాస్త్రిపైని ఏదో ఒక విధంగా వున్నదనేది సత్యం.

ఆయనకు వయస్సేమో యాభైయేండ్లు, అయినామనస్సులో వుండే బాల్యమే మాత్రము తగ్గలేదు. ఆహృదయ మొకశిశువు. ఆయనను ఎ

చిలోనైనా పోట్లాడాలంటే మనిఅద్దంలోనే పోట్లాడాలి! ఆయన నామధేయం అన్వర్థకమూ సార్థకమైనది.

నాటకాల్లో కర్ణునివేషం వెయ్యాలంటే అనసాలిరామప్ప రాత్రి పన్నెండుగంటలకైనా సరే శాస్త్రిగారితోనే ఆకర్ణుని "పోర్షన్" చెప్పించుకొని తాను చెప్పిపోవాలి! గాజిగ బసవయ్య దుర్వాసవేషం గట్టేవాడు. ఆపాటలు నేర్చుకోవడానికి నాట్యం నటించడానికి బ్రహ్మయ్యగారి వాకిట్లోనే ఇరువదినాలుగు గంటలూ కాపురం. క్రొత్తగా ఒడుగైన భీమా వారి కొడుకులిద్దరికీ త్రికాల సంధ్యావందనమూ శాస్త్రిగారే చెప్పాలి! వైరాంగం హనుమప్పకూ విత్తనాలు విత్తడానికీ - పంట కొయ్యడానికీ - కళ్ళంలో కుప్ప వేయడానికీ - తిథివారనక్షత్రాలు శాస్త్రిగారే నిర్ణయించాలి! లేకుంటే వానికి తృప్తిలేదు. ఊళ్ళో ఆడవాళ్ళ మగవాళ్ళ కొట్లాట తీర్పుచెప్పేది బ్రహ్మానంద శాస్త్రిగారి పంచాయితీలోనే! అంతకు ...ందు ఎడమొగం పెడమొగమైన భార్యాభర్తలిద్దరినీ శాస్త్రిగారు సమాధపరచి ఒక మూలలో జేర్చి వెళ్ళారంటే సంతానోత్పత్తి అయినా ...నీ మరలా ఆపురుషుడు వారికి దర్శనమిచ్చేది. కోలాటమేసే ఆడపిల్లలకూ - బయట నాటకాలు కట్టే కుర్రాళ్ళకూ - రాజకార్యంపైన వూరికి మకాంవేసే చిన్న అధికారులకూ - అందరికీ బ్రహ్మానంద శాస్త్రిగారే కేంద్రము. ఇంకెందుకు? ఆరేండ్ల పిల్లాడు మొదలుకొని అరవైయేండ్ల ముసలివరకూ ఎవ్వరికేగాని శాస్త్రిగారు చిక్కకచిక్కక చిక్కాడంటే యుద్ధకాలంలో చక్కెర చిక్కినట్లే!

" పిల్లిపైన పాట పాడ " పని చుట్టుకునే ఆడపిల్లలూ - భీమరాయుడు వ్రాసిన లావణి వినడానికి కాచుకొన్న గరిడీపిల్లలూ - "కుమారరాయుడు వ్రాసిన భారతం"లోని 'రవికాంతమందు రవిసూనుడు' అనేపద్యం

పాలించడానికి వచ్చిన "డిప్టీ యినస్పెక్టర్లు" పిచ్చిపిచ్చి ప్రణయ కథలు విందామని ఆశతో నిల్చున్న భోగం ముండలు - జైమినీ భారతం చదివించుకుందామని కూర్చున్న ఉపాధ్యాయులూ - శాస్త్రిగారు మనోహరంగా చెప్పే ప్రణయ కథలు విందామని వచ్చిన రసిక విటులు - గాంధీ గీత చదివించుకోడానికి వాల వాలంటీర్లూ ఎప్పుడు చూసినా శాస్త్రిగారింట్లో మకాం!

ఆయన కంఠంలో అమృతముండేది. పాడేకొద్దీ ఆయన శారీరం రాపు కట్టేదిగాదు. తీక్ష్ణమయ్యేది. ఆరాగం రశ్మిచ్ఛవలె సాగుతుంది. పాడే పాటలో చెప్పే విషయంలో తాను మరచి యితరులనుగూడ మరపించే శక్తిగలరాగం శాస్త్రిగారిది. ఆనందావేశంలో ఆయనకళ్ళు అశ్రువులను వర్షిస్తాయి. సంతోషంతో ఒళ్లుమరచిన ఆయన ఆడుతూ ఆడుతూ పాడే వాడు. అంటే ఆయన చుట్టు వున్నవారంతా ఆడుతారన్నమాటే!

కర్ణుడుగా నటించి యేడ్చినా, కృష్ణుడై నవ్వినా, అశ్వత్థామ మాటలు చెబుతూ అభినయించినా చుట్టూవున్న వారంతా తామూ ఆ యా రూపాలెత్తవలసిందే. ఆవేశపరుడైనా ఆయనకెందులోనూ ఆసక్తిలేదు. "ఆత్మ" అనే జోలలో తాను పండుకొని తనకుతానే లాలిపాట పాడు కుంటూ హాయిగా ఊగేవాడు ఏకాంతంలో! ఆయన జీవితం అపార దివ్య తపస్సులా వుండేది.

"లింగాయతులయిండ్లో రొట్టె తిన్నాడట ముండాకొడుకు! శూద్రులయిండ్లో తినబడితే కులముంటుందా?"

అని చాటటంగానే కొందరు పిల్లిజుట్టు బ్రాహ్మణులాయన్ను వెక్కిరిస్తుండే వాళ్ళు. ఒకసారి యీ యపవాదము శృంగేరి స్వామివారి చెవికెక్కింది.

"బ్రహ్మానంద శాస్త్రిల వారిది అవిచ్ఛిన్నమార్గం" అన్నారు ఒక రిద్దరు. ఒకరిద్దరంటే మాత్రం వూరంతా నమ్మేతుందా!

భార్య వెట్టివాగులదైతే భర్తమహావ్యవహర్తగా వుంటాడు. భర్త విజ్ఞుడు గాకపోతే భార్యనైనా ఆ"ఛార్జి" పుచ్చుకుంటుంది. ఇదే సామాన్యంగా సంసారాల్లో కనపడే నియమం! అందులోనూ భార్యలదే పై చేయి! కాని శాస్త్రిగారిల్లు యీ రెంటికీ అపవాదం! వారిల్లు ఒక ధర్మ సత్రంలా వుండేది అంటేనే మాట సరిపోతుంది.

"ఈయిల్లు నాదిగాదప్పా! నాయిల్లు - అక్కడ" అని ఆకాశాన్ని చూపేవారు శాస్త్రిగారు.'ఈయిల్లు నాదిఅనుకోవడం హుళక్కి'. ఈమాటలనేటప్పుడల్లా శాస్త్రిగారి కండ్లు ఆనందబాష్పాలతో తొణికిసలాడేవి.

స్కూళ్ళల్లో చేరే బీదపిల్లలకూ - సర్కీటువచ్చిన అధికారులకూ - సంతకు వచ్చిన పొరుగూరి రైతులకూ - అందరికీ శాస్త్రిగారిల్లంటే స్వగృహం!

ఇంతమందికి అన్నదానం చేయడానికి సామగ్రి ఎలావస్తుంది! ఈ రహస్యంమాత్రం ఎవరికీ తెలిసేదిగాదు. శాస్త్రిగారికీ తెలియదు! పిత్రార్జితం కొంత వుందని వారూవీరు అనుకొనేవారు కాని బ్రహ్మానంద శాస్త్రిగారికి తమ పొలమేదో తెలియదు. ఆయన యెన్నడూ గింజలు కొలిచి యెరుగడు. సాగుబడి పత్రము వ్రాయించి యెరుగడు. సాక్ష్యం వేసియెరుగడు. గిడ్డి హనుమంతు - దుర్గప్ప - మల్లప్ప - శాస్త్రిగారికి అనుచరులు. వారికి తెలియని రైతులేడు. పొలాల వ్యవహారమంతా వారే చూస్తారు. వారు తెచ్చిన పంట అచ్చుకట్టి వండుతుంది.

చింతకాయలు - మిరపకాయలు - బేడలు - బియ్యము - ఎవరెవరో తెచ్చి ఎవరెవ్వరోబ్రాహ్మలే యింట్లో కుప్పలు పోసేవారు. ఆయింటికి వచ్చిన

వాను పట్టించుకుంటో వెళ్ళిందిలేదు. అచ్చక్కా ఆయింటికి అన్నపూర్ణ ! ఆ యింట్లో ఆమె నడుస్తూ ఉంటే అక్షయపాత్రలు పొరుతుంటాయి ! సూర్యోదయము మొదలు అస్తమానముదాకా వండిపెట్టడమే అచ్చక్కా పని ! పైపని అంతా ఎదిగివచ్చిన పిల్ల సరస్వతి చూచుకుంటుండేది. శాస్త్రిగారి ఆనందానికి అంతేలేదు. "శిపుడు ఆదే యీ నాటకం యిలానే సాగనీ" అనేవారాయన ఆనంద బాష్పాలతో !

అసూయ - చాడి - నింద - మాత్సర్యము - ఇవి ప్రపంచంలో వుంటాయి అనే భావనగూడా శాస్త్రిగారికి లేదు. అంత సరళ హృదయు డాయన ! తాము మెచ్చుకొన్న వారి సద్గుణాలను "ప్రత్యేక్షి" చేసే దోషం శాస్త్రిగారిలో వుందేమోగాని జగత్ప్రసిద్ధులైన దుర్మార్గులను గూడా ఆయన నిందించి యెరుగడు.

శాస్త్రిగారిని మోసగించడమంటే శిశువును మోసగించడమన్న మాటే ! ఒకసారి బ్రహ్మానందశాస్త్రి అంగడిలో సామాను కొన్నాడు. ఐదురూపాయలనోటు సెట్టిచేతిలో బెట్టాడు. వాడు చిల్లర వెనకిచ్చాడు. దానిని యెంచుకోకుండానే శాస్త్రిగారు దారినిబట్టారు. సెట్టి నవ్వుతూ అన్నాడు. "డుడ్డెంచుకోండి ! పిచ్చిస్వాములూ."

బ్రహ్మానందశాస్త్రి వెనక్కు తిరిగి నవ్వాడు. ఆ నవ్వు శిశువులనవ్వు: "నీవెందుకు తక్కువిస్తావప్పా చిల్లర!" పాపం! శాస్త్రిగారు వెనక్కు తిరిగి చూడకుండానే యింటికి వచ్చారు. మానవులపై ఆయనకుండే విశ్వాసము విశ్వమంత విస్తృతము. చిల్లరలో ఒకరూపాయి తక్కువిచ్చిన సెట్టి శాస్త్రిగారింటికి నడచివచ్చి రూపాయియిచ్చి వెళ్ళాడు. ఆవిద్య సరస్వతి

తల్లిరంగెనూ అందగత్తె. తండ్రిరంగు చామనచ్ఛాయ. సరస్వతి తండ్రి యొక్క విశాలమైన నుదురు - తల్లియొక్క సుందరమైన ముక్కు - సొగసైన కళ్ళుమాత్రం తానుజన్మతః సంపాదించుకున్నది. తల్లిదండ్రులకు సహజగుణమైన సహృదయత సరస్వతికి నూటికినూరుపాళ్ళూ వచ్చింది. వయస్సు ఎక్కిరాకముందే సరస్వతి చూడడానికెంతో అందంగా వుండేది. కళ్ళను రంజింపజేసే రూపం - మనస్సును రంజింపజేసేగుణం. ఇంటికి వచ్చినవారందరూ సరస్వతిని ఎంతెంతో శ్లాఘిస్తుండేవారు. వారికొక్కొక్కసారి భాష చాలకపొయ్యేది. నతితో ఏమేమో అనేవారు. ఒకాయన మాత్రం చాలాబాగా చెప్పారు. "చిలకను సరస్వతి తోబుట్టువో సరస్వతికి చిలుకమ్మ తోబుట్టువో ఎవరికీ తెలియదట!" ఇదీ ఆయనన్నమాట! సరస్వతి పద్మినీజాతికి చెందిన పుత్తడిబొమ్మ. కురూపులు రూపంకోసం వేసుకునే వస్త్రాభరణాదులు ఆమెకులేవు. కురూపులు ప్రదర్శించేహొయలు అతివిలాసాదులున్నూ లేవు. కలకండవలె ఎక్కడబట్టినా తీపి ఆమెగుణాలు. పల్లెలోనే పెరిగి పెద్దదైన కారణంతో పట్నవాసపు చాకచక్యం అలవడకు రాలేదు. సరస్వతి ఉలితాకులేని స్వాభావికమైన విగ్రహంలా వుండేది. ఒకానొక అడవిలో తనకుతానై పుట్టిన స్ఫటికలింగంలా వుండేది.

బ్రహ్మానందశాస్త్రిగారి యిల్లే సరస్వతికి విద్యాలయము. కంచిభట్ల సుబ్బుడు ఒడుగు జరిగింది మొదలుకొని సంధ్యావందనం శాస్త్రిగారి దగ్గర దినమూ భట్టీపెడుతూనే వున్నాడు. వాడికి పెండ్లయ్యేవరకు సాగింది ఆపాఠం. కాని సంధ్యావందనం రాలేదు. శాస్త్రిగారిని మరువడు. ఇంటిపనులు చూచుకుంటూ మధ్యమధ్య వారిపాఠాన్ని వింటున్న సరస్వతికి మాత్రం మొదటినుంచీ చివరివరకూ కంఠాపాఠమై పోయింది.

ఆమెకింకా ఏయస్సేనిమిదేండ్లే! కాని శబ్దాలు - సం.
జరి అమరమూ - దేవునిపూజా - పురుషసూక్త శ్రీసూ
పాఠమైపోయినవి. వేదమంత్రములామె కించిత్తైనా స్వరంతో
గంటకొట్టినట్లు చెప్పేది. ఒకనాటి సాయంకాలము నగరేశ్వరుని గుడిల
అశ్వఘాటిలోనుంచే దశావతారస్తుతి శ్లోకాలు శాస్త్రిగారు సరస్వతి నోటి
నుంచి చెప్పించారు. తలపు శాలువలు చుట్టుకొన్న అవివేకిశాస్త్రి ఎం
దరో ఆనాడసూయ పడ్డారు.

ముగ్గిన పండుపంటి పెద్దాప్పద్దుతైన శంకరదీక్షితుడు సరస్వతిని
నిండుగా కౌగిలించి ఎత్తుకొన్నాడు. సరస్వతి జాతకత్రలంద రాసుకొన్నాన్ని
జూచి ఒకచేనవ్వు. శంకరదీక్షితుల కండ్లనిండా ఆనందబాష్పాలు.
ఆయనన్నాడు:

"శాస్త్రిగారూ! యీబిడ్డనుకన్న తల్లిదండ్రులిద్దరూ ధన్యులు.
పూర్వార్జిత పుణ్యఫలంతో యీరత్నం మీకుదొరికింది."

నోటినిండ పొగడి - కండ్లనిండచూచి - మనసునిండ ఆనందించి
శంకరదీక్షితుడు సరస్వతిని ఇంటికంపారు. "దాము మనస్ఫూర్తిగా ఆశీర్వ
దించమని" బ్రహ్మానందశాస్త్రి అభిమానంతో అన్నారు. దీక్షితులు
నగరేశ్వరునివైపు చేయిచూపుతూ యింటిదారి పట్టాడు.

## ౬

అదినవరాత్రి. సాయంకాలం. ఊరికీఫూరే పండగల సంభ్రమంలో మునిగిపోయింది. పసరా బొమ్మలపెతె సింగారించికొని ముత్తైదువులూ పడపిల్లలూ పేరంటాలకు బయలుదేరారు. తిరిగితిరిగివేసరిల్లి ఆయాసం పోపడానికి "సోడాలు" తాగి పులులవంటి మగపిల్లలు బజార్లలోతయారు. ఊళ్లో ఎక్కడజూచినా వేడుకలే! కార్యక్రమాలే! గోపాలకృష్ణుని గుడిలో కృష్ణమాచార్యుల సంగీతకచ్చేరి. మరులు సిద్ధయ్య ఫిడేలు. సన్మార్గమందిరంలో ఈశ్వరగౌడుగారి ఉపన్యాసం! వీరశైవుల పాఠశాలలో శివపురాణకాలక్షేపం: సాంబమూర్తి మైదానంలో సోషలిష్టుసభ. 'అజాద్' క్లబ్బులో 'ఇస్పేటు' పంచాగం. ఇన్ని కార్యక్రమాల్లోనూ ఇసుకవేస్తే రాలనంత జనం! ఇదిచాలక నడివీధిలో విద్యార్థులు తోసుకుంటూ పెనుగులాడుతూ - ఎదురువచ్చే పొయ్యేవాళ్ళను పిక్కికొడుతూ....

కన్యకాపరమేశ్వరి దేవాలయంలో "కీర్తనకేసరి" జూటూరు నాగమయ్య పండితుల హరికథాకాలక్షేపం అని బ్రహ్మాండమైన ప్రచారం సాగింది. కరపత్రాలు తెలుగులో అచ్చువేసి ఊరంతా పంచారు. దేవాలయం ట్రస్టీ గుమ్మన్న గురునాథశెట్టిగారు కానే ముందునానిలిచి అన్నిఏర్పాట్లు చేశారు. ముందే తనమొక్కుబడిగా నాగమయ్య పండితుల పూరికి

పంపించి మాటా కథా ముగించి రమ్మన్నారు. అన్నియేర్పాట్లు జరిగినై! కాలక్షేప పండితునకు అన్నాప్పుముండే అందించారు. ఉపసప్తాహమైనా కాలక్షేపం జరిగితీరవలసిందేనని సెట్టిగారి పట్టుదల! దీనికి వేరేకారణం కూడావుంది:

"కోమట్లు యేర్పాటుజేసే తెలుగుహరికథకు ఎవరు వెళ్తారు" అని ఎవరో లింగాయతు బ్రాహ్మణుల హోటల్లో కూర్చొని కాఫీతాగుతూ ఎవరితోనో అన్నాడట. అన్నవాడు లింగాయతు అన్నది ముసల్మానుతో. ఆ వార్త సెట్టిగారితో విన్నవింపజేసిన ముఖ్యస్నేహితుడు క్రిష్టియను. ఆ మాటతో గుగ్గుళ్ళ గురునాథంసెట్టికి వీరావేశం వచ్చింది. మీసంపైన చేయి వేసి "ఎట్లాజరగదో చూస్తా"నన్నాడు. మీసంపైన ఆచేయివేయడమే యీ సంభ్రమానికంతా కారణం!

నాడు ప్రతిపత్తు. నాగమయ్య పండితుల నోటినుంచి తెలుగు "శశిరేఖా పరిణయం" వినవచ్చుననే ఉద్దేశ్యంతో కన్యకాపరమేశ్వరి గుడినిండా జనులు కిటకిటలాడు తున్నారు. ముత్తైదువులు తొందరగా వంట ముగించుకొని వచ్చి చోటుచూచుకొన్నారు. హాకీఆట అర్ధంలోనే ముగించి విద్యార్థులుపరుగెత్తుకొని వచ్చారు. రాత్రిళ్ళు భోజనపు జంజాటం లేక పోవడంతోచాలినన్ని మంచినీళ్ళుత్రాగి 'గంగా భాగీరథులు' అక్కడక్కడా తయారైనారు. ఈగుంపులో నడుమనడుమ సిల్కుసెల్లాల రసికులూ! హరికథ యింక ఘంటకారంభమౌతుందనగా దేవాలయమంతా ఒక్కటే జనమయం!

కర్ణాటక సంఘంలో 'పిట్టకథలపెద్దతనం'మీద ఉపన్యాసంసాగింది. ఊళ్ళోవున్నపెద్ద ఉపన్యాసకులే దొడ్డచర్చలు సాగించారు. మొదట్లో హాలు

జనంతో నిండిపోయింది. క్రమక్రమంగా సంఖ్య తగ్గడం మొదలైంది. అరగంటలోపలే అందరూ జారుకున్నారు. సభలోముందుగూర్చున్న పక్కా కళాభిమానులుగూడా లేచివచ్చి తెలుగుహరికథవినే అధోగతికి పాల్పడ్డారు. వచ్చిన జనాన్నిచూసి గుగ్గుళ్ళ గురునాథంసెట్టి మీసంపైన చేయి మరోసారి వేసికొన్నాడు.

"సరస్వతీ, కావాలంటే గుడికి పోయిరామ్మా!" జడవేస్తూ అచ్చక్క యెడమచేత్తో సరస్వతిగడ్డం త్రిప్పకొని నవ్వుతూ అన్నది. గుడికి పోవాలనసే ఆశ సరస్వతికేమో చాలినంతవుంది. కాని పొద్దస్తమానం ఇంట్లోదోకడమే పనిగా పెట్టుకొన్నతల్లిని ఒంటిగా విడచి తానొక్కతె హరికథకు పోవడానికి బిడ్డకుమనస్కరించలేదు.

"నీవూవస్తే"

"నేనూవస్తే యెలాగమ్మా! ఇంట్లో వంటకావద్దూ! పో! ముఖం కడుక్కొని నీవునడువు. ఇంటిపని నేను చూచుకుంటాను. చిన్నపిల్లలు మీరు. మీరిల్లాంటివి జూస్తే మాకూసంతోషం! నాదేముంది గనుక! అంతా ఐపోయింది."

"నేనుపోనే అమ్మా! ఇంటిపనే కొండంత ఉంది!" పొంగుతుండే నిరాశా - అసంతోషం - మొదలైన భావాల నగుపడనీకుండా మనస్సులోనే అణచుకుంటూ అన్నది సరస్వతి.

"పిచ్చిపిల్లా!" అని యేమో గొణుక్కుంటూ అచ్చక్క వంటింట్లోకి వరువెత్తింది.

జూటూరు నాగమయ్య పండితుని దీసికొనిరావడానికి గుంతకల్లుకు పోయిన జీవుకారు తిరిగివచ్చింది. అప్పటికే యెంతో ప్రొద్దుపోయింది.

ఇంతకూ లాభమేముంది? పండితులు లేకుండానే వట్టికారు తిరిగివచ్చింది. కారును జూచిన గురునాథసెట్టి ముఖంలో కాటువేస్తే రక్తంలేదు. కూర్చు న్నవాడు కూర్చున్నట్లుగానే యేడ్పుమూతి పెట్టాడు. సెట్టిగారి హెడ్డు గుమాస్తాగూడా యేవిషయమూ చెప్పనేలేదు.

జనులంతా కారును చుట్టుకున్నారు.

"ఏమి! ఏమి! ఎందుకురాలేదాయన ?"

ప్రతి ఒక్కడూ యిదేప్రశ్న.

సెట్టిగారి హెడ్డుగుమాస్తా ఉగ్రాణపు మూలగదిలోకి పోయి కూచున్నాడు. గురునాథసెట్టి వానిని వెన్నంటాడు. ఒక కాలుగంట గుజ గుజలు సాగినవి. సెట్టిగారి ఉత్సాహమంతా చెప్పకుండానే తగ్గిపో యింది. జ్వరంవచ్చిందనే వ్యాజంతో సెట్టి ముసుగుపెట్టి పండుకున్నాడు. ముఖం రక్షించుకోవడమే కష్టమయిందాయనకు!

హరికథాకాలక్షేపానికివచ్చిన వారికంతా సాంగోపాంగంగా వృథా కాలక్షేపమేమో సాగింది. ఏదోఒక కాలక్షేపం! వారికి కావలసిందంతే! ఆ జనంలో నాగమయ్య పండితులు రానిదానికి ఎన్నోరహస్యాలు - ఊహాపోహలు బయలుదేరినాయి!

"కోమట్లు గంటు విప్పుతారా? పేరుడబ్బివ్వలేదు. ఆయనరాలేదు. హరికథ ఉద్దరకు చెప్పించుకుందామని యెత్తువేశాడు గురునాథశెట్టి!" బీడీ తాగుతూ తిప్పేరుద్రప్ప అపహాస్యంగా అన్నాడు.

"సెట్టేమిటయ్యా యిచ్చేది? తనతండ్రి రామసెట్టి సొత్తేమైనా యిస్తాడా! ఊళ్లో చందాలెత్తాడు. ఆదేఇస్తాడు, కుక్కలను గొట్టినక్కలకు వేస్తాడు. ఇక తకరారేమిటి."

పురోహితలక్షణాచారి చిన్నబోయిన కన్నులతిప్పుకుంటూ పలికినాడు:

"అలాగ్గాదయ్యా! ఆయనడబ్బు ఆయనకే యిచ్చేస్తే తనకేం మిగిలినట్లూ అని గురునాథంసెట్టిచింత!"

కంసాలి విరూపాక్షయ్య యీ మాటంటూ కండ్లతో ఆ భావాన్ని అనువదించాడు.

"పండితులకేమో జ్వరంవచ్చిందట."

"నీతలకాయ! ఆయనక్కాదు! ఆయనభార్యకట!"

"ఏడిచావు! నాగమయ్యపండితులకు భార్య యెక్కడుంది? ఆయన రిటైర్డు బ్రహ్మచారి."

"అలా అయితే ఆయనబిడ్డకయివుంటాలి! అంటూ ఎవరికో జబ్బు అన్నారప్పా!"

"గురునాథసెట్టికిరే!" అన్నాడొకాయన.

"జ్వరంలేదు గిరంలేదు లేవోయ్! మద్రాసులో ఎవరోమంత్రిఅట! ఆయన యింటిలోవివాహం! అందువల్ల యిక్కడచక్రంవేసి పండితుడక్కడికెళ్ళాడు." ఇంకోఆయన ప్రసంగం జాబీలోకితిప్పినాడు.

"దుడ్డంటే చేదెవరికిలేదోయ్! డబ్బొస్తానంటే నీవువిడుస్తావా! చెప్పు!"

ఊరి రాంగోపాలు అధ్యక్షుడు పుత్యంపంటి యీమాటతో అందరి నోళ్ళూ కట్టేశాడు.

" 'కీర్తనకేసరి' జూటూరు నాగమయ్య పండితుల 'హోర్డాలు'లో వుండిన గ్రాందీనాటిక్ కూలివానిఅజాగ్రత్తతో గుంతకల్లు 'ప్లాట్ఫారమ్' లో నేలపై బడింది. దానిపరిణామంగా పండితులవారు పోలీసులకు చిక్కి రాత్రంతా కృష్ణజన్మస్థానంలో పడకవేశారు." ఈ వార్త అల్లుకుంది.

హరికథ లేదనిచెప్పినా జనులక్కడనుంచి కదల్లేదు.

ఇల్లుకదలని బ్రహ్మానందశాస్త్రిగారిని కొంతమంది పిల్లలు పట్టుకున్నారు:

"తాతా! నేడుహరికథ నీవంతే!"

శాస్త్రిగారిని వెతుక్కుంటూ ఆ చీకటిలోనే భీష్మాచార్యులవంటి శంకరదీక్షితులు యింటికివచ్చారు.

"బ్రహ్మప్పా! మనసరస్వతి యేదీ! "

పదినిముషాలయింది. నిరాడంబరంగావుండే ఒకచీరకట్టుకొని సరస్వతివంటి సరస్వతి ఆ మహాసభముందు నిలుచుంది.

వృద్ధదీక్షితులు రెండేరెండుమాటలతో సరస్వతిని సభకుపరిచయం జేసి ఆమె మెడలో చిన్నపూలమాలవేశాడు.

"అదే శశిరేఖాపరిణయంకథ కన్నడంలోసాగుతుంది. దయతో వినవలసింది" అని సభికులను ప్రార్థించి దీక్షితులుకూర్చున్నారు.

సరస్వతి ప్రసన్నురాలైంది. హిమాహిమైనవాణీదేవి అలంకారస్యము నారంభించింది. చిన్నపీఠికతో ప్రారంభమైనహాసరేఖ క్షణక్షణానికి రక్తి కడుతూవచ్చింది.

“ఇదేంపిల్లాటా!” అనిమొదట హాస్యంచేసిన పెద్దలంతా పది నిముషాలుగడచినవో లేదో శరీరాలుమరచి చెక్కబొమ్మల్లాగకూర్చు న్నారు “ మలగి పరమాదరదిపాదలు ” అనేకీర్తనను శంకరాభరణంలో ప్రారంభించింది. అది రాగమాలిక. అయిదు రాగాల్లోనూ దాన్ని సరస్వతి పాడింది. ధన్యాసి, మోహనరాగముల మూర్ఛనలను చక్కగాపట్టి ధర్మవతీ రాగాన్ని ప్రపంచించడాని కారంభించింది. తారాగాంధారంమొదలుకొని మధ్యమపంచమ స్థానంపదంగా క్రమంగా ఒక్కొక్క స్వరాన్నిగూడా జారుడులతో పట్టుకుంటూ వచ్చినప్పుడు కన్యకాపరమేశ్వరీ దేవళంలోని స్తంభాలు తలలాడించినట్లయ్యేను. కూర్చున్నసభ్యుల శరీరముల నిండా పులకలు పుష్పములవలె విరిసినవి. ఆమెపాటలో ఒక సాహిత్యలోపమూ కనిపించలేదు.

శంకరదీక్షితుల కన్నులలో ఆనందబాష్పాలు ధారగా కారిపోతు న్నాయి. రాగమాలిక మధ్యమావతి రాగంతో ముగిసింది.

కాలక్షేపం ప్రారంభమయింది. కృష్ణుని కుటిలతంత్రమూ - బల రాముని కోపసంతాపాలూ - ఘటోత్కచుని మాయాకౌశల్యమూ - శశిరేఖ అపహరణమూ - ఒక్కొక్క ఘట్టమూ సభ్యుల మనోనేత్రమందు స్పష్టంగా ప్రత్యక్షమయింది.

చిత్రఫలకంలోవ్రాసి చూపించినట్లు శశిరేఖ కల్యాణమూ ముగి సింది. సరస్వతి మంగళంపాడింది.

ఇంతవరకూ శరీరాయమువిచ్చిన్న సభికులుఒక్కొక్కరే బాహ్య జగత్తులోకి వచ్చారు. హాంతితత్తులోనికెంకలో రూపాయి విసరివేశారు మూల మూలలనుంచి కానులు కుప్పలుగా పడ్డవి.

“శాంతి! శాంతి!” అంటూ గురునాథసెట్టి పరుగెత్తుకుంటూ వచ్చినాడు. సెట్టి తన మనుమరాలి వయస్సులోనున్న సరస్వతికి చేతులెత్తి నమస్కరించాడు. ఏమో పల్కాలనుకొని అతనిభావన! కాని అతనికంఠం రుద్ధమయ్యింది. ఆనందాశ్రువులునిండి కన్నులు కనపడటంలేదు. హృదయం భావావేశంతో ఊగింది. ఏమనటానికీ పాలుపోక చేతులుముకుళించి కాని సెట్టి సభలో మానిబొమ్మవలె నిలుచున్నాడు. అప్పుడు సెట్టిని చూచిన సభకంతా అత్యాశ్చర్యమయింది.

“రావమ్మా! బాలసరస్వతి”

గురునాథసెట్టికి పైనమాటలు రాలేదు. జేబీలోనుంచి వచ్చకాగితంలో చుట్టబడిన బంగారుకంకణాన్ని, ఆయన గద్దకు దీశాడు. ఆ కంకణంలోని రాళ్ళచెక్కడపుపని అందరి కన్నులనూ జిగేలు మనిపిస్తూవుంది. ఆవేశంతో గురునాథంశెట్టి యిలాఅన్నాడు.

“ఈకంకణం నాదికాదు. ఈఊళ్లోని శ్రీమంతులందీగాదు. ప్రసన్నురాలైన కన్యకాపరమేశ్వరి సాక్షాత్సరస్వతికి పెట్టించినకానుక! తీసికోమ్మా!”

పంగణాంతిరపట్టులో నూటరూపాయల నోట్లు పెంటుపెట్టి సరస్వతికి యిచ్చి గురునాథంసెట్టి శంకరదీక్షితులకు దీర్ఘనమస్కారం చేసి వెనక్కుతిరిగాడు.

సభ అంతా దిగ్భ్రాంతమైంది. కూర్చున్న సభికులకంతా కన్నులు చెమ్మగిల్లాయి. తమకు తెలియకుండానే సరస్వతికి నమస్కరించారు.

రాత్రి పదిగంటలు గడచినవి.

శంకరదీక్షితులులేచి నాలుగు "మంచిమాటలు" పలికాడు. మాట మాటకూ కంఠం పొంగుతుండగా వృద్ధదీక్షితులు సరస్వతిని ముక్త కంఠంతో పొగిడాడు.

ఈమె మనుష్యమాత్రురాలు గాదు. దేవతలు పంపగా భూలోకానికి వచ్చిన అద్భుతవ్యక్తి. ఆశ్చర్యకరమైనశక్తి యిది." అంటూ వృద్ధ దీక్షితులు సరస్వతి తలపై చేయిపెట్టి కండ్లకు తాకించుకున్నాడు.

శృంగేరి పీఠస్వాములు సాక్షాత్ శారదాదేవికి పూజజేసినట్లుండినది ఆ దృశ్యము!



## ౭

సరస్వతి ప్రదర్శించిన చాతుర్యాన్ని ఆమె శక్తిని గురించి వారు అత్యాశ్చర్యంగా చెప్పుకుంటున్నారు. ఈమాటలు విన్నతరువాత తానుగూడా హరికధకు వెళ్ళివుంటే బాగుండేది అనుకుంది అచ్చమ్మ. కాని యీ విషయంగూడా ఆమె బయటఅనియెరుగదు. అచ్చమ్మ సంతోషదుఃఖాలు రెండున్ను మనస్సులోనే పుట్టి అందులోనే లీనమౌతుంటాయి. పరమసాత్విక స్వభావురాలామె. ఎలాగైతేనేమి ; నిన్నటి హరికధా సంరంభాన్నంతా అచ్చమ్మ మేల్కొనే కలలుగా వూహించుకుంటూ వుంది.

వాకిట్లో గౌరమ్మగారి బండివచ్చి నిలువనేనిలచింది. బ్రహ్మానందశాస్త్రి అత్తగారిని ఆదరంతో ఆహ్వానించాడు, భాస్కరభట్టు బావమరది వాళ్ళవీరి క్షేమసమాచారం విచారించి తెలుసుకున్నాడు.

అచ్చమ్మ మరలా స్నానంజేసి వంటకారంభించింది. ఆమాట యీమాట నడచేలోగా వంటసిద్ధమైంది. అచ్చక్క పీటవేసి తల్లినికూచోబెట్టి వడ్డనకారంభించింది.

బ్రహ్మానందశాస్త్రి యింటిలోపలికి బయటికి తిరుగుతూ "నిదానంగా భోంచేయండి" అని అత్తను హెచ్చరిస్తున్నాడు.

"సరసిపుండదపు యింత పంటాగింటా చేయడం యేమైనా నేర్పి నావాలేదా ? ఇంకా యీలాగే అమష్టలజ్జా లేకుండా తిరుగుతూ వుంటే ఎట్లనుకున్నావు ?"

ఒక తాటికాయంతముద్దను నోటినుండి కడుపులోనికి జార్చి ముత్తెంలాంటి యీమాటతో గౌరమ్మ సంభాషణ సాగింది.

"మంచిపనేనమ్మా ! మన సరస్వతి హరికథాకాలక్షేపం చేసింది వేలాదిజనంలో ఏమాత్రం భయంలేకుండా నిలచి నీమనుమరాలి చాతుర్యాన్ని ఊరూరే మెచ్చుకుంటూంది."

అభిమానంతో యింకా యేమేమో అనుకుంటూంది అచ్చమ్మ! ఎదుటివాళ్ళకు తనమాట వినబడుతున్నదా లేదా - వారువింటున్నారా లేదా అనే ఆలోచనేలేకుండా !

గౌరమ్మ వెంటనే అందుకుంది కౌరడావంటి మాట !

"శఅపిచ్చిచేష్టలు నాకిష్టంలేదమ్మా ! వయసువచ్చిన ఆడపిల్లను అలా మగవాళ్ళ గుంపులోకి పంపితే నలుగురూ యేమనుకుంటారు ? నీకింకా ప్రపంచం తెలియలేదు. లేకతెలిసినా సిగ్గు శరమనేవి నీవు వదలిపెట్టినట్లుంది." బిడ్డసుఫీకొట్టింది.

"సరస్వతికింకా యెనిమిదేంవ్లే"

బ్రహ్మానందశాస్త్రి అత్తిగారివాగ్ధాటికి "బ్రేకు" వేసి పుణ్యంకట్టు కున్నాడు.

అచ్చక్క తల్లికి మెట్టనిపడవేసింది. పరిడాగట్టి పండుకొన్నుంది. తల్లికి దగ్గరగానే తనూ ఒక చాపమీద పండుకొంది మొదటి అంకణం

లోనే! అత్తిగారి పడకవైపు తలపెట్టి బ్రహ్మానందశాస్త్రి గూడ పండుకున్నాడు. శాస్త్రికి ఎడమచేతివైపు సరస్వతీదేవి పండుకుంది. రాత్రి పండ్రెండు గంటలైంది. సరస్వతి తప్ప ఎవ్వరూ నిద్రపోలేదు.

"వాళప్ప! ఎంతమనిసి! ఏమిజ్ఞానం! వానికథనీకు తెలీదు అచ్చీ!" ముత్తనాగౌరమ్మ పడకపైన పండుకొని బాళప్ప పురాణానికి శ్రీకారం చుట్టింది.

"ఊఁ.........."

ఇంకేమీ అనటానికి తోచని అచ్చక్క అన్నిటికీ 'ఊఁ' కొట్టనారంభించింది.

"మొదలు మొదలు మనబాళప్పను అందరూ పిచ్చిపిచ్చి అనేవారు"

'ఊఁ.........'

"నీవుగూడా పిచ్చివాడనే అనుకున్నావుగదూ..."

'ఊఁ....'

"ఇప్పుడూ అలాగే వున్నాడనుకొన్నావేమి?"

"ఊఁ..."

"నిద్రపట్టిందేమే అచ్చీ?"

"లేదమ్మా! నిద్రమెక్కడ పట్టిందీ?"

అచ్చక్కకు నిద్రాలేదు. హెచ్చరికాలేదు. ఆమె అంతరంగ మనే పక్షి ఏలోకాల్లోనో సంచరిస్తూవుంది. కేవలం 'ఊఁ' అనడానికి మాత్రమే అచ్చక్క జడదేహం భూలోకంలోవుంది.

తల్లిప్రశ్నతో హెచ్చరికవచ్చి అచ్చక్క మరలా యీలోకానికి దిగింది. "ఎంతచాకచక్యం! ఎంతజ్ఞానం మనబాళనికి! ఆడుతూ ఆడుతూనే యితరుల యిండ్లలోనుంచి యేదో ఒక వస్తువు కొట్టేసుకొనే వస్తాడు చూడు. వానికండ్లు మాయకండ్లు! మొన్న భావిశారదమ్మ యింటికి పోయి నాడమ్మా! పిల్ల ఓలేంతసేపైనా నేనక్కడ కూర్చోలేదు. అంతలోనే మనవాడేం చేసినాడనుకున్నావ్! ఏమిమాయ జేసినాడో! వాళ్ళవంటింటి దేవుని అరుగుపై నుండే వెండిగిన్నె యెత్తుకొనే వచ్చాడు. నేనూ శబ్దం లేకుండా మనపెట్టెలో పెట్టినాననుకో!"

"ఊఁ(..."

"మనబాళప్ప తెచ్చినసామాన్లు యింటిలో ఎన్నివున్నాయను కున్నావు? రుద్రమ్మ యింటి 'లట్టణిగె' వెంకప్పగారి 'జర్మన్‌సిల్వర్' లోటా - అది మెపరింట్లోనో గాని ఒకమంచిచెంబు - పండ్లు కడుక్కునే 'బ్రష్' - పక్కింటివారి 'సోపుబాక్సు' అబ్బబ్బబ్బ ఎన్నని చెప్పేది. నీ తమ్ముడు బాళప్ప చిత్రప్రతిభ దినదినానికీ పెరిగిపోతోంది—

ఇంకా ఎన్నునుకున్నావ్ వానిఆటలు—

తెల్లవారిలేచి హోటలుముందు పోయి నిలుచున్నాడంటే ఎట్లైనా మూడణాలు మధ్యాహ్నం యింటికి దీసికొని వస్తాడు. వచ్చీపోయేవాళ్ళ అంగీలు పట్టి నిలేసి బొట్టు అడుగుతాడు. 'కానీ' యిచ్చేవరకు ప్రాణాలు పోయినా వదులుతాడేం! భూపడు! "ఏదో పిచ్చివాడు. వానితోయేమి! ఒకకానీ పారెయ్యండి" అని అప్రక్క యీప్రక్కవారు అననేఅంటారు. వసూలుచేయకుండా వదిలేవాడు నాకొడుకేగాడు చూసుకో! అచ్చీ! నిద్ర పట్టిందాయేమిటే!"

"లేదమ్మా! వింటూవున్నాను!"

గౌరమ్మ శ్రీ బాళమహాత్మ్యని కథాసారాంశాన్ని ముందు వర్ణించ డానికి మొదలుపెట్టింది.

"నీవేమన్నా అనుకో! మనవాణ్ణి చేయిపట్టుకునేపిల్ల చాలాపుణ్యం చేసివుండాలి"

గౌరమ్మ యేఅవకాశాన్నీ జారవిడిచేదిగాదు. ఆమె సమయంజూచి బాణం వేస్తుంది. ఇంతవరకూ అనుకూలమైన వాతావరణాన్ని సృష్టించు కొన్న గౌరమ్మ బాళప్ప పెండ్లికథను అచ్చమ్మ చెవిలో వేయనేవేసింది.

గౌరమ్మఅంది. "ఎందుకంటావా చూడు! పూర్వులు సంపాదిం చిన యిల్లేమోఉంది. అంతో - యింతో కొంచెం ఆస్తిపాస్తి ఉన్నది. ఇల్లుగూడా చిన్నదేమీగాదు దానికి ఆప్రక్కా యీప్రక్కా ఉండే ఖాళీ నేల బాగుచేసి అక్కడ రెండుగూములు పడవేస్తే దయ్యమంత యిల్లు ఔతుంది. చెరువుగట్టునవుండే పొలంనుంచి వడ్లు రానేవస్తాయి. చాలని దానికి వారూవీరూ సహాయంచేస్తారు. ఇంట్లోఉండే రొక్కమూ - గిక్కమూ - సొమ్ములు - గిమ్ములూ వీనికథ నీకు తెలిసిందే! మాఅత్తగా రిచ్చిన బంగారునాగరు చూచినావుగద! మొన్న ఎవరియింట్లో నుంచీనో ఒక వెండిడాబు కొట్టేసుకొచ్చాడు బాళప్ప! ఇక నీబిడ్డకు తక్కువేముంది గనుక!"

"ఊఁ......"

"చాలనిదానికి యింకా రెండు గాజులూ-గీజులూ వుండనేవున్నవి."

"ఊఁ......"

"మొన్న నాగులచవితికి పదేండ్లు నిండినాయిగదూ సరసికి?"

"ఊఁ........"

"లేక తొమ్మిదివెళ్ళి పదిలోపడిందా?"

"ఊఁ......"

"ఏమి పరవాలేదులే। సరస్వతికి కాళ్ళుచేతులూ బాగా ఎక్కివస్తున్నాయి। తొందరగానే యింటికివస్తుంది. బాళనికిగూడా వచ్చేమాసానికి పదహారునిండి పదిహేడులో వస్తుంది. మగపిల్ల వాండ్రను యిక ఎన్ని రోజులు విడిచేది వూరికే?"... "అంతేగాదు నాకూ ముసలితనం వచ్చేస్తుందిచూడు. వెనుకటి దినాలలాగ యికముందు గూడా సాగుతుందా అచ్చీ?"

ఏడ్పుధ్వని ఆరంభమైంది మధ్యలో.

"బాళప్పనుగూడా ఒకయింటివాణ్ణిచేస్తే నావంతం కాకిముడుతుంది ......లేకుంటే దయ్యమై నీయింటి వాకిట్లో కూచుంటాను చూచుకో."

ప్రాణముందో లేదో అన్నట్లుగా అచ్చమ్మ చాపపై పడివుంది. బ్రహ్మానందశాస్త్రి ఒళ్ళంతా చెవులుపెట్టి వింటున్నాడు అత్తమాటలు...

అంతా నిశ్శబ్దం.

నిద్రలో సరస్వతి విడిచే ఉచ్ఛ్వాస నిశ్వాసాల సవ్వడి దప్పితే యింట్లో మరేశబ్దమూలేదు.

ఉన్నట్లుండి గౌరమ్మ మాటలకు బయటినుంచి గూబ ఒకటి వుత్తరమిచ్చింది.

"ఒప్పుకుంటాడు. ఒప్పుకుంటాడు. ఒప్పకుండా యేమిజేస్తాడూ? పదిమంది చెప్పితే తప్పక ఒప్పుకొంటాడు. అక్కబిడ్డ. దాన్ని చేసుకోకుండా

మెలాపోతాడు. వాడూవద్దంటే ఇంక ఎవరు చేసుకుంటారు సరసిని పాపం! సరసిగూడా అందంగానే వుంది. అందాని కెక్కడికి పారం! దేవుడు పెట్టినట్లుంటారు. అందరు వరుళ్ళకూ తగిన కన్యలే లభించా లంటే ప్రపంచంలో సాధ్యమయ్యేదేనా?...... అలా చూచుకుంటూ కూచుంటే మెక్కడి కిమితి! మీనాన్నగారినినేను చేసుకోలేదూ? ఆయన్ను నేను పెండ్లి జేసికొన్నప్పుడు వూరు వూరేమెప్పింది - పిల్లకు తగిన మొగుడు గాదని. ఏమైనాకానీ - బాళప్పను ఒప్పిస్తాలే - అచ్చీ- ...."

"మేలుకున్నానమ్మా...." అచ్చమ్మ అంతరంగంలో రేగుతుండే కురుక్షేత్రయుద్ధం - ప్రళయం - విప్లవం - వీనిని వెదకడానికే గౌరమ్మ వచ్చింది. ఆపనిని ఆత్మవంచన లేకుండా చేస్తూనేఉంది.

"బాళప్పను ఒప్పించే భారంనాది. ఏమీ యోచన పెట్టుకోవద్దు."

తానల్లుకొన్న చింతాతంతువులతో బాధపడుతుండే అచ్చమ్మ హృదయానికి ధైర్యప్రదానం చేసింది గౌరమ్మ.

"నీమొగుడికి నిద్రపట్టిందాయేమే?"

అచ్చమ్మ ఉచ్ఛ్వాస నిశ్వాసాలు గూడ నిలచిపోయినై.

"ఊఁ......"

ఈసారి వూకొట్టింది బ్రహ్మానందశాస్త్రి! ఎవరైతేనేమి? ఎవరో ఒకరు "ఊఁ" కొట్టితేచాలు కథ చెప్పేవాళ్ళకు. గౌరమ్మ మళ్ళీ మొదలు పెట్టింది: సూత ఉవాచ:—

"నీమొగుడు యీప్రపంచం మనిషి కానేకాడు. ఏవో ఊరికే వయస్సు అనేఅంగీ తొడుగుకున్నాడంతే! ఆప ఏమైనా అట్లాయిట్లా యేర్పాటుజేసి మనసరస్వతిని

కట్టపెట్టేను జాగ్రత్త! పిల్లలాంటిసరస్వతి కష్టపడితే నేను చూడ లేనమ్మా! కానా? కాదా? మీనాయనంటే దుష్టపిశాచి పట్టిచస్తున్నాడు. పెండ్లిమాట ఎత్తినామంటే వరదక్షిణయేమిటంటాడాయన! "హట్టినహాళు" "హావేరి" ఊచోట్లనుంచి ఎవరోవచ్చి ఆయన పిచ్చికితగినట్లుగా బాళప్ప జాతకాలుగూడ అడిగినారు. దాంతో మీనాయనకళ్ళు నెత్తిపై కెక్కినాయి! నేనేమో పరాయివాండ్లపిల్లి మనకు 'ఒద్దు' 'ఒద్దు' అని. నూరుసార్లు చెప్పాను ............ అప్పోగిప్పోచేసి ఏదో నీమొగుణ్ణి కొంచెం తీసుకరమ్మను. మంచియిల్లూ కావాలి! మంచి అల్లుడూ కావాలి! మాటమాత్రం విప్పేది లేదంటే యెలా కుదురు తుందమ్మా! తగినంత వరదక్షిణ - వరోపచారం ఇచ్చేది వుండనే వుంటుంది."

అప్పుడే భూలోకానికి దిగివచ్చిన అచ్చక్కకు తల పోటెత్తి నట్లైంది. ఇక సంభాషణ చాలిస్తా మనుకుంది.

"అమ్మా"

"ఏమే అచ్చీ!"

"ప్రొద్దుచాలా అయింది యికపడుకో"

రాత్రంతా యెవరికీ నిద్రలేదు. ఎలావస్తుంది నిద్ర? సరస్వతి జీవిత భవితవ్యాన్ని గురించిన చిత్రాలు అచ్చక్క కళ్ళముందు వరసలు గట్టి వేలాడుతున్నాయి. ఆమెకునిద్ర జాడతప్పింది. బాళప్ప పురాణాన్ని సాంగోపాంగంగా విన్న బ్రహ్మానందశాస్త్రి రాత్రంతా కళ్ళు తెరచుకునే పడు[illegible]డు. గౌరమ్మ తన లోకంలోనే తాను కోడలింటికి రావడం - [illegible] పుట్టడం - వానినడుముకు వెండి మొలత్రాడు - యింకా

[illegible] .....

[illegible] కట్టుకొని ప్రకృతి యేమిచేస్తుంది? ఆమెకేమి కాబ [illegible]రింది.

౧

ఆరుగంటలైంది; అనాడింకా యెందుకో సరస్వతి లేవలేదు. కావాల్సిన్య కోడలు! సరస్వతి యీఅభ్యాసం గౌరమ్మకేమీ సరిపోలేదు. ఆడపిల్లలు తెల్లవారిన తరువాతగూడ పండుకోవడమా?

"ఇదేంపాడు అభ్యాసం చేసినావే అచ్చీ పిల్లకు? తెల్లవారిన తరువాతగూడా ఆడపిల్లలు నిద్రపోతే యింటికి శని మూడుకుంటుంది... లేపు ఆగాడిచముండను. అదెక్కడ పడుకుంది? ఎక్కడ?"

వెతుక్కుంటూ గౌరమ్మ సరస్వతి పడకదగ్గరకు వచ్చింది. బ్రహ్మానందశాస్త్రి తాను కప్పుకున్న శాలుపదీసి సరస్వతికి కప్పుతున్నాడు చలి రాకుండా! ప్రాతఃకాలపు కాంతులలో తనబిడ్డ మొగాన్ని తనివిదీరా చూసి కొన్నాడుశాస్త్రి. ... క సంతృప్తి—చిరునవ్వు — పెనవేసుకొని నిలచాయి. ... మ్మ గట్టుమని వెనక్కు తిరిగింది. వంట...

...శాలు అత్తింట్లో

అచ్చక్క మనస్సుకు చాల బాధకలిగింది. తనముద్దు సరస్వతిని కాలితో తన్నిలేపడమా!

"ఛీఛీ! లేదమ్మా! నిత్యమూ సరస్వతి మాకంటె ముందులేచి నీళ్ళ క్రింద మంటవేసేది. ఈప్రొద్దేమో కొంచం పడుకుంది. పాపం నిన్న అలత ఎక్కువైంది."

"మాకేం తెలుస్తాయమ్మా ఇవన్నీను. మాయింట్లో మాత్రం యివన్నీ సాగవు."

గౌరమ్మ తనదే కడమాటైనట్లుగా నిష్ఠూరంగా మాట్లాడి వంటిం ట్లోకి అడుగువేసింది. కొంత ప్రొద్దెక్కింది, సరస్వతి నిద్రలేచింది. తండ్రీబిడ్డలకు సంభాషణ యీరీతిగ నడచింది.

"నిన్న అదేదో క్రొత్తరాగం పాడినావే! దానిపేరేమమ్మా?"

"ఏరాగమప్పా?"

"మలగి పరమాదరది" అనేపాట పంచరాగాల్లో పాడలేదూ? ఆపాటలో మధ్యమావతికి ముందుపాడినావే ఆరాగం. అదిచాలాబాగుంది."

"రాగాలపేర్లు నాకేమితెలుసునాయనా?" నవ్వుతూ సరస్వతి బదులిచ్చింది.

"అదేదో పాడినావుగదా! అమ్మా!"

సరస్వతి అన్నది. "నాకొక రాగ[illegible] పాడునప్పుడు మాత్రం ఏదో మరచిపోయిన [illegible]వుతుంది. తోచినదానిని తోచినట్లే పా[illegible]

బ్రహ్మన[illegible]

"బ్రహ్మప్పా! ఈబిడ్డ నీబిడ్డగా దోయి పిచ్చివాడా! "నాబిడ్డ" అని భ్రాంతిపడవద్దు. శాపగ్రస్తమైన సాక్షాత్సరస్వతి భూలోకానికి వచ్చింది. అది ఆదేవునియిచ్ఛ."

ఈమాటలని ఒక సుదీర్ఘ నిట్టూర్పుతో శంకరదీక్షితులు యింటికి వెళ్ళాడు.

బ్రహ్మానందశాస్త్రి మౌనము సరస్వతి కర్థముగాలేదు. ఆమెఅన్నది: "ఏమి నాయనా! నాపాటను గురించి అంతగా ఆలోచిస్తున్నావు? ఎక్కడ న్నా రాగంతప్పిందా?"

శాస్త్రి మనసు వెన్నవలె కరగింది.

"కావమ్మా! సరస్వతీ! నీవు సంగీతమెక్కడ నేర్చినావు? ఎవరు నేర్పారు? నిన్నరాత్రి అంత స్వరబద్ధంగా - లయపూర్ణంగా పాడినావు గదమ్మా!"

"నీకు తెలియకుండా నాకెవరు నేర్పినారప్పా?"

శంకరదీక్షితుల దివ్యవాణి మరల శాస్త్రిచెవిలో వినిపించినది. సరస్వతి వేసినప్రశ్నకు ఆమెకర్థమగు భాషలో సమాధానం చెప్పడానికి శాస్త్రికి చేతకాలేదు. ఆయన హృదయానికి మాత్రమంతా అవగతమైంది.

లోపలికి పోవమ్మా! మీఅవ్వ వచ్చింది!"

చిలుకవంటి సరస్వతిని అడవిపిల్లి ముందుంచి - ఏదోపనిమీద బ్రహ్మానందశాస్త్రి బయటకువెళ్ళినాడు.





## ౬

మాటయిచ్చేవరకూ అన్నం ముట్టనని గౌరమ్మ వంటయింటి కడ్డంగా పడుకొని సత్యాగ్రహం పట్టింది. ఆమెనోటివెంట వెడలిన శాప నార్థాలకు లెక్కలేదు.

"నావంశం నిర్వంశమైతే చూడాలని వున్నావేమే అచ్చీ!" ఈ మాటగూడా గౌరమ్మ నోటివెంట వచ్చింది.

అచ్చమ్మ ఆదరంతో నమ్రతతో యిలాఅంది.

"బ్రహ్మగూర్చిన సంబంధాన్ని ఎవరూ తప్పించలేరు. లేనిదాన్ని కూర్చనూ లేరు. లేవమ్మా, స్నానంచేసి అన్నంతిను. మూడుగంటలు మీరిపోయింది. వండిన వంటంతా చల్లబడింది."

"ఏమి చమత్కారంగా మాట్లాడుతావే! ఈ మాటలతో నన్ను బేలుపుచ్చుదామని చూస్తావా? నిన్నుపెంచి పెద్దదాన్ని చేసినందుకు తగిన ప్రతిఫలమే ముట్టజెపుతున్నావ్. మూడువేళలా నిన్ను నాయెదపై పండ బెట్టుకొని పెంచాను తెలుసా?"

ఇంకా యేమేమో అంటూంది గౌరమ్మ. అచ్చక్క అందుకుంది.

"నేను ఎన్ని జన్మలెత్తినా తల్లి ఋణాన్ని తీర్చలేనమ్మా! నీ మాటకు నేనెన్నడూ అడ్డుచెప్పిందిలేదు. కాని యిందులో నా ఒక్కదాని మాటేగాదు. వారుగూడా ఒప్పుకోవద్దూ!"

గౌరమ్మ గధీమని బిడ్డను బెదిరించింది.

"నోరుమూసుకోవే చాలుగాని. నీవొకతే పతివ్రత యీ భూలోకంలో! నీమొగుడికేంతెలుసు గనుక. అటు పిచ్చివాడుగాదు. మంచి వాడూగాదు."

అచ్చక్క హృదయానికి దెబ్బతగిలింది. ఆమెఅన్నది:

"ఆయన్ను మాత్ర మలా తగ్గించి మాట్లాడవద్దమ్మా! లోకం సమస్తమూ ఆయన్ను పిచ్చివాడన్నా నాపాలికాయన దేవుడే! ఆయనమాట కాదని నేనేమి చేయడానికీ వీలులేదు."

గౌరమ్మ హుంకరించింది. "ఔనౌను! చూచినాములే! ఇరవై నాలుగు గంటలూ మగని మాటపైననే నడుస్తున్నావు. పాపం మేమంతా......"

"అలా కాదమ్మా! అందులోనూ యిలాంటి విషయాలలో నేను స్వతంత్రించి యేమిచెప్పేది. నీవేచెప్పు, ఇంతకూ పెండ్లిచేసికొనే సరస్వతికి యిష్టముంటొద్దూ యీ సంబంధం?"

"ఏమీ! సరసిముండనా? అయ్యమ్మ! క్రొత్తక్రొత్తవన్నీ చెపుతావేమే! ఆ కుంకముండను ఒప్పించాలీ? రెండుతన్నులు పీకితే అదే ఒప్పుకుంటుంది. నాయెదుట నీపురాణమంతా విప్పొద్దు. 'ఇస్తాను.' అని ఒక మాటచెప్పు. స్నానంజేసి నాలుగు మెతుకులు నోట్లో వేసుకుం

టాను. నాహ కడుపులో పేగులుటుస్తున్నాయి. లేదా! 'ఇవ్వ'నను సరసూ- అచ్చీ యిద్దరూ చచ్చినానని నీళ్ళుపోసుకొని...."

"ఇలాంటి మాటలు నీవాడరాదమ్మా."

"లేపండమ్మా! సంతృప్తిగా భోంచేయండి. మనః పూర్వకంగా సరస్వతిని వాళప్పకిచ్చి పెండ్లిజేస్తాను. ఈమాట దేవుని అడుగుదెగ్గర నిలచి అంటున్నాను. లేవండి త్రికరణశుద్ధిగా యిస్తాను. స్నానంచేసి భోంచేయండి."

పిడుగుపడినట్లైనది అచ్చమ్మ పాలికి.

భయమూ - ఆశ్చర్యమూ - ఈ భావాలూ గూడుకట్టుకొని కన్నీటితో ఒక్కసారి మగనివైపు చూచినది. కానీ బ్రహ్మానందశాస్త్రి ముఖంపైన ఏ భావమూలేదు. ఆయనముఖం ప్రతిరోజుకంటె యింకా యెక్కువ ప్రఫుల్లంగా వుంది. నిత్యానందం ఆ ముఖంపైన తాండవిస్తూ వున్నది. మాటపై నడిచే దృఢనిశ్చయం ఒకటి మాత్రం ఆ కన్నుల్లో కనుపించింది. ఆయనకే యతృప్తీలేదు. ఏ అశాంతీలేదు.

"నీమొగుడు దేవుడులాంటివాడని నేనప్పుడే అనలేదేమే? అచ్చీ! వ్యవహారాలగడబిడ ఆయనకేమీ తెలియదు. ఆయన అభిప్రాయం మేరకు అందరూచేస్తే బాగుపడుతాము. ఈ విషయాలాయనకేమి తెలుస్తవి? అన్నావు! చూచావా. మొగుణ్ణి అలా అనరాదే! మొగుడంటే దేవుడే! ముమ్మాటికీ దేవుడే!"

స్నానంజేస్తూ గౌరమ్మ బిడ్డకు ప్రాతివ్రత్య ధర్మంపై దీర్ఘోపన్యాసం యిచ్చింది.

గౌరమ్మ, శాస్త్రి - యిద్దరూ భోంచేశారు.

అచ్చక్క అన్నం ఎంగిలిచేసి భోజనశాస్త్రం ముగించింది. ఆమె విస్తరిలోని అన్నంలో రెండుకన్నీటిబొట్లు జారినాయి. ఈ దృశ్యాన్ని చూచిన శాస్త్రి నిలుచున్నపాటున యిలాఅన్నాడు:

" పిచ్చిదానా ! సర్వమూ దైవేచ్ఛ."

మరుదినం తెల్లవారకముందే గౌరమ్మ ప్రయాణమైంది.

"అత్తగారూ ! ఏమంతతొందర ? ఇది మామిడికాయల కాలం ! కొంచెం శ్రీకరిణీతినిపోరాదూ?"

బ్రహ్మానందశాస్త్రి గౌరమ్మను నిర్బంధించాడు. ఈ యాదరం ఔపచారికంగాదు. మనఃపూర్వకంగానే.

"లేదు! పోయివస్తాను. బాళప్పనుచూచి అప్పుడే ఒకదినం గడచింది."

" భాస్కరభట్టుగారే చేయికాల్చు కుంటాడుపాపం ! వెళ్ళిరండి " బ్రహ్మానందశాస్త్రి గౌరమ్మకు మగనివిషయం జ్ఞాపకంజేశాడు.

గౌరమ్మఊరికిపోయింది. బ్రహానందశాస్త్రి యిల్లు గ్రహణం విడచిన చంద్రబింబంలా ప్రకాశించింది.కాని అచ్చక్క ముఖము వాడుబట్టింది ఆమెదుఃఖానికి ఓదార్పులేదు.

ఇంకేముంది. ఊళ్లోఎక్కడచూచినా బాళప్పపెండ్లిమాటే!గౌరమ్మ ఇల్లిల్లు - వీధి వీధి చుట్టి చుట్టి బాళప్ప వివాహవిషయం ప్రచారంచేసి వచ్చింది. వీధివూడ్చేమాదిగ దుర్గనికిచెప్పింది. మూడువేలు వరదక్షిణ - చాలనిదానికి మెడలోని బంగారుచైను - పాత్రలుకళాయిపోసే ' గౌసుసాబుకు ' గూడ గౌరమ్మయీవార్తచెప్పింది. ఆషాఢమాసం వెళ్ళుతూనే మొదటి మహూర్తంలోనే బాళప్పపెండ్లి.

రాత్రి యింటిబయట కట్టపైన పండుకున్న భాస్కరభట్టు తెల్లవారి యింట్లోలేడు. ఏదోపొలంపైకి వెళ్ళివుండవలెనని గౌరమ్మ తృప్తిపడింది.

చేతిలో ఒకసష్టిపంచ పట్టుకొని మధ్యాహ్నానికి అచ్చక్కవూరు చేరాడు భాస్కరభట్టు. తాతను తలవాకిటిలోనే చూచిన సరస్వతి 'తాత తాత' యనిగంతులేసింది. వంటకై ఎసరుపెట్టిన అచ్చక్క-సరస్వతి వుత్సాహం చూచినడియింట్లోకి వచ్చింది. దేవుని పూజ చేయడానికి కూచున్న బ్రహ్మానందశాస్త్రి ఈ గద్దలానికి లేచివచ్చి మామకు నమస్కరించాడు.

"మీరు నాకు నమస్కారంచేయరాదు. ఇదితప్పు." భాస్కరభట్టు వెనక్కు జరిగాడు.

"మీరు పెద్దలు"

"వయస్సులోమాత్రం. మీరుజ్ఞానవృద్ధులు, తపోనిష్ఠులు. మీకునేనే నమస్కరించాలి."

"ఈ పంచాయతీదేవునిముందే తెగనీ ! ఇద్దరూ దేవునికి దండం పెట్టండి." అచ్చక్క ఆత్మానందంతో నవ్వుతూపలికింది.

సరస్వతి ఒక్కటేకిలకిల !

భాస్కరభట్టు స్నానముగించాడు. ఆహ్నికము సాంగోపాంగంగాసాగింది. మధ్యలో సరస్వతిని పెట్టుకొని యిద్దరూ భోంచేశారు. బుధులవంటి యిద్దరుబ్రాహ్మణులచూచి అచ్చక్కమనస్సు ఆనందంతో పొంగింది.

తానుఎదురుగా కూర్చొని బిడ్డకు ఆకులోవడ్డించాడు భాస్కరభట్టు. కొంచెందూరంలో బ్రహ్మానందశాస్త్రి తమలపాకులకు సున్నం రాసుకుంటూ నిలబడ్డాడు.

"కడుపునిండా తినవమ్మా అచ్చీ! నేనూమీకొక ఉపకారంచేయడానికి వచ్చాను." విస్తుభ్యమడుస్తూవున్న సరస్వతివైపు చూస్తూ భాస్కరభట్టు అన్నాడు.

"దయచేసి సెలవీయవలె"

గౌరవాదరాలతో శాస్త్రిమామవైపుచూస్తూ అన్నాడు.

లోనిముద్దచేతిలోనే పట్టుకొని అచ్చక్క కండ్లు విప్పార్చి తండ్రివైపుచూచింది. తల్లితగిల్చిపోయిన వురిని యింకాకొంచెం బిగించడానికి వచ్చాడేమో అనుకుందిపాపం!

"సరస్వతికి వుత్తముడైన వరుణ్ణి తెచ్చినానమ్మా!"

అచ్చక్కమనసులో ఇంకా వుద్వేగం యెక్కువైనది.

బ్రహ్మానందశాస్త్రి జవాబిచ్చేటంతలోనే అచ్చక్క తండ్రినడిగింది.

"ఏ వూరప్పా వరునిది?"

"ఏవూరైతేనేమి! ఇప్పుడు కాశీలోసంస్కృతము చదువుతున్నాడు. చిన్నవయస్సు. మహాప్రతిభాశాలి! ఆబ్రహ్మవర్చస్సూ - ఆజ్ఞానతేజస్సూ వర్ణించడానికి సాధ్యంగాదు. వరునిపేరు గణపతిదీక్షితులు - ఊరువేరే గాదమ్మా! ఈవూరే! శంకరదీక్షితుల కొడుకు."

అచ్చక్కకు ఆకాశం అందుకోవడానికి అర్ధఅంగుళందూరంలో వుంది. అంతసంతోషమైందన్నమాట!

"కాదు సాధ్యంగాదు. నీకొడుకుబాళప్పకు నాకన్య నిస్తాననిమాట అనివేశాను."

బ్రహ్మానందశాస్త్రిగారి కంఠంలోని నిర్ధారణధ్వనించింది. దా ని లో తగినంత కాఠిన్యముగూడావుందని భాస్కరభట్టుకుతోచింది.

"ఆసంబంధం వద్దనిచెప్పడానికే నేనూవచ్చినాను."

"మామగారూ! మీరే మీకుమారునికి ద్రోహంచేస్తారా?"

"బ్రహ్మానందశాస్త్రిగారూ! మీరే మీకుమార్తెకు ద్రోహ[illegible] స్తారా?"

ఈ సన్నివేశాన్నిచూచి అచ్చక్కకు కొంచెంభయ[illegible] గింది. పోట్లాడడానికి తయారైన రెండు సింహాలలా వున్నారు తం[illegible] యగురూ!

"బాళడుశుద్ధ పిచ్చివాడు. అవివేకి." ఈ విషయం భాస్కరభట్టు కొంచెం వ్యాఖ్యాన పురస్సరంగా చెప్పాడు.

బ్రహ్మానందశాస్త్రి వెంటనేఅన్నాడు:

"బాళప్ప పిచ్చివాడేకావచ్చు - మీ అభిప్రాయంలో - మీకుమార్తె అభిప్రాయంలో - నా అభిప్రాయంలోగూడా అయినా..."

"ఇంకేమి మనసరస్వతిసాక్షాత్తూ సరస్వతే!"

తనమాటలు సాగించాడు భాస్కరభట్టు!

బ్రహ్మానందశాస్త్రి అన్నాడు:

"అదే. సరస్వతి గౌరమ్మగారి అభిప్రాయంలో కేవలం వుపయోగం లేనిపిల్ల. బాళప్ప సాక్షాత్తు బృహస్పతి."

"అభిప్రాయాలకేమిలే! సత్యమంటూ ఒకటుందిగా సూర్యప్రకాశం వలె."

"మామగారూ! సూర్యప్రకాశం ఎంతసత్యమో - మేఘచ్ఛాయ గూడా అంతే సత్యము. హేతు వాదానికి నిలబడేదొకటే సత్యంగాదనేది మీకు తెలిసిందే. 'సత్యం శివం సుందరం.'"

భాస్కరభట్టుకు దిక్కుతోచలేదు, కొంచెం వూరకుంది - మరల
అ ంచాడు. "శాస్త్రిగారూ - మీకుబిడ్డ అనే వ్యామోహం గూడలేదా?"

"మామగారూ ! బిడ్డమాత్రమే అభిమానానికర్హురాలు ! బాపమరది కా యినాడా ?"

ఇంతప్రొద్దూ వూరికే కూర్చొని ధర్మకర్తవ్యాల మధ్య జరుగుతూ పున వాదోపవాదాల్ని గమనిస్తూన్న అచ్చక్క ఇక తనతండ్రికి జయాశలేదని తీర్మానించుకుంది. ప్రవాహంలో మునిగేవాడు చిన్న కట్టె పుల్లను పట్టుకున్నట్లుగా తానూ ఒక మాటఅంది, సరిపోతుందేమో అని.

"బాళప్పకు సరస్వతిని యివ్వడం నాకు ఏమాత్రం యిష్టంలేదు."

"అయితే సీతంబ్రివంశం యింతటితో ఆగిపోవలెననేనా నీ యిష్టం?" శాస్త్రి నేరుగా భార్యను ప్రశ్నించాడు.

"మరొక్కపిల్ల నెవరినైనా తెచ్చి......"

అచ్చక్కమాట యింకా నోరుదాటి గడ్డకేరాలేదు.

"సీతమ్మనికి నీవే పిల్లనివ్వకపోతే వేరేఎవరైనా యెందు కిస్తారు? వారికిమాత్రం పిల్లలు వీధిలో దొరుకుతారా!" బ్రహ్మానందశాస్త్రి ప్రశ్నకు జవాబే లేకపోయింది. ఆయనమెల్లగా లేచివచ్చి బయట కూర్చున్నాడు.

అరగంటలోనే భాస్కరభట్టు వూరికి ప్రయాణమైనాడు.

"ఒక రెండుదినాలుండి వూరికి పోగూడదేమప్పా? ఇంతలోనే ఏమంతతొందర?" అచ్చక్క కండ్లనిండా నీరుపెట్టి అడిగింది తండ్రిని.

"ఉండి చేసేదిమాత్రమేముంపమ్మా ! సరస్వతిని భగ[illegible]డే రక్షించవలె !"

భాస్కరభట్టు చంకలో మడిపంచె పెట్టుకొని బయటికి వ[illegible]డు.

"నేను వస్తాను."

"ఏమంతతొందర ? నామాటలకు తమకేమైనా నొప్పిగలి[illegible]దా? క్షమించండి." బ్రహ్మానందశాస్త్రి మామకు నమస్కరించాడు.

మామ వెనుకకు జరిగాడు.

"ఆ భగవానుని యిష్టమున్నట్లు జరుగుతుంది." ఇద్ద[illegible]రూ ఒక్కసారిగా యీమాట అన్నారు.

"వస్తానమ్మా ! సరస్వతీ !"

మనుమరాలు ముద్దుగా తాతకు నమస్కరించింది.

"జైశివే"

భాస్కరభట్టు కన్నుమూసి సరస్వతి తలపై చేయిపెట్టి ఆశీర్వదించినాడు. అచ్చెక్క నమస్కరించింది. ఆ యింట్లో నిలువడానికి భాస్కరభట్టుకు ధైర్యం చాలలేదు. ఆయన మనస్సునిండా అశాంతి. తొందరగా గడపదాటి వచ్చాడు.

## ౧౦

మనస్సు సరిగా లేకున్నా యింటిని శుభ్రంగా వుంచడం అచ్చుక్క స్వభావం.

బ్రహ్మానందశాస్త్రికే గాదు - సరస్వతికి మాత్రమే గాదు - తమ యింటికి వచ్చిపోయే ప్రతిఒక్కరికీ తన సద్గుణవాసనలతో హృదయానందం కల్గించేది అచ్చుక్క. ఇంటిలో యింతరభస జరిగినా ఏమీజరగనట్టే ఆమె నిత్యకర్మలో మునిగిపోయింది.

నాడు వైశాఖశుద్ధ పూర్ణిమ.

ఏదేవుని అనుగ్రహమో బ్రహ్మానందశాస్త్రి నాడు గోధూళి సమయానికే ఇంటికివచ్చి చేరుకున్నాడు.

ఇంకా అచ్చుక్క వంటకూడా ఆరంభించలేదు.

నవ్వుతూఅచ్చుక్క మొగుణ్ణి అడిగింది:

"ఏమి ! త్రోవతప్పి వచ్చినట్లుందే ! యింటికి ?"

బ్రహ్మానందశాస్త్రి అన్నాడు:

"త్రోవ ఒకప్పుడు చిక్కివుంటేగా - తప్పిపోవడానికి - త్రోవ చిక్కేది యింకా యేజన్మలోనో !"

కాళ్లూ ముఖమూ కడుక్కొని బ్రహ్మానందశాస్త్రి నీళ్ళింట్లోనుంచి గడ్డకు వచ్చాడు.

"సరస్వతి యెక్కడ?"

"పక్కింట్లో వుందేమో! అప్పగారిదగ్గర కథలు వింటూ వుంటుంది." శాస్త్రి చిన్న నిచ్చెనతెచ్చి అటుప పైకెక్కాడు. బట్టచుట్టి పెట్టిన ఏకనాదం తీసికొని ఆయన క్రిందికి దిగివచ్చాడు.

శాస్త్రి తలవాకిలివైపు చూచాడు. వేసవివెన్నెల - మల్లెపూలు కుప్పలు పోసినట్లు - తానునిల్చున్న భూమిఅంతా ఆతనికొక పెద్ద వెండి పర్వతంలా తోచింది. ఔనౌను - ఇదే కైలాసం - ఆయన అంతరాత్మ ఆయనచెవిలో చెప్పింది.

దేవుని అరుగుపైనున్న విభూతిని బ్రహ్మాండంగా నుదుటిపైన తీర్చాడు శాస్త్రి. చేతిలోనున్న నాదబ్రహ్మకు కుంకుమాలంకారం జరిగింది. తలవాకిలికెదురుగావున్న చాపబండపైన కూర్చున్నాడు బ్రహ్మయ్య. చంద్రుడు స్వచ్ఛంగా ప్రకాశిస్తున్నాడు.

వినీలాకాశంలో ఆడుతుండే చంద్రమ్మ తనవైపు చూచి నవ్వినట్లు భాసించింది శాస్త్రికి. ప్రశస్తమూ ప్రశాంతమూ అయిన ఆ వాతావరణంలో బ్రహ్మానందశాస్త్రి ఏకనాదాన్ని కదలించాడు.

"ఓం" అన్నది ఏకనాదం.

జడవస్తువైతే మాత్రమేమీ? అదివున్నది బ్రహ్మానందశాస్త్రి చేతిలోగదూ?

'ఓం' కారస్వరం ఎదిగింది. గాలిలో ఆధ్వని నిండుకుంది. గగనాని కెగబ్రాకింది. జగత్తే ఓంకారమయమైంది.

ఏకనాదశ్రుతికి మరొక ధ్వనిచేరింది.

"ఓం కారరూపిణీ కల్యాణీ"

పాటముగుస్తూ వచ్చింది. అర్ధనిమీలములైన శాస్త్రిగారి కన్నుల యెదుట కల్యాణిరాగమే రూపుకట్టి కన్పించింది. పాటముగిసింది. ఆయన కండ్లు తెరచాడు. చంద్రోదయంతో విరిసిన కలువరేకులవలె అతని యెదుట సరస్వతి నిలుచున్నది.

తండ్రి బిడ్డను మనసార కౌగిలించుకొన్నాడు. ఆక్షణములో తండ్రి బిడ్డలిద్దరూ కరిగి నీరై మరల గడ్డకట్టుకున్నారు.

చేతిలో గరిటెపట్టుకుని నిలచిన అచ్చమ్మకు యీదృశ్యాన్ని జూచి కన్నులునిండి జలజల రాలినాయి బాష్పాలు! అది ఆనందమో - దుఃఖమో కాక రెంటికీ అతీతమైన ఒకఅవస్థయో!

బ్రహ్మానందశాస్త్రి భూలోకపరిధులకు మెల్లమెల్లగా దిగాడు.

"పెండ్లి కావడానికిముందే యీసరస్వతి మరణించరాదా?" అనుకున్నది అచ్చక్క మనసులో. "థూ థూ ఇట్టి అమంగళకరభావం ఎందుకో తట్టిం" దని తనలోతానే వణకుతూ బిరబిర వంటింట్లోకి వెళ్ళింది.

తండ్రీబిడ్డలిద్దరూ కూర్చొని భోజనం ముగించారు. అచ్చక్క తింటున్నంతసేపూ యిద్దరూ ఆమెయెదుట కూర్చున్నారు. సరస్వతి పుట్టచెండువలె ఎగురుతూ నిమిషంలో విస్తళ్ళు ఎత్తివేసి శుద్ధిపెట్టింది. బిడ్డ పనిచేస్తున్నంతసేపూ తల్లిరెప్పార్పకుండా ఆమెవైపే చూస్తూఉంది.

అంతలో బ్రహ్మయ్య బిడ్డకు పడకవేశాడు. ఆమాట యీమాట మాట్లాడుతూండగనే సరస్వతి కండ్లుమూసింది.





"నిద్రపోతివేమమ్మా సరస్వతీ!"

శాస్త్రి తనతలను సరస్వతితలతో చేర్చి ఆమె ముఖంపైన ఒకటి రెండుసార్లు చూశాడు. ఆయన ప్రతిచూపునుండీ అమృతమే ఒలికింది సరస్వతి ముఖంపైన.

సన్యాసినివంటి అచ్చక్క ఒకచాప పరచుకొని ఎడమచేయి తలదిండుగా పెట్టుకొని పడుకుంది.

మూడవయామ మప్పుడే ఆరంభమైనదేమో! ఇంకను లొలికోడి కూయలేదు. సాక్షాత్తు శబ్దదేవతయే నిద్రపొంది విశ్రాంతి ననుభవిస్తు న్నట్లున్నదా యింటియందు! అంతనిశ్శబ్దత. అంతనీరవత.

ఉన్నట్టుండి సరస్వతి పడకనుండిలేచి నిలుచుంది.

"ఆయన్ను లోపలికి పిలువండి, ఆయనవచ్చారు"

ఈమాటలు స్పష్టంగా ఉచ్చరించింది.

తల్లిదండ్రు లిద్దరికీ హఠాత్తుగా నిద్రాభంగమైంది. శాస్త్రి,అచ్చక్క యిద్దరూ లేచినిలుచున్నారు.

"ఏమమ్మా అది! సరస్వతీ! పడుకోతల్లీ!"

బ్రహ్మయ్య సరస్వతి చేయిపట్టుకొని పడకవైపు చూపి పండు కొమ్మాన్నాడు.

"వారు వచ్చారు."

"ఏమో కలగన్నది పిచ్చిపిల్ల"

అచ్చక్క దగ్గరికివచ్చి సరస్వతి వీపు, తల తడిమింది. అలకలు వెన్కకు జోపుతూ మళ్ళా పడుకోబెట్టింది.

ఒకనిమిషంలోనే సరస్వతికి నిద్రపట్టింది.

మరుదినం సోమవారం. దీపాలు వెలిగించేవేళ. బ్రహ్మయ్య శాలువ కప్పుకుని బయటికి వెళ్తున్నాడు. కొంతదూరంపోయి ఏదో జ్ఞాపకం చేసికొన్న వానిలా వెనక్కువచ్చాడు.

"నీవూవస్తావేమమ్మా సరస్వతీ!"

"ఎక్కడికప్పా"

"నగరేశ్వర దేవళానికి." మంగళహారతి తీసికొని వస్తాము. హారతి సమయంలో ఒకటిరెండు శ్లోకాలు చెప్పేవాళ్ళుగూడా యీ గ్రామంలో కరవౌతున్నారు.

"పోయిరామ్మా"! సరసూ అచ్చక్క కనుసన్నతోనేఆజ్ఞయిచ్చింది.

తండ్రీబిడ్డా యిద్దరూ బయలుదేరి హారతి సమయానికి దేవాలయ మహాద్వారంలో అడుగుపెట్టారు. ప్రదక్షిణాలు ముగించి నగరేశ్వరుని ముందు చేతులుమోడ్చి నిలిచారు.

ఎన్నడూలేని కళ యీనాడు దేవళంలో! కారణంలేకుండానే ఆనాడు హెచ్చుమంది అక్కడకు చేరారు. కొన్నిసన్నివేశాలు ప్రకృతిలో అలా తటస్థపడతాయి. క్రొత్తగా చేయించుకున్న బంగారునీరు తాపిన కిరీటంతో కళకళలాడి పోతున్నాడు నగరేశ్వరుడు. చాలనట్లు ధగధగలాడుతుండే వెండిమీసాలు! మంగళహారతి ముగిసింది. అందరూ తాముతాము నిలుచున్న చోటనే కూచున్నారు.

కంచుగంట మ్రోగించినట్లు సుశ్రావ్యమైన కంఠధ్వని. భీంమూ స్పష్టముగా అయినవుచ్చారణ. గంగానదీప్రవాహంలావుంది ఆవాణీ ప్రవాహం. "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అని ఆరంభించి సుమారు పదు

నైదు నిమిషములు పండితపామర వేద్యముగా అధర్వణ వేదశ్రవణము సాగింది. ఒకానొకమూలలో చేతులుమోడ్చికొని అర్ధనిమీలిత నేత్రుడై నిల్చున్న యువకుని ముఖమునుండి ఆ మనోహర వేదఝంకారము. ఆ ముఖముపై బ్రహ్మతేజముట్టి పడుతూవుంది. వాణీ యున్మాదినియై ముందుకు తెగదూకులు వేస్తూ వున్నది. ఆయువకుడంత పొడగరిగాదు. పొట్టియుగాదు. పసుపువంటి శరీరఛాయ - విశాలమైన ఫాలము - ఆఫాలముపై విభూతి. దానినడుమ కుంకుమబొట్టు ప్రశస్తంగా వుంది. కండ్లు ముక్కు - నోరు - ప్రత్యంగమూ అచ్చునబోసి తీర్చి నట్లున్నది. అప్పుడప్పుడే తొంగిచూస్తూవున్న చిరుమీసములు. కుడిచేతిమణి కట్టులో నొకబంగారు కంకణము - వ్యాపించుతూవున్న దానికాంతులు.

"వీరే నేనన్నది."

సరస్వతి వ్రేలుచూపించి తండ్రితో అన్నది.

"ఎవరమ్మా ఈయన?"

శాస్త్రిగారాశ్చర్యంగా అడిగారు.

"నిన్నరాత్రి నేను ప్రస్తావించినవారు వీరేనప్పా! మనయింటిలోకి పిలువండని చెప్పలేదూ? ఆయనేఈయన."

బ్రహ్మయ్య ఆశ్చర్యాని కంతులేదు. ఈయువకుడూరికి క్రొత్త తామితనిని చూచినదిగూడ యిదే మొదలు. ఈ యువకుడు సరస్వతి కలలో యెట్లు కన్పించినాడు? ఇతని తేజస్సు - ముఖకాంతి- పాండిత్య పూర్ణమైన వేదశ్రవణము - మనోమోహకమైయున్న -

"ప్రసాద వినియోగము కావలెను."

ఆయువకుడు కొంతకొబ్బరికాయగూడ తెచ్చెను. ఆ ఫలమును భగవంతునకు నివేదించి అర్చకుడు రెండుకొబ్బరి చిప్పలను తట్టలో నుంచుకొని గర్భగుడినుండి బయటికి వచ్చాడు. ఒకచిప్ప నాయువకున కొసగి అర్చకుడు తిరిగిచూచాడు.

"నేను టెంకాయ తీసికొనిరాలేదు." శాస్త్రిగారు సహజమైన కంఠధ్వనితో అన్నారు.

"పరవాలేదు. దయచేసి తీసికోండి." అర్చకుడు శాస్త్రి నాహ్వానించాడు.

సరస్వతి ముందుకు నడచింది. నీటిపైన తేలాడుతూవచ్చే కమలం వలె ఆమెచేతులొడ్డి ఫలమును స్వీకరించింది.

గుడికివచ్చిన భక్తులందరూ యిండ్లదారి పట్టారు. గుంపుకొంత తగ్గింది.

సరస్వతి మనసునందున్న కుతూహలమునకు ప్రతిక్రియయో - లేక స్వయంప్రేరణమో ఆ నగరేశ్వరుడే యెరుగును. అపరిచిత యువకుడు రెండడుగులు ముందుకువేశాడు. అదేసమయమున సరస్వతి బ్రహ్మప్ప రెండడుగులు ముందుకువేశారు. "క్షమింపవలెను. పెద్దల దగ్గిర పాండిత్యప్రదర్శనం మహాపరాధం" వినయమూ నమ్రతా, ఆయువకుని పాండిత్యానికి మెరుగులు పెట్టాయి. బంగారుకు తావువలె!

"పరవాలేదు. పరమానందమైంది. నగరేశ్వరుని సన్నిధిలో అందరమూ పసివారమే!"

బ్రహ్మయ్యా నవ్వాడు. నవ్వాతని సహజగుణం. దానిలో తాండవించునదొక నిత్యానందమే. ఈమాటలంటూ ఆయన ఆయువకుని వెన్నుపై అభిమానంతో చేయివేశాడు. శాస్త్రిగారన్నారు.

"పరిచయము కాలేదు"

"నాపేరు గణపతిఅంటారు."

"స్వస్థానం?"

"ఒకానొకనాడు మాది 'హరిహర' నగరం. కారణాంతరములతో మాతండ్రి మూడునాల్గు సంవత్సరాల క్రిందట యీవూరికి వచ్చాడు. అప్పటినుండి మాది యీయూరే!"

బ్రహ్మానందశాస్త్రి ఆశ్చర్యముతో నోరు తెరవకముందే సరస్వతి యీ క్రొత్తయువకుని గుర్తించింది.

"శంకరదీక్షితుల కుమారులా మీరు?"

గణపతి సరస్వతివైపు చూచాడు.

"ఔనమ్మా!"

ఆపలుకులలో వాసించినది వినయమేగాదు. స్వాభిమానముగూడ!

ఈమాటలంటూనే బ్రహ్మయ్య ఆనందంతో అతనిని కౌగలించు కొన్నాడు.

"కాశీనుండి యెప్పుడు వచ్చితివి?"

బ్రహ్మయ్య ముఖమునయేదో ఒకవిషాదచ్ఛాయ - అవశముగ నావరించి అంతలోనే మాయమయింది.

"నేడే వచ్చితిని! తమపేరేమో తెలుసుకోవచ్చునా?"

ఇంతలో బ్రహ్మయ్య నేదోయొక యుదాసీన భావమాక్రమించింది.

"వీనిని బ్రహ్మానందుడంటారు."

గణపతి శాస్త్రిగారి కాళ్ళకు నమస్కరించాడు.

"మీరేనా బ్రహ్మానందశాస్త్రిగారు? మాతండ్రిగారు మీవిషయ మంతకు ముందే చెప్పారు. ఈమె సరస్వతి అనుకుంటాను."

"దీక్షితులుగారు ఆలయమున కెందుకురాలేదు?" సరస్వతి వేసిన ప్రశ్నలో సౌజన్యమూ అధికారమూ పెనగొనివున్నవి.

"వారి ఆరోగ్యము పూర్తిగా చెడినది. తీక్షణమైన జ్వరం. అప్పుడప్పుడూ స్పృహగూడా తప్పుతుంది."

"వారిని చూచివద్దాము."

సరస్వతి తండ్రిచేయిపట్టుకొని తానుముందు నడచింది. ఆమెనడక నందుకోవడానికి బ్రహ్మయ్య గూడా పెద్దపెద్ద అడుగులు వేయవలసి వచ్చింది గుడినుండి బయలుదేరటానికి ముందేశాస్త్రిగారి మాటతో - నగేశ్వరస్వామికి హారతి జరగింది. "ఇదిజరగడం శంకరదీక్షితుల ఆరోగ్యఫలాన్ని ఆశించి" అని చెప్పకుండానే అందరికీ అర్ధమయ్యింది.

"దీక్షితులకేమి కాయిలా అప్పా?" శాస్త్రిగారు దారిలో విచారించారు. "రక్తభేదులు". శంకరదీక్షితులగారి గుడిసెను సమీపించడానికి శాస్త్రిగారికి చాలసేపు పట్టలేదు. జొన్నదంట్ల వాకిలితోసుకుంటూ సరస్వతి ముందు గుడిసెలోకి ప్రవేశించింది. దీక్షితుల చూపు పడటం మొట్టమొదట ఆమెపైననే.

"సరస్వతీ!" దీక్షితులు గట్టిగా అరచాడు.

"తాతా!" సరస్వతి హఠాత్తుగ దీక్షితులపైబడి కౌగలించుకొన్నది. ఆయన ఒళ్ళంతా తడుముడానికారంభించాడు. సరస్వతి 'తాతా' అన్న పిలుపు నాతడందుకొననేలేదు. ఆమె ఆమాట అనడానికిముందే అతనికి స్పృహవచ్చింది.

పెక్కి పెక్కి యేడుస్తూవున్నసరస్వతిని బ్రహ్మయ్య దగ్గర తీసికొ కొన్నాడు. "మళ్ళీ స్పృహ రావడానికొకకాలుగంట పడుతుంది." ఖిన్నవదనుడై గణపతిఅన్నాడు :

నిమిషానొ్కక యుగంగా గడపుతూ ముగ్గురూ కాచుకొన్నారు "మందు?" బ్రహ్మయ్య అడిగాడు.

"వారే తీసికొంటారు. వారు వైద్యంలో ధన్వంతరి అంతటివారు. ఉత్తమమైలయిన మాత్రలూ- రసాయనాలూ - యివే వారిఅస్తి. సంజీవి నితో సమానమైన మందులు వారిదగ్గరున్నాయి."

ఒకనిమిషంలోనే శంకరదీక్షితులు కన్నులు తెరచాడు. సరస్వతిని ఆయన ఆప్యాయంగా చూచాడు. దగ్గర కూర్చుండ బెట్టుకొని - ఆమె శరీరమూ పాదమస్తకమూ తడవి - ఆచేయి కంటికద్దుకున్నాడు.

"బ్రహ్మప్పా!"

ధ్వనికూడా క్షీణించింది. మరణమింక దూరంగా లేదనేదిగూడ అందరి కవగతమైంది.

"ఏమియాజ్ఞ?" బ్రహ్మానందశాస్త్రి దగ్గరకువచ్చి చేయిజాచాడు. "ఇన్నిదినాలూ సంతోషంగా బ్రదికినాను. ఇపుడు జగన్మాత ఆజ్ఞవచ్చింది. వెళ్ళిపస్తాను...సంతోషంగా...ఇదిగో - ఈ గణపతి - వీణ్ణి నీచేతిలోకి తీసికో - వీడొకసాధకుడు. ఈమె సాక్షాత్తూసరస్వతి! జైశివే."

శంకరదీక్షితుల ప్రాణవిహంగం యెగిరిపోయింది.

66

౧౧

నాలుక నోటిలో మహాతొందరగా తిరుగుతుంది. తొందరగా పరుగెత్తే వాళ్ళప్పుడప్పుడూ జారడముకద్దు. కాని అంతమాత్రంచేత మాటిమాటికీ జారడము దానిపని అయితేమాత్రం ఓర్చుకోవడం కష్టం. నాలుకకు ఎముకలేదు. కాని నాలుకతో మాట్లాడించడానికి ముందు బుద్ధితో రవ్వంతయినా ఆలోచించవద్దూ? ఇంతదూరం తర్కవితర్కాలు చేసేదెవరు? పోవునప్పెల్ల నాలుకను పోనివ్వడమే ప్రపంచస్వభావము. విన్నదానినంతా నమ్మడం మూర్ఖులపని.

గణపతి - సరస్వతి - వీరిద్దరూ భార్యాభర్తలైరి. తాళిగట్టడమూ - ఎన్నడో జరిగింది. తొందరలోనే గణపతి సరస్వతిని పిలచుకొని తన స్వస్థలమైన 'హరిహర' కు వెళ్ళిపోతున్నాడు. ఇత్యాది యిత్యాదివార్తలు వూళ్ళో అంతానిండుకున్నాయి. కాళ్ళులేకున్నా ఊరూరికి ప్రయాణించినాయి. కడకు గౌరమ్మ చెవిలోగూడ పడినాయి.

కుబుసం విడిచిన పాములా అయింది గౌరమ్మ.

"మన్నుతూర్పెత్తి పస్తాను!మన్ను!! ఆ అచ్చిముండను వూరికేవిడుస్తానా? అల్లుడనేల 'ఆషాడభూతి' బ్రహ్మప్పడున్నాడే! వానిమానం నడివీధిలో

కాసుకమ్మి వస్తాను. వానితేరు వడగొట్టి - వానితోనే దానివవన మమ్మించి వస్తాను. ఇలా చేయకుంటే నాపేరు గౌరమ్మగాదు. వానిదేమినాలుకా? ఇంకేమన్నానా? 'గౌరమ్మ' అంటే యేమనుకున్నాడో యీబూటాటకం దానవ్వ."

లగాములేని గౌరమ్మ నాలుక "బ్రేకు" లేని జీపుకారులాగ అడ్డు దారిబడి పోతూనేవుంది. కొంగుచెక్కి - చేతికావలికొక చెంబు దీసికొని-ప్రేమస్వరూపుడైన బాళప్పకుగూడ చెప్పకుండా - ఆమధ్యాహ్నమే గౌరమ్మ ప్రయాణం అయింది. తలనుమాడ్చే యెండనుగూడ ఆమెలక్ష్య పెట్టలేదు.

సాయంకాలము. ఇంటిముందరుగుపైన భాస్కర భట్టుగూర్చు న్నాడు. ఎవరో ఆతనిని హెచ్చరించారు. కొంచెం వెటకారంగా!

"ఏమండీభట్టుగారూ! మీకొడుక్కి నిశ్చయమైన పిల్లను మరెవ్వ రికోయిచ్చి - మీఅల్లుడు పెండ్లిచేసివేశాడటగా" - "నామనుమరాలికంతటి పుణ్యంపట్టలేదు."

భాస్కరభట్టు యిచ్చిన యీజవాబు - తన్ను ప్రశ్నించినవాళ్ళను నిరుత్తరులను జేసింది.

సంధ్యారాగం భయపడుతూ భయపడుతూ ఒదిగిపోతోంది. చీకటి చిన్నచిన్న అడుగులతో ముందుకు వస్తూవుంది - చీకటి - వెలుగూ - యీరెండునూ దాగుడుమూత లాడుకొంటున్నట్లు!

గణపతి సాయంకాల సంధ్యావందనం ముగించి అర్ఘ్యపాత్రలో నున్న నీటిని యింటిముందున్న తులసిపాదులో పోశాడు.

"ఆలస్యంలేదు."

సరస్వతి దీపంముందు కూర్చుంది పుస్తకం చేతిలోపట్టుకొని. సరస్వతి కప్పుడప్పుడే పదిదాటి పదకొండులో పడుతూఉంది.సౌందర్యా

నికంటె స్పష్టమైన సాత్వికత ఆమె ముఖములలో - అమాయకత్వం సరస్వతి ముఖకాంతిని రెండింతలు చేస్తోంది. నవ్వినప్పుడు ఆ తెలిగన్నులనడుమ తొంగిచూచి పోయేనీలకాంతులు- విశాలమైన ఆనుదుటిపైన లలితలాస్య భంగిమలు ప్రవర్తిస్తుండే అలకలు!

గణపతి .యివేమైనా గమనిస్తేనా? కర్తవ్యనిష్ఠుడైన "మిలిటరీ సార్జెంటు" సిపాయీలకు కవాతునేర్పించినట్లు- గణపతి బ్రహ్మానందశాస్త్రి గారిఆజ్ఞతో సరస్వతికి పాఠం నేర్పుతున్నాడు. ఒకనాడు సరస్వతి తల నొప్పుతూఉందని పడుకుంది. గణపతి ఆమెను యెత్తుకొనివచ్చి బలవంతంగా దీపంముందు కూర్చోబెట్టాడు. కర్తవ్యనిష్ఠుడైన ఆగణపతినుండిసరస్వతిని తప్పించడానికి - అచ్చమ్మ యెన్ని సలహాలో చెప్పవలసి వచ్చింది. అందువల్ల సరస్వతి నిర్ణీత సమయానికిముందే వచ్చి దీపంముందు కూర్చొంది.

"నాదిగూడ ఆలస్యంలేదు. ఇదిగోవచ్చాను."

గణపతిగూడ దీపంముందు గూర్చున్నాడు. "పార్వతీపరిణయమ" పాఠంచెప్పేగ్రంథము. పుస్తకం సరస్వతి చేతిలోవుంది. గణపతికి పుస్తకాపేక్ష లేనేలేదు. అతనికి చదివిన చదువంతా నోట్లోనే.

బ్రహ్మానందశాస్త్రి తిరిగి తిరిగి యింటికివచ్చాడు. కాళ్ళు ముఖం కడుగుకొని యీగురుశిష్యుల మధ్య ఒకచోట నిలుచున్నాడు. బ్రహ్మయ్య గారిని జూచిన గణపతిలేచివచ్చి కృష్ణాజినం పరచినాడు. స్వస్థచిత్తుడైన శాస్త్రి ఆసనంమీద గూర్చొని పాఠంవింటున్నాడు.

గణపతిది అమోఘమైన వాగ్ఝరి. ఆకంఠం గవ్వలు కెదికినట్లు గంభీరంగా వినిపించేది. స్పష్టమైన ఉచ్చారణ. ఇక సరస్వతి యేగుణం

లోనూ గణపతికి దీసిపోదు. గడచినరాత్రి చెప్పిన పాఠాన్నిఆమె తు. చ. తప్పకుండా ఒప్పించివేసింది. క్రొత్తపాఠం ఆరంభమైంది. అచ్చమ్మ వంటింటి వాకిలికానుకొని ఈపాఠ ప్రవచనాన్ని వింటూవుంది, ఆగురు శిష్యుల ఒద్దికను కన్నారజూస్తూ!

బ్రహ్మానందశాస్త్రి మనస్సున కొక్కటేచింత!

శంకరదీక్షితులే బ్రతికిఉండి యీదృశ్యాన్ని జూచివుంటే యేమ య్యేవాడో!

పాఠంసాగింది. ముందు గంభీరమైన గణపతి కంఠధ్వని. దాన్న నుసరించి సరస్వతీ కంఠమంజులవాణి.

ఇంటిలోకి గూబదూరినట్లుగా వాకిలిత్రోసికొని గభీమని దూరింది గౌరమ్మ. అందరూ దిగ్భ్రాంతులైనారు. శాస్త్రితల వాకిలివైపు నడచాడు. అచ్చమ్మ పడక సాలలోకి వచ్చింది.

పాఠం నిలచింది.

"రాండి! రాండి! మీబిడ్డ అచ్చక్క వంటింట్లోవుంది."బ్రహ్మయ్య అత్తగారికి స్వాగత మిచ్చాడు.

"రామ్మా! ఇదేమి? అనుకోకుండా హఠాత్తుగ వచ్చినావు? ఇంటిలో..."ఇంకా యేమేమో క్షేమసమాచార మడుగుతోంది అచ్చక్క. గౌరమ్మకీమాటలు కొబట్టలేదు. ఆమె సరస్వతివైపు చురచుర జూసింది. సరస్వతిమెడలో తాళిలేదు. దానితో గౌరమ్మ మనసులోని ఆర్భాటం కొంచెంతగ్గింది.

"ఏమేఅచ్చీ! హఠాత్తుగమాత్రం వస్తేనేం. వీడెవడీ క్రొత్త మొఖం?" గణపతివైపు చురచుర జూసిందిగౌరమ్మ. శక్తిఉంటే వాని

నాక్షణంలోనే బూదిచేసి వుండేదిగౌరమ్మ. ఆమెభావం గణపతికర్థమైంది. ఆతని ముఖమెఱ్ఱబారింది. చెవులకు రక్తమెక్కింది. అవమానమూ - జపకూ - అలక్ష్యమూ - యీ భావాలు యింతవరకూ గణపతి జీవితంలో రుచిచూడలేదు. అతడు పరశురామునివలె లేచి నిలచాడు.

"అవ్వగారికి నమస్కరించండి"

బ్రహ్మానందశాస్త్రి యిద్దరితోనూ అన్నాడు.

వారు నమస్కరించారు. ఆశీర్వదించడం గౌరమ్మకు తెలియని విద్య. ఆమెమళ్ళీ ప్రశ్నవేసింది ఘాటుగా:

"ఎవడువీడు?"

శాస్త్రిబదులు చెప్పబోతున్నాడు. ఇంతలోనే అందుకున్నాడు గణపతి.

"నేను శంకరదీక్షితుల కుమారుడను,"

"నేనంటే యేమనుకున్నావు?" అనే భావమూ యువకుని కంఠ ధ్వనిలో స్ఫురించింది.

గౌరమ్మ లోపలికి పోతూఅన్నది.

"నీకేమిబుద్ధి వున్నట్లులేదు. ఈ పంచాంగం బ్రాహ్మణ్ణి యెందు కింట్లో వుంచుకున్నారు. వీనికిక్కడ ఏమిపని? సరసీకి మొగుడుకాబోయే వాడుగూడ వీడేనేమే అచ్చీ?" ఒకసారి అచ్చమ్మముఖాన్ని, ఒకసారి బ్రహ్మయ్యముఖాన్ని అర్థగర్భితంగా జూచింది గౌరమ్మ.

సరస్వతి యీమాటలపై దృష్టిపెట్టనేలేదు, గణపతికి వినిపించనూ లేదు.

"లేదమ్మా !"

గౌరమ్మ యీప్రశ్నవేయడం బ్రహ్మయ్యకు సహించలేదు. తాను వాగ్దానం జేసిననాడే సరస్వతికీ బాళప్పకీ వివాహం జరగిపోయిందని ఆయనవూహ!

"సంస్వతిని బాళప్పకిచ్చేటట్లు ఆనాడే నిశ్చయమై పోయిందిగదా" ఈమాటతో గౌరమ్మకు ధైర్యంగలిగింది.

"ఊఁ... నేనుపేరేమాట విన్నాలే."

గౌరమ్మ అనుమానంగా ఆరంభించింది. ముఖంపైన పుంజుకున్న క్రోధానికి తగినట్లే - ఉంది ఆమెమాటగూడా!

"ఎందుకంటే... నేనువిన్నది ఆలాగ! సరసిని ఆపంచాంగం వానికిచ్చి.... మీరిద్దరూ ఏమైనా కలియబలికికొని..."

"ఛీ ఛీ. ఎంగిలిజేసిన అన్నాన్ని ..." బ్రహ్మయ్య యీమాటనే రెండుసార్లనుపఠించి అత్తగారి మనసునకు ధైర్యంచేకూర్చాడు. అయినా తనమనసులో తయారుచేసి పెట్టికొనివచ్చిన మాటలను అనకుండామరచి పోవడాని కామెకిష్టంలేదు.

"బంగారువంటి బాళప్పకు ద్రోహంచేస్తే మీరు బ్రతికేదేనా? మీరు వాగ్దత్తం జేసినారు....నేనూ చెప్పినానాయనకు. బ్రహ్మానందశాస్త్రి లకు నాలుక ఒక్కటేనని... "ఈకథ అంతా ఏమిబాగాలేదు. వెంటనే పోయి నిశ్చితార్థం చేసికొని రమ్మ" ని నన్నొకచోట పొందనీయకుండా వేధించినాడాయన! పరుగెత్తివచ్చాను... ఈజిడ్డినాగన్న..." ప్రతిమాట ఒత్తిచెప్పటాని కారంభించింది గౌరమ్మ. "లగ్నమయ్యేవరకూ నేను బ్రతుకుతానోలేదో. ఎవరుచెప్పగలరు? ఇవాళుండేవారు రేపులేరు. నిశ్చి తార్థం చేసివేయండి. లగ్నపత్రికలు వ్రాసివ్వండి. నలుగురు పెద్దవాళ్ళనూ పిలచి - ఎందుకంటే..."

"నలుగురు కాదమ్మా! ఐదుమందినని చెప్పు. నలుగురననరాదు." గద్గదంగా అచ్చక్క అన్నది.

"అట్లేగానీలే ! ఇంతపూ యింక ఆలస్యం జేస్తేబాగాలేదు. తిథి వారం అన్నీ చక్కగానే వున్నాయి. రేపాపని ముగిస్తే...."

అఘటనాఘటన సమర్థురాలు గౌరమ్మ.

తెల్లవారింది. ఇరుగుపొరుగిండ్లలోనున్న పెద్దమనుష్యులను పిలిచి లగ్నపత్రిక వ్రాయడాని కారంభించారు, ఇచ్చిపుచ్చుకోవడాలు గౌరమ్మ సమ్మతిమీదనే జరిగాయి, లగ్నపత్రికను బొడ్డులో చెక్కుకొని వెంటనే ప్రయాణమయింది గౌరమ్మ.

రెండునెలల్లోపుననే ఒకముహూర్తంగూడా దొరికింది. ఇంకేమి గావలె?

౧౨

"ఈరెండు నెలలలో సరసిని అధ్వాన్నం చేయవద్దేఅచ్చీ! మగ ముండావాండ్ల జతలో అక్కడికీ-యిక్కడికీ పంపేవు. గణపతో-గిణపతో. యెవడువాడు? అదేమిశ్రాద్ధ బ్రాహ్మణార్థాలు చెయ్యాలా? లేకుంటే వెండిపావలాలు దక్షిణలు తీసుకరావాలా! ఇంతవరకూ అంటే ఎలాగో గడిచింది. ఇకమీదట యిట్లా జరగటానికి వీలులేదు. నేటినుంచి దాన్ని 'మర్యాదస్తురాలైన గౌరమ్మకోడలూ' అనబోతారు. బాళప్పకథ నీకుతెలిసే వుంది. అగ్గిరాముడు. ఏమన్నా ప్రమాదమైతే నాజవాబుదారీకాదు. ఈ గతిలేని గణపతిని మొదలు యింటినుంచి తరుము."

ఊరికి పోవడానికిముందు బిడ్డకు యీరెండు వుపదేశాలు చేసింది మాతృశ్రీ గౌరమ్మ.

గణపతి నీళ్ళయింట్లో స్నానంజేస్తున్నాడు. గౌరమ్మ అనేమాటలు వానికెక్కడ వినబడతాయోఅని అచ్చక్కభయం! అందువల్ల ఆమె మాతృదేవియొక్కదీర్ఘోపన్యాసం ముగిసేవరకూ వంటింటిలో ఏదోఒకపాత్రను శబ్దం చేస్తూనేవుంది. ఈపాత్రల శబ్దం ఎంతసేపుసాగినా గౌరమ్మగారి దీర్ఘోపన్యాసం ముగిస్తేనా? నాటిగౌరమ్మ వుపన్యాస విషయం "తల్లి బాధ్యతలు."

గణపతి స్నానముగించి దేవునింటిలోకి వచ్చాడు. సరస్వతి రోజువలెనే దీపారాధనకు నూనెవేసి అందులో వత్తిపెట్టింది. తులసి పూలుమొదలైన పదార్థాలన్నీ అక్కడ తెచ్చిపెట్టింది.

ఇంకేమికావాలె గౌరమ్మకు? ఆమె మనస్సులో కూచున్నదయ్యం ఒక్కసారి ఉవ్వెత్తుగా లేచింది. సరస్వతికి కాబోయేఅత్త గౌరమ్మ కాళికావతారం ధరించింది. ఆమె పెదవులు గాలిపటాలవలె అదరడానికారంభించినాయి. కండ్లనుంచి మిణుగురులు రాలినాయి. గౌరమ్మమాటలు ఆశాంతవాతావరణంలో అశాంతిని గుమ్మరిస్తూ యిలావెడలినై:

"ఏసరసీ! రండముండ."

గణపతీ - సరస్వతీ యిద్దరుగూడా ఒక్కసారే వులిక్కిపడ్డారు. తనతల్లి యీ సన్నివేశాన్ని కల్పిస్తుందేమోనని అచ్చమ్మకు మొదటి నుంచే భయమే! అందుకై - ఇట్టి పరిస్థితి తటస్థింప కుండడానికై ఆమె యెంతో ప్రయత్నించింది.తల్లి కాకిలా అరుస్తుంది. గౌరమ్మ యీ అకాండ తాండవానికి అచ్చక్క తొలుత గడగడలాడింది. మరుక్షణమే ధైర్యాన్ని తెచ్చుకుని తల్లిని ఇలామందలించింది.

"అమ్మా! కొంచెం బయటికిరా నీవు!"

అచ్చక్క మాటలో దర్పమూ - తాహతూ - అవివేకులైన పెద్ద వాండ్లను మందలించే దృఢనిశ్చయమూ గూడా వుండినై. ఎప్పుడూ యెవ్వరికీ భయపడని ఆగౌరమ్మను ఒకమాటతోనే బయటికివచ్చేటట్లుచేసే గడుసుతనమూఉంది.

బొమ్మవలె నడిమింటిలోనికి నడిచివచ్చింది గౌరమ్మ గొణుక్కుంటూ! వంటగరిటె చేతిలోపట్టుకొని నిలచినబిడ్డ మొగాన్ని గౌరమ్మచూచింది. ఆ కన్నులలో యితరుల నాజ్ఞాపింపగలిగే రాజస గుణ

ుది. అచ్చుక్క కన్నులలో యీశక్తిగూడా వున్నదని గౌరమ్మ లోనూ అనుకోలేదు.

"రేపు మీయింటికి వచ్చినతరువాత నీకోడలిని నీయిష్టంవచ్చినట్లు వుంచుకో! మాయింట్లోమాత్రం మేమిలాగే పెంచేది. తెలిసిందా?"

ఎందుకోగాని ఈ మాటలతో గౌరమ్మ ఒక్కసారి దిగజారి పోయింది. అయినా తనవాదాన్ని ఆమె వదలలేదు. "నాకు ఎదురుతిరిగి వాదంచేసేంతటి పెద్దదానివానీవు? ఇంకేముంది?నీగుణాలే అన్నీనీ బిడ్డకు గూడా 'సపఫరా' అయినై! ఇంతకూ నాబాళప్ప అదృష్ట మిలావుంది. చూచిచూచి గయ్యాళిని పెండ్లి చేసికొని కాపురం చేయవలసిన కర్మ వానికిపట్టింది..."

"ఇక ఆ మాటలన్నీ ఎందుకు? నేడోరేపో వచ్చేస్తుంది లగ్నం. ఆతాళి ఒకటి బిగించుకొని యింట్లో అడుగుబెట్టనీ - తరువాత చెప్తాను గౌరమ్మ యేమనేదీ! నిన్ను మావూరి కోటవాకిట్లోకి రానిస్తానా? భంగ పోయినా నీబిడ్డముఖం చూపిస్తానా?"

"నీబిడ్డగతి అక్కడచూతువులే! బాళప్ప గుఱ్ఱాన్నికొట్టే కొరడా చేతిలో పట్టుకొని నిలచినపుడు - చర్మంవొలిచి వూరగాయ వేయించక పోతే - నాపేరు బహద్దూర్ గౌరమ్మంటారా?"

బహుశః పూర్తిగా బయటికి కనపడనికారణాన గౌరమ్మ పూర్తిగా మీసాలు తిప్పలేదంతే! చెయ్యి వూపుతూ తన వూరికప్పుడే ప్రయాణ మయింది.

"భోజనం చేసుకొని పోవమ్మా."

బిడ్డమాట అర్ధానికే నిలచింది: అప్పటికే గౌరమ్మ తలవాకిలి దాటింది. కంఠధ్వని మాత్రం ఆమె పొలిమేర దాటేవరకూ వూరందరికీ

ఏనిపిస్తూనే వుండింది. దారిపొడవునా మంత్రపుష్పం సాగింది, నిరంకుశ మైన గౌరమ్మ ముఖంనుంచి.

"అన్నమంట ! సున్నము !! ఈఅచ్చిని కన్నట్టి పాపఫలము అనుభవిస్తూ వున్నాను. బిడ్డఅనే అభిమానంతో నేసూచెద్దాను. బాళప్ప చెడ్డాడు, వానికేంతక్కువా? పెండ్లాలను దెచ్చి కుప్పలువేస్తాను. కుప్పలు. మాటకుపకి చస్తున్నాను ప్రపంచమైనా యేమంటుంది? ఆ సరసిముండ చెడిందిలే ! అదేమి ఆముసిముసినవ్వా - ఆపిసిపిసిమాట ! మంత్రమెందు కమ్మా సరసిముండకు చావడానికి? ఆ అల్లుడనే బ్రహ్మప్ప వానికైనా బుద్ధిఉందా? వయస్సుకొచ్చిన బిడ్డను ఏనుగులాంటి మొగవానిముందు కూచోబెట్టి వేడుకచూస్తాడా ... కానీకానీ ! మాయింటికి వచ్చినప్పుడు కాళ్ళు గట్టి అట్టవపైన వేస్తాను. అప్పుడువచ్చి... నాయింటికివచ్చి బిడ్డను చూడనీ తెలుస్తుంది. నన్నుదండిస్తుందా అచ్చిముండ ! దీనికడుపులో నిప్పుపెట్టకపోతే నేను ఒంటికన్ను భవానమ్మ బిడ్డనేగాదు. చేస్తాను. తయారుచేస్తాను - ఇప్పటినుంచీ బాళప్పను ఈసరసిని గోడుగుకిపి ఏడు చెరువుల నీళ్ళుతాగిస్తాను.

"దీనియెదుటనే యింకోదాన్ని దెచ్చి వాడికి పెండ్లిజేస్తాను. దిమ్మి రంగ దీపావళీయని బాళప్ప బ్రతకనీ ! ఇద్దరు పెండ్లాలువుంటారు. కావ లిస్తే మూడవదాన్ని తెచ్చుకోనీ... బాళప్పకేంతక్కువా!"

గౌరమ్మ ఊరుచేరేవరకు తిడుయూనే పోయింది. దారిపొడుగునా బిడ్డకు జరిగిన సహస్రనామాలెన్నో - సరసిపైన పగతీర్చుకొనేదానికి కనిపెట్టిన క్రొత్తక్రొత్త మార్గాలెన్నో...

"సరసి వీపుపైన వాతలుపెట్టిస్తాను బాళనితో". గౌరమ్మ మనసు లోని విషం దారిపొడుగునా వృద్ధిపొందుతూనే వచ్చింది. కానీ - తగ్గే

అపాయం లేశమున్నూ కనిపించలేదు. గౌరమ్మ యింటికివచ్చింది. భాస్కరభట్టు దేవునింటిలో కూర్చున్నాడు.

కుంకుమపూసిన ఆ కాగితాన్ని గబుక్కున ఆయనముందు పడవేసింది. మాట్లాడకుండా ఒచ్చలింట్లోకి వెళ్ళింది. త్రోవలో రసికశేఖరుడు బాళప్ప పిల్లినెత్తుకొని గీరుతూవున్నాడు. గౌరమ్మ వానితలపైన ప్రేమతో చేయివేసింది.

దేవుని కట్టపైన పడిన ఆకాగితాన్ని భాస్కరభట్టు చేతితోముట్టనూ లేదు చదువనూ లేదు.

"అందరినీ రక్షించే జగన్మాత - సరస్వతినిగూడా రక్షించుగాక!" ఈమాట మనస్సులోనే అనుకున్నాడు. భాస్కరభట్టు పూజముందుకు సాగింది.

భర్తపండిపెట్టిన అన్నాన్ని తోడేలువలె తిన్నది గౌరమ్మ. ముద్దు బాళప్పను మూలలో కూర్చోబెట్టుకొని తనపాఠానికి ఆనాడే శాంతిపాఠం మొదలుపెట్టించి - అచ్చక్క గయ్యాళితనమూ - సరసిస్వేచ్ఛా భారమూ - గణపతియింట్లో వుండడమూ - పీనికంతా బ్రహ్మానందశాస్త్రి ఒప్పుదల - ఇంకాయెన్నెన్నో విషయాలు - బాళప్పతలలో భద్రంగా ఎక్కించింది గౌరమ్మ. తల్లిచెప్పేంతసేపూ నోరు తెరచుకొని వింటూన్నబాళప్ప కడకు ముత్తెంలాంటి ఒకమాటన్నాడు.

"నాకు పెండ్లేమొద్దులేమ్మా !"

"ఛూ ! మొద్దుముండాకొడకా ! ఇంకొక్కసారి యీమాట అనీగినేవ్. కడ్డీ కాల్చి నోటిపైన వాతపెడ్తాను."

పదహారు సంవత్సరాల పసివాడు బాళప్ప ! - తల్లిబెదరింపుతో నోరుదెరచి ఆవులా యేడ్వడానికి మొదలుపెట్టాడు.

"ఎవరుచచ్చార్రా యింట్లో! అలాయేడుస్తావ్?"

శాలువముసుగుపెట్టి పంచుకున్న భాస్కరభట్టు కోపంతో యిలా అరిచాడు.

"ఊరికే పడుకోండిమీరు. పెండ్లింట్లో అవాచ్యం మాటలాడబోకండి. శ్రాద్ధాల అన్నంతిన్న ఆపాడునోటినుంచి - శ్రాద్ధాలూ- చావులూ తప్ప యింకేమాటలు వస్తాయి?" గౌరమ్మ పతిదైవాన్ని గద్దించింది.

"నీవేఅంటివిగదనే యింతకుముందు. 'ముద్దుముండాకొడుకా' అని భాస్కరభట్టు శాలువకప్పుకుని అందులోనే నవ్వుకున్నాడు.

ఇక్కడ అచ్చక్కమనసు అద్యంతమూ కాలిపోయింది. తాను చేసిన మహాపరాధానికి తన్ను నూరుమార్లు తిట్టుకుంది. నాడు అన్నము గూడా ముట్టలేదు. ఆమె ఎవరికీ ఎదురాడిన ప్రాణిగాదు. అందులో కనిపెంచిన తల్లికి!

రాత్రి పంద్రెండుదాటింది. సరస్వతీ గణపతీ - యిద్దరూ నిద్రపోయినారు. బ్రహ్మానందశాస్త్రి గురకపెడుతున్నాడు.

అచ్చక్క మెల్లగాలేచి మగనిపడకదగ్గరకు వచ్చి కాళ్ళదగ్గర కూచుంది. ఆయన పాదాలపైన తలపెట్టి వెక్కివెక్కి యేడ్చింది. కన్నీరు శాస్త్రిపాదాలపైన పడింది. బ్రహ్మయ్యకు హెచ్చరికఅయింది. "ఏమయ్యింది?" శాస్త్రి భార్యను సమాధానపరచడానికి శరీరముపై చేయివేయలేదు. తలపై నిమురలేదు. ముఖముతడువలేదు. సరస్వతి పుట్టినతరువాత వారిద్దరూ దీక్షాబద్ధమైన బ్రహ్మచర్యాన్ని సాగిస్తున్నారు.

"ఎందుకేడుస్తావు? నీతల్లి నిన్నేమన్నా అన్నదా?"

"లేదు. నేనే ఆమెనన్నాను."

ఈ తప్పును ఒప్పుకొనేటప్పుడు అచ్చక్క మనస్సునకు వేయి కొరడా ద్రెబ్బలుతగిలినై.

"అదిమహాపరాధం. నీవలాచేయకూడదు. ఆశిక్షకు ఓదార్పు లేదు" మరణదండన యిచ్చిన న్యాయాధీశునివలె ఎంతోకఠినంగా యీమాటఅని బ్రహ్మయ్యతలత్రిప్పి పండుకొన్నాడు. ఆలాగేకూర్చుని యేడుస్తూన్న అచ్చక్క యేమోఅనబోయింది.

"సరస్వతి...."

సరస్వతి మనబిడ్డగాదు. ఆమె శాపగ్రస్తమైన సాక్షాత్తు సరస్వతి. బాలప్పతో పెండ్లికావలసిందే! అంతవరకు ఆమెకు శాపవిమోచనంలేదు"

ఈమాటనెంతో నిరాపేక్షంతో అన్నాడు బ్రహ్మయ్య. అనాసక్తితో అన్నాడు. బ్రహ్మయ్య ముఖమునుండి శంకరదీక్షితులవాణి !!

అచ్చక్క లేచింది. ఆమె తనచాపపైకివెళ్ళింది. ఎందుకోమనస్సు స్థిమితంగాలేదు. అనేకవూహలామె మనస్సులో మరలలేచి సరస్వతి పడకను సమీపించింది.

నిద్రపోతున్న బిడ్డముఖాన్ని పూర్తిగా కండ్లు తెరచి చూ చి ం ది. "సరస్వతిమనబిడ్డగాదు." భర్తఅన్నమాట జ్ఞాపకంవచ్చింది. తండ్రికి మాత్రమేయిలా అనడంసాధ్యం, తల్లికి...?

## ౧౩

ఆడజన్మకు తాళిబిగించకుంటే యెట్లా? ...శవానికిపాడె !

భూమికి వచ్చినతరువాత జన్మానుభవము వద్దంటే విడుస్తుందా? జన్మఎత్తేటప్పుడు మనమేడ్వవలె. చచ్చునప్పు డితరులేడ్వవలె ! ఈనడుమ అప్పుడప్పుడు - కారుమేఘాలు మూసిపై సూర్యకిరణాలు ప్రకాశించినపు డంతా కిలకిలమని నవ్వు.

ఏడుపూ - నవ్వూ యీరెండూ ఒకటే నాణ్యంయొక్క రెండు ముఖాలు.

“మనకెంత యిష్టములేకున్నా అవశ్యం చేయవలసివచ్చేకార్యాలు యెన్నో జీవితంలో ! దేహమును ధరించి వచ్చినతరువాత ఆజీవనాన్ని ఎలాగో యీడ్వకపోతే యెలాగ! కావలె - వద్దు అనుప్రశ్నమనదిగాదు. చేయవలసినదాన్ని చేసియేతీరవలెను. మెడను కాడికితగిలించినతరువాత తప్పించుకునేదేముంది?

“చేసేదినీవు ! చేయించేదినీవూ. నేను చేసేదేముంది శ్రీహరీ !”

బాళప్ప వివాహదినం వచ్చింది. ఆ కార్యకలాపంలో పాల్గొన్న భాస్కరభట్టు మనసులో అవిచ్ఛిన్నంగా రేగుతుండేవే పైవూహలు.

గౌరమ్మ గట్టినపట్టుచీర వాలపాతదే! చాలనిదాని కక్కడక్కడ మన్ను. అంచుల్లో చినిగిన చింపులు కుక్కనాలుకల్లా వ్రేలాడుతున్నాయి. అయినా ఆపీతాంబరమువన్నెమాత్రం పోలేదు. అధరించిన జరీరవికె చీర కంటే పాతది. ముక్కులో ముత్తెంలేని ఒకనత్తు-బండిగానువలె! నిమిషానికి మూడుసార్లు పెండ్లికొడుకును ముట్టిముట్టిమాట్లాడిస్తుంది గౌరమ్మ.

పీటపైగూర్చున్న పెండ్లికొడుకు బాళప్పకు ఒకటేతూగు. అందరిపాలి తీపిఅపటుకులూ-రవ్వుండలూ-బేసర్లాడూ, అత్తిరసాలూ సమృద్ధిగా తిని అరగంటసేపు నేలపై కాలువేసి తిక్కుతూ ఏడుస్తుండినాడు. ఏడుపెసరఉండయూ - ఉద్దిపప్పుపుండయూ యిచ్చేవరకూ పెండ్లిచేసికోనని వాని హఠం. ఈదశమ గ్రహాన్ని సముదాయించేందుకు బ్రహ్మానందశాస్త్రి తలప్రాణం తోకకువచ్చింది. అచ్చక్క వాని సుద్దికేరాలేదు. ఎందుకో బ్రహ్మయ్యమనసులో ఎన్నివున్నా కార్యోన్ముఖుడైనాడు. బాళప్పకోరిన వరాలు బ్రహ్మయ్య యిచ్చేవేళకు అల్లునిసంతోష మాకాశమంటింది. వంటింటిలోనుంచి మంచినీళ్ళు తెచ్చేలోపలనే వుండలన్నీముగించాడు. పరమాత్ముని అద్భుతమాయ!

ఇదంతా తినేవేళకు వానికడుపు బరువెక్కింది. పాముకరచిన వానికండ్ల కప్పుడప్పుడే మసకలుకమ్మేటట్టు బాళప్పకండ్ల కప్పుడప్పుడూ మబ్బులు కమ్ముకుంటున్నాయి. పెండ్లిపీటలపై కూర్చున్నప్పుడు ఒకసారి తూగి ప్రక్కనున్న సరస్వతిపైననే పడ్డాడు. అచ్చక్కదిగ్భ్రాంతురాలైంది. శాపవిమోచన కిదిమొదటి మెట్టని బ్రహ్మానందశాస్త్రిగారి సంతోషం! ముహూర్తంగడియ సమీపించింది. పురోహితులు తొందరించారు.

"తదేవలగ్నం" ఘోషజరుగుతూంది. "కానీ - కానీ..." అని పురోహితులు మేళగాండ్రను హెచ్చరించారు. బాళప్ప సరస్వతి గొంతులో తాళిబిగించాడు.

తెలుగు క్షౌరికుడైన మేళగాడు ఒకపేసారి "ఇది న్యాయమా? ఓ రామచంద్రా" అని ఆరంభించాడు.

వానిగోడు అడిగేవారెవ్వరు?

కష్టంలోగూడ నవ్వగలశక్తిని చేతిలో పట్టుకొని ప్రపంచానికిదిగిన భాస్కరభట్టు ఒక్కడు - వాయిద్యగాండ్ర పాటలోని అర్థాన్నిసంపూర్తిగ గ్రహించాడు. కాలోచితమైన పాటఅని సంతోషపడ్డాడు.

బాళప్ప - సరస్వతి పరస్పరం తలంబ్రాలు పోసికొన్నారు. పెండ్లి అనే శ్రాద్ధం జరిగిపోయింది.

సాయంకాలం నాగవల్లి. అదీముగిసింది. పెండ్లిచేయించడానికే జంకనిదేవుడు నాగవల్లికి జంకుతాడా?

నాగవల్లి ముగిసేవరకూ పెండ్లి పూర్తిఐనట్లుగాదని అదేదో ఒక పిచ్చిసమాధానం అచ్చక్కమనసులో. అదీ ముగిసింది. అచ్చక్క పడక పట్టింది.

పిల్ల అప్పగించే శాస్త్రముగావద్దూ !

సమయానికి సరిగ్గా ముఖంతప్పించి మాయమైనాడు భాస్కరభట్టు! ఆపనిగూడ సంతోషంతోనే చేశాడు బ్రహ్మానందశాస్త్రి. ఆయనకంట్ల తడిగూడా పెట్టలేదు. ప్రతిసంవత్సరమూ విగ్రహాలకు పెండ్లిచేసే అర్చకుడాయన ! అంతఃకరణమూ - దయా - వేదనా యీభావము లాయనకెక్కడున్నాయి?

తనముద్దుబిడ్డ సరస్వతి ఎద్దులాంటి బాళప్పతొడపైన గూర్చొని వుండే దృశ్యంచూచి అచ్చక్కకు మూర్ఛ వచ్చినంతపని అయింది.

ఏడ్చేస్థితిని దాటిపోయిందామె దుఃఖం. భార్యమనస్సును గ్రహించాడు బ్రహ్మయ్య.

"ఆమెను బయటికితీసికొనిపోండి. కొంచెంగాలితగులనీ!" శాస్త్రి యీమాట బహుసహజంగాఅని కార్యంసాగించాడు. గౌరమ్మ కన్యకను అప్పగించుకుంది. అందరినీ యేడ్పించడానికి నడుంకట్టినిల్చిన గౌరమ్మకు కన్నీటిబొట్టుయెక్కడనుంచి వస్తుంది?"

సరస్వతిమాత్రం దిగాలుగాచూస్తూంది.

ఇంతకూ పిల్లనప్పగించేకార్యం ఎవరికంటిలోనూ ఒకనీటిబొట్టు లేకుండా ఒకనూతన పద్ధతిలో ముగిసిపోయింది. సరస్వతి తొడపైన కూర్చున్నప్పుడు అల్లుడైన బాళప్పమాత్రం ఒకసారి కిల్లుమన్నాడు, "అమ్మా! సరసి తొడపైన చాల బరువువేస్తూంది." అంటూ.

గౌరమ్మ కండ్లతోనే బాళప్పను భయపెట్టింది. రుస రుస లాడు కుంటూ సరస్వతిని క్రింద కూచోబెట్టింది.

రాత్రి పడుకొనే వేళకు గౌరమ్మ కాళరాత్రిలా అయింది. "గోజూ కలహమూ - రంపూ - రాద్ధాంతమూ - దూరూ - తిట్లూ అన్నీసక్కగా సాగినాయి. వియ్యంకులు సరిగామర్యాదచేయలేదనీ - వరోపచారంబాగాలేదనీ - అన్నంలోనిమెతుకులు లావుగాపున్నాయని-తాముపండ్లుతోముకునేటప్పుడుమేళగాడు మేళంవాయించడం లేదని - బ్రహ్మానందశాస్త్రి జాతిభ్రష్టుడనీ - యింకాయెన్నెన్నో! గౌరమ్మకు సరిగాసమాధానం చెప్పే ఆసామి ప్రతిపక్షంలో ఎవరూలేకపోయినందువల్ల ఆమెవాగ్ఝరి అంతలో ఆగిపోయింది.

అచ్చక్క యేసుద్దికీరాలేదు. బ్రహ్మయ్యయెంతో ఓర్పుతోపోరాడాడు. అడిగిందంతా తెచ్చియిచ్చాడు. వియ్యంకుల కే కొరతాకలుగనివ్వ

లేదు. వారుపూరికివెళ్ళేవరకూ రాముని ముందర హనుమంతునివలె కాచు కున్నాడు.

సంప్రదాయాన్ని దాటడమంటే నాలుకపిసుక్కుంటుంది గౌరమ్మ. అయితే సంప్రదాయానికి ఆమెవ్యాఖ్యానం మాత్రం అడుగడుగునా మారు తుంటుంది. అనుకూలమైన సంప్రదాయంమాత్రం అవశ్యాచరణనీయం. అత్తగారి యింటినుంచి యేదైనా ఒకపదార్థం ఊరికిపోయే టప్పుడు అడుగకుండా తీసికొనిపోవడం పెండ్లిలో అల్లునికొకఆచారం. గౌరమ్మకిక యింతకంటే అనుకూలమేముందీ? స్నానాలగదిలో పెట్టిన బంగారుచైను కొట్టివేసింది. ఇక బాళప్పఅందామా - వాడుచోరవిద్యలో ఘటికుడు. కనబడినవెండిలోటా-రాగిచెంబూ - కంచుఘంటా - ఇత్తడితాంబాళమూ- రుబ్బుడుగుండూ - అన్నీదొంగిలించి అమ్మచేతికిచ్చాడు.

ఎల్లైతేనేమి ? వియ్యంకులు పూరువికిచారు. గణపతిగూడ"హరి హర్" నుంచి వెనక్కువచ్చాడు. దేవుడునిజంగా దయామయుడు!

## ౧౪

ఎక్కడచూచినా యీవ్రాతే - ఊరినిండా-ఇంటిగోడలపైనా -పాడు గుళ్ళపైనా - గోపురాలపైనా - మనుష్యులు పారాడే చోట్లలోఅంతా - పెద్ద అక్షరాలతో"గోబ్రాహ్మడూ" అనేమాట వ్రాసిపెట్టారు ఎవరోదుర్మార్గులు.

సూర్యోదయానికి ముందే యధాప్రకారం గౌరమ్మలేచి తలుపులు తెరిచింది. ఇంటివాకిలినిండా పెద్దపెద్ద అక్షరాలతో వ్రాసిపెట్టారు. సరస్వతికి గౌరమ్మప్రత్యక్షశత్రువు. ఆవ్రాత ఆమెకెలా తెలుస్తుంది?ఇంట్లో భాస్కరభట్టు "కరాగ్రేవసతేలక్ష్మీః కరమధ్యే సరస్వతీ !" అనిపారాయణ చేసికొంటూవున్నాడు. గౌరమ్మ ఆయన్ను గట్టిగా కేకవేసిపిలిచింది:

"ఇక్కడరాండి తొందరగా ! రాండిఅంటే రాకుండా ఏమిటా మంత్రాలు పిల్లిలాగ అరుస్తూ ! వచ్చారా?"

అలారంగడియారంవలె ఒకటేధాటిగా మొత్తుకుంటూందిగౌరమ్మ. శనిగ్రహంలాంటి గౌరమ్మగొంతు మూయించడానికి మార్గాంతరమేలేదు. "గౌరమ్మ బొడ్డుగోసిన మంత్రసానియిల్లు పాడుగానూ" అంటూ గొణుక్కుంటూ భాస్కరభట్టు బయటికివచ్చాడు.

తలవాకిలిపైన పెద్దపెద్ద అక్షరాలతో వ్రాసిన వ్రాతను గౌరమ్మ మొగుడికి చూపించింది.

"ఏమిటీవ్రాత : కొంచెమువదవంది, అర్థముచెప్పండి. ఏముండా కొడుకు యీపని చేశాడూ అంటాను !"

మొదట భాస్కరభట్టుకుగూడా యీ వ్రాతలోని గూఢార్థం తెలియలేదు.

పవిత్ర సంస్కారంలో బ్రదికినవారికి లోకంలో యిలాంటి వ్యవహారాలు వుంటా యనేదే మనస్సునకు తట్టదు గౌరమ్మ మొగుణ్ణి గదిమి చూచింది:

మీరూ అక్షరాలు మరచిపోయినారో యేంపాడో ! బిక్కుబిక్కుమని చూచుకుంటూ నిలబడి పోయినారు - ఈరణ్ణ ముందు బసవణ్ణవలె. ఏంవ్రాశారిందులో చెప్పండి..."

అనుష్టుప్ శ్లోకంవలె గంభీరంగావున్న యీ మధితార్థం చాల సేపటికి భాస్కరభట్టుకు తెలిసింది. రెండు దినములక్రిందట జరిగిన ఒకసంఘటనతో ఈముక్కలను అతికించి అర్థంచేసికొన్నాడాయన.

"ఈవ్రాత నీబాళప్పదే !"

"నోరు మూసుకోండి చాలు ! ఎవరైనా నవ్వేరు. వాడు రెండు రోజులనుంచి శరీరంపై స్పృహలేకుండా పడుకున్నాడు. వాడెప్పుడువ్రాసినాడు? పైగా వానికక్షరాలు రాందేపాపం !"

"అదికాదే ! నీకుమారవర్యునికి సంబంధించిన విషయమేయిది"

"అంటే...ఏమైనా చెడ్డమాటలు వ్రాసినారాయేమి? వాకిలినిండా పీడముండాకొడుకులు."

" అవునే ఆమాటలే వ్రాసినారు. గోబ్రాహ్మడు అని" గౌరమ్మ పిడుగులాగ లంకించుకుంది:

"ఏముండాకొడుకు రాసినాడూ అంటాను. వాడిపెళ్ళాము ముండ మొయ్య ! రాసినచేతిని పాముగరవా ! అక్షరాలు నేర్చుకున్న ముండా కొడుకుల కిదేంపని ! దీంతో యేమవుతుంది ? మా బాళప్పకున్న పీడ పోతుంది. అక్షరాలువస్తే యిట్లా గుణాలు వస్తాయనే నేను బాళప్పను బడికే పంపలేదు. ఈరాతరాసినవాని తల్లినాలుక పీలిపోనూ ! వానిచేయి విరగా ! వాడు నాచేతికి దొరికితే - వాడివంశాన్ని స్వర్గానికెక్కిస్తాను "

గౌరమ్మ అప్పుడు మాట్లాడినభాషా - వాక్యవిన్యాసాలూ -కన్నడం లోని "ఆధునిక సాహిత్యా" నికి సంబంధించిన నాలుగు పుస్తకాలువ్రాయ డానికి సరిపోతవి. ఆమెతిట్లను క్రొత్తక్రొత్తగా సృష్టిస్తుంది.

గౌరమ్మ వాకిలికంతా సున్నంగొట్టింది. అకొట్టేటప్పుడు ఎదురింటి గోడవైపు చూపుపారింది. దానిపైనా ఆమంత్రాక్షరాలే ! దానికీ సున్నం గొట్టింది. ప్రక్కింటిగోడకూ అవే ! ఎడంవైపున్న యింటికీ అవే ! మూడోయింటి తలవాకిలిపైనా ఆఅక్షరాలే ! ప్రక్కవీధిలోనూ యిదేకథ ! ఊళ్ళో అన్ని గోడలపైనా యీ పురాణమే ! తెల్లవారి లేచిన గౌరమ్మ కిదే పనైపోయింది. కనబడినచోటంతా సున్నం కొట్టివచ్చిందావె ! ఇండ్లకు ఎన్నడూ సున్నంకొట్టుకోను నోచుకోలేని బీదలయిండ్ల కన్నిటికీ ఆనాడు మహాఅదృష్టం పట్టింది. అన్నియిండ్లూ శుభ్రంచేసి వచ్చింది గౌరమ్మ.

"ఈనాడుగూడా మళ్ళీవ్రాస్తే - యిదియేంజేస్తుంది ?"

ఇంటిలో పడకపై పండుకొన్న భాస్కరభట్టు నవ్వుకున్నాడు. బాళప్ప జీవితంలో మూడురోజులకుముందు జరిగిన సంఘటనమే యీ కావ్యసాహిత్యానికి కారణం !

ఆనాడు అమావాస్య. నల్లనిచీకటి! చాలనిదానికి గాలీ - వాన. నడుమనడుమ మెరపులు - ఊరిబయట గోకర్ణేశ్వరుని పాడుగుడి! దీపాలు పెట్టినాక అక్కడికెవ్వరుపోరు. ఆదేవునికి పూజలేక యిరవై సంవత్స రాలయింది. అర్చకునిభార్య దుర్మార్గురాలు. ఆ అవమానానికి తట్టుకోలేని అర్చకుడు గోకర్ణేశ్వరునిగుడిముందున్న బావిలో దూకిచచ్చాడు. వాడు దయ్యమైనాడని వూర్లో అంతాపుకారు. అర్ధరాత్రి గంటవాయించిన శబ్దం విన్నసాక్షులునూర్లకు. చచ్చినపూజారి స్వరబద్ధంగా మంత్రం చెప్పు కుంటూ గుడికి ప్రదక్షిణాలు చేస్తున్న దృశ్యాన్ని మిట్టమధ్యాహ్నం చూచిన ఆవులుకాచేవాండ్లు బోలెడుమంది. శ్మశానంలో శవసంస్కారం ముగించి వచ్చేటప్పుడు ఎందరినో ఆచచ్చిన పూజారి అడ్డగించాడు. అడ్డ గించి తీర్థంతీసికోండి అని బెదరించాడట! ఇంతకూ బ్రతికి బట్టకడ దామనే వాడెవ్వడూ ఆగుడివైపుపోడు. అమావాస్యనాటిరాత్రి శరీరము నిండా తలనిండా గాయాలతో హెచ్చరికతప్పి బాళప్ప ఆగుడిముందు పడివున్నాడు. ఇల్లుకారుతుందనే నెపంతో బాళప్ప బయటపండుకున్నాడు. 'ఒద్దు! ఒద్ద'న్నది గౌరమ్మ. వాడు వింటేనా?

"ఓరిబాళప్పా! అమావాస్య కటికచీకటి! ఒంటిగా యెందుకు బయటపడుకుంటావు. అదిమంచిదిగాదు." గౌరమ్మ ముద్దుసేసి చెప్పింది.

"నాకన్నీ తెలుసులే!"

మొదలే వంకరగానున్న ముఖాన్ని యింకా వంకరగా పెట్టాడు బాళప్ప! ఈనడుమ ప్రతిక్షణమూ - "నాకు పెండ్లయింది" అనే భావన బాళప్పమనసులో! దానితో బాళప్పమనిషే మారిపోయాడు.

"పండుకోనీలేవే! నీకుమార రత్నాన్ని బూచియెత్తుకుని పోదులే" భాస్కరభట్టు బాళప్పమాటకే మద్దతుయిచ్చాడు.

"ఏమికర్మపట్టిందిరా !"

గొణుక్కుంటూ కోపంతో ఢీలుమని వాకిలివేసింది గౌరమ్మ. వాననిలిచి అరగంట అయింది. రెండవయామం దాటి మూడవయామం తిన్నగా ప్రకాశిస్తూఉంది. ఎవరో వాకిలితట్టి "భాస్కరప్పగారూ ! భాస్కరప్పగారూ" అన్నట్లైంది.

అర్ధనిద్రలో లేచిన గౌరమ్మ భీకరంగా గద్దించింది:

"ఎవరది ?"

"ఇంకెవరుంటారు· మనకుమారరాముడు. చలిగావుందేమో - యింకోదుప్పటి కప్పుకోవడానికివ్వు !" భాస్కరభట్టు ముసుగులోంచే పలికాడు.

మళ్ళీ "భాస్కరయ్యగారూ" అనికేక.

"మీరు....మీకోసమే ఎవరోవచ్చి పిలుస్తున్నారు." గౌరమ్మ గొణుగుతూ వాకిలి తెరిచింది.

"ఏం మునిగిపోయిందయ్యా ! యింతరాత్రిలో ! భట్టుగారితో మీకేంపని? ఇంకేమిపనివుంటుంది. ఎవడో చేవానిముండాకొడుకు చచ్చి వుంటాడు. ఆ శవం సాగించడానికి. తెల్లారి ఆపని జరిగితే యేంనష్ట మొచ్చిందీ? ఈవానలో నిప్పానీరా? కట్టెలుగూడా తడిసివుంటాయి. ఇంతవానలోనే చచ్చాడూ ! ఎవరయ్యా ఆపుణ్యాత్ముడు? " గొణుగుతూనే గౌరమ్మ చేతిలోని దీపం కొంచెం పెద్దదిగాజేసింది.

నలుగురయిదుగురు బయట నిలిచారు. ప్రక్కనున్న అరుగుమీద బాళప్ప నిశ్చేష్టుఁడై పడివున్నాడు. నోటినుంచీ ముక్కునుండీరక్తము కారుతూంది. తలపై పెద్దగాయం - బట్టలంతారక్తం !

" అయ్యో బాళప్పా ! నాయనా ! నాతండ్రీ ! " సగంవూరికి విని పించేట్టు మొత్తుకుంది గౌరమ్మ. భాస్కరభట్టు బయటికి పరుగెత్తుకొని వచ్చాడు. రక్తంచూచి భయపడినాడాయన. ఊపిరాడుతూంది. నాడి పట్టుకొనిచూచాడు. అది నిలచిపోలేదు.

ఒకఉరీతిన ఆబోతులాగ ఏడుస్తుండే గౌరమ్మను కొంచెంసేపు వూరకవుండమని బతిమాలాడు భాస్కరభట్టు ! ఆతరువాత వచ్చిన వారిని విచారించాడు.

"ఎవరుతన్నిరప్పా వీనిని? ఎందుకుతన్నారు?"

బాళప్పను మోసుకొని వచ్చినవారికి రెట్టలాపు బుస. మూడురైల్వే బారువల బరువున్న బాళప్పను మోసుకొని రావలెనంటే సామాన్యమా ?

" ఈపిల్లవాణ్ణి ఎవరో బాగాతన్ని గుడిముందు వేసిపోయారు "

" ఎవరు ? "

"మాకుతెలియదు." వారు కథచెప్పడాని కారంభించారు: "మాఆవు తప్పించుకొన్నది. ఎవరైనా దాన్ని బందెలదొడ్డిలో వేసినారేమో అని రెడ్డిగారి నడిగినాము. లేదన్నారు. ఎక్కడపోయిందోనని వెతుక్కుంటూ ఆపూజారిబావిదగ్గరికి బోయినాము. ఎవరో మూలిగినట్లుధ్వని. దయ్యం నీటిలోదుమికింది. రెండడుగులు ముందుకువేసి చూతుముగదా! ఈస్వామి అక్కడ పడివున్నాడు. తలనిండా గాయాలు. ఈపిల్లవాడు భాస్కరయ్య కొడుకు. పిచ్చివాడు అని యీమామయ్య అన్నాడు. ఆకటికచీకట్లో అక్కడికెందుకెళ్ళాడో ! మేంమోసుకుని వచ్చాం ! ఇకవస్తామండి. మా పశువునక్కడ ఒకచెట్టుకు కట్టేసివచ్చాము."

భాస్కరభట్టుకు యీ కథయేమీ అర్థంకాలేదు. ఇంటిముందు కట్ట పైన పడుకున్న కుమారబాళప్ప పాతగుడిలో ఎలావేలాడు? ఇదిఆయన పాలికి విడదీయరానిముడిగా తయారయింది.

"వాళ్ళవైపు పట్టుకో!" భాస్కరయ్య గౌరమ్మతో అన్నాడు. ఇద్దరూకలిసి కుమారరత్నాన్ని యెత్తుకొనివచ్చి యింటిలో పండబెట్టారు. గుడ్డలుమార్చి గాయాలుకడిగి కుంకుమమెత్తారు. గౌరమ్మ ఉప్పు మిరప కాయలు - చీపురుపుల్లలూ - అన్నిటితోనూ బాళప్పకు దిష్టితీసింది. హులి గమ్మదేవతకు ముడుపుకట్టింది. ఉన్నట్టుండి బాళప్ప కలవరించాడు.

"పోలీసులు - పోలీసులు - అబ్బో కొట్టొద్దండి. తప్పుచేశాను. ఇంకోసారికి చేయను"

భాస్కరభట్టు మనస్సునకు కొంచెంసమాధానం చిక్కింది.

"పోలీసుముండాకొడుకులు నాబిడ్డను కొట్టారాయేమిటి? తగ్గుజాతి ముండాకొడుకులు - నేను శాపమిస్తే కూడులేక చస్తారు." గౌరమ్మ తన ఆటోపానికి శ్రీకారంచుట్టింది.

భాస్కరభట్టు కోపానికి అంతులేకుండా పోయింది. ఆయన గౌరమ్మను కసరాడు.

"నోరుమూయి చాలు! ఉద్యోగస్థులనలా తిట్టొద్దు: కట్టపైన పడుకొనివుండే నీ కుమారుణ్ణి ఊరిబయట కెత్తుకొనిపోయి తన్నడానికి వారికింకేమి పనిలేదు. వీడేదో వెధవపని చేసివుంటాడు. పూర్తి తెలిసి కొని మాట్లాడు." బాళప్పకు చాలసేపటివరకూ తెలివిరాలేదు. వానిదగ్గర కూర్చున్న గౌరమ్మ మాటిమాటికి "హులిగమ్మ" సహాయ్యాన్ని అర్థిస్తూనే వుంది. ఒకగంటతరువాత బాళప్పకు స్పృహవచ్చింది. ఒళ్ళంతా నొప్పి

నటానికిబదులు అభ్యాసబలంతో " అమ్మా ! ఆకలి ! ఆకలి ! " అని అరిచాడు.

భాస్కరభట్టు కొంచెంకస్తూరివాడాడు. పాలుగాచి త్రాగడాని కిచ్చాడు. తెల్లవార్లూ నొప్పితో బాళప్పకు దేహంమీద ప్రజ్ఞలేదు. నడుమ నడుమ బెదురుతూ "పోలీసులు ! కొట్టొద్దండి ! ఇంకోసారికీ పనిని చేయను." అనేమంత్రాన్ని మాత్రం పఠిస్తున్నాడు.

మరునాటిమధ్యాహ్నానికి బాళప్పకు పూర్తిగాస్పృహవచ్చింది. రాత్రి జరిగిన సంఘటనలన్నీ వానికొకటొకటే జ్ఞాపకం వస్తున్నాయి. తలవైపు గూర్చున్న గౌరమ్మ ఎంతోప్రేమతో వాణ్ణిఅడిగింది.

" ఏమయిందప్పారాత్రి ! ఇంటికట్టపైన పడుకొన్న నిన్ను యెత్తు కొని పోయిందెవ్వరు? వారిపేర్లుచెప్పు. వాళ్ళకి పెళ్ళిచేస్తాను. జ్ఞాపకం చేసుకో !"

" జ్ఞాపకంలేకేమమ్మా ! నేనే గుడిదగ్గరకు పోయాను. "

" నీవేపోయావా? ఆ సరిప్రొద్దులో ! ఆదయ్యాలగుడిదగ్గరికి? " భాస్కరభట్టు మెల్లగా లేచివచ్చి వాకిలివెనుక నిలిచి తల్లీకొడుకుల సంభాషణ వింటున్నాడు.

" అక్కడికెందుకెళ్ళావురా ! ముండాకొడుకా? అదేంవూరా ! బజారా ! మనుషులా ! ఆడుకొనేవాండ్రా ! ఏమి మీనాన్న ముల్లెవున్నదని అంతసరిప్రొద్దులో అక్కడికెళ్ళావు ? "

"ఊరికేపోయినానమ్మా ! ఆడుకుంటూ ! నీవింకా..." తల్లివేసిన అనావశ్యక ప్రశ్నకు వానికి కోపంవచ్చింది.

మనస్సుకొంచెం సమాధాన పరచుకొని గౌరమ్మ సంభాషణ సాగించింది.

" ఊఁ...తరువాత? "

" పోలీసులు పట్టుకొని బాదినారు. " కథలో మధ్యభాగం మ్రింగి వేసి ఫలితాంశాన్నిమటుకు చెప్పాడు బాళప్ప - అనేవిషయం పిల్లలకు గూడా అర్థమౌతుంది.

" అదికాదురా ! పోలీసులు ఎందుకు ఊరకే కొట్టుతారు? నిన్నే మన్నా దొంగనుకున్నారాయేమి? "

" ఛీ ఛీ లేదమ్మా ! ఆయిద్దరు పోలీసుల్లో నన్ను ఒకడు గుర్తుపట్టి నాడు గూడా ! " వీడు భాస్కరయ్యాగారి పిచ్చికొడుకూ " అన్నాడు. "

" అయితే యెందుకుకొట్టారు? నీవేమైనా వాళ్ళను తిట్టావా? "

" లేదమ్మా!అంతపనీచేస్తానా ! నిష్కారణంగానే కొట్టినారు. "

" ఊరికినే ఎందుకుకొడుతార్రా? వాళ్ళువచ్చినప్పుడు నీవేమి చేస్తున్నావు? "

ప్రశ్నలు చాలాతీక్ష్ణంగా వున్నై ! సత్యాన్ని కప్పిపుచ్చి అబద్ధం చెప్పడానికి సాధ్యంకాలేదు బాళప్పకు.

"నేనేమి చేయలేదమ్మా ! అక్కడ ఒకఆవు నిలచివుంది. ఊరికినే కొట్టినారు పోలీసులు !"

ఏడ్వడం మొదలుపెట్టాడుబాళప్ప ! గౌరమ్మకేమీ అర్థంకాలేదు.

" ఆవునిలచివుంటే - నిన్నెందుకు కొడతారు? నీవుదాన్ని దొంగి లించావని తలచివుంటారు. "

ఏడుస్తూనే అన్నాడుబాళప్ప : " పోమ్మా ! నీకెవరుచెప్తారు ! ఆవుదొంగతనం గాదు."

బాళప్పకు సిగ్గువచ్చింది. మాటనిలిపి ఏడ్వడం మొదలుపెట్టాడు "కొట్టారుపోలీసులు" అంటూ ముగించాడు.

" పోలీసు లన్యాయంజేశారు: నిన్నుచంపి ఆదావిలోనే వేసిరాకూడదూ!" అనుకుంటూ భాస్కరభట్టు తలుపు సందునుంచి బయటికివచ్చి బాళప్పను కాల్చివేసేటట్టు చూశాడు.

" ఎందుకలా చూస్తారువాణ్ణి! వాడేమిచేశాడని? " గౌరమ్మబుద్ధి అక్కడికే నిలచిపోయింది. గడచినసంగతి ఆమెకు తెలియలేదు.

భాస్కరభట్టుకోపం గట్టుతెగింది.

" నీకుమారుణ్ణి కట్టెలలోపెట్టి మంటపెట్టు! లేచిరా! చాలుగాని. అక్కడకూర్చొని వానివిలాసాలన్నీ వింటున్నావా?"

భార్యను ప్రక్కకుపిల్చాడు భాస్కరయ్య? బాళప్పపై తనకున్న అభిప్రాయాన్ని ఒక్కమాటలోఅన్నాడు:

" వాడుచస్తే అందరికీ సంతోషంతో చక్కెరపంచుతాను. "

భాస్కరభట్టు విపులంగా భార్యకు బాళయ్యలీలావిలాసాన్ని వివరించాడు ఇద్దరూ తలలుబాదుకున్నారు. శృంగేరిశాలువ ముసుగుపెట్టుకొని కూర్చున్నభాస్కరభట్టు కోపానికి అంతేలేదు. ఆయన బయటికి వచ్చి యెక్కడికో వెళ్ళిపోయాడు పిచ్చివానివలె! తెల్లవారుతూనేగౌరమ్మ కండ్లకు మళ్ళీ 'గోబ్రాహ్మణుడు' అనే సాహిత్యమే పూరిగోడలపై అంతటా కనపడింది.

౧౫

ఆడుకునేపిల్లలకు తాళిబొట్టుకట్టితేమాత్రం యేమిమార్పువస్తుంది? పెండ్లికావడంతో సరస్వతిలోగలిగినమార్పు ఒకటే! మెడలో మంగళ సూత్రం! ఇంకేమార్పూరాలేదు. రావడానికి కారణాలూలేవు.

మొదటివలెనే సాగుతున్నాయి ఆమెవిద్యాభ్యాసమూ - ఆటలూ-పాటలూ - ప్రక్కింటిఅవ్వచెప్పేకథలూ - యింట్లోపనీ - అన్నీను.

ఒకరోజుగణపతి పాఠంచెబుతున్నాడు. అపుడామెఅన్నది:"నీవు నాపెండ్లికుండలేదు గణపతి!"

"ఔనమ్మా! నాకు'హరిహర'కు అర్జంటుగా పోవలసివచ్చిందిలే! పోనీలే! కాని - నీమగడెట్లున్నాడోచెప్పు!"

తనయీప్రశ్నతో సరస్వతి సిగ్గుపడియింట్లోకి పరుగెత్తి పోతుం దేమోయని ఊహించాడు గణపతి. కానిఅట్లేమీజరుగలేదు. ఆమెనవ్వుతూ తనమగణ్ణి వర్ణించింది:

"అందరివలెనేవున్నాడు! రెండురెండుకళ్ళూ - కాళ్ళూ- చేతులూ ఒకముక్కూ..."

"తోక" గణపతినవ్వాడు.

"నామొగుడు పశువనుకున్నావాయేమి?"

కొంచెంకోపంతో సరస్వతిఅన్నది.

"రెండుకాళ్ళ"

గణపతి వెనుకనుంచి ఒకవిశేషణాన్ని ఏగిరించాడు.

సరస్వతికి గణపతిచేష్టసరిపోలేదు. తనమొగుణ్ణి తక్కువజేసి గణపతి మాట్లాడడంతో ఆమె అభిమానానికి చిన్నదెబ్బ తగిలింది.

వెంటనే గణపతికి సంచర్భము అర్థమయ్యింది. తన యచాతుర్య మున కాలమిపశ్చాత్తాప పడ్డాడు. సరస్వతి రెండుచేతులను తన ఎడమ చేతిలోనుంచికొని కుడిచేతితో ఆమె అలకలు నిమురుతూ -

"సరస్వతీ! నాదోషం క్షమించు! ఇంకొకసారి నేనిలా మాట్లా డను." అన్నాడు.

"క్షమించాను" అన్నట్లుగా సరస్వతి చిరునవ్వునవ్వుతోంది. ఆమెనవ్వినప్పుడు చెక్కులపై చిరుగుంటలు పడినవి.

ఎడమచేతిలో ఆమెరెండు చేతులనూ పట్టుకొనే వున్న గణపతి కుడిచేత్తో సరస్వతి చెక్కిలిపైన తిన్నగా కొట్టాడు.

తలవాకిటిలో అడుగుపెట్టిన గౌరమ్మ యీదృశ్యాన్ని చూచి ఆకలి గొన్న పులివలె హుంకరించింది.

"అవ్వవచ్చింది. అవ్వవచ్చింది."

తప్పట్లుతడుతూ సరస్వతి అమ్మకుచెప్పడానికి వెళ్ళింది.

అమ్మయింటిలోలేదు. పూలుతేవడానికి బయటకు వెళ్ళిన అచ్చక్క అపుడే యింటిలోకివచ్చింది. ఎదుటనిల్చిన తల్లినిచూచి ఆమెకు నోటమాట రాలేదు.

ఒకసారితాను తల్లితో దురుసుగా మాట్లాడింది. ఆదోషానికి మన స్సులో యెంతో మదనపడింది అచ్చక్క. మొగుడిముందుగూడా తన పొర పాటు చెప్పికొని పశ్చాత్తాప పడింది. ఏడ్చింది. తానలా తల్లిని అనడం క్షమింపరాని అపరాధమని గూడా తెలుసుకుంది. ఈ వూహాలన్నీ తల్లిని చూచినవెంటనే ఒక్కసారిమనసులో లేచాయి. ఆనాటినుండి అచ్చక్క హృదయంలో తల్లి పరదేవతయై కూచుంది.

"లోపలికి పోదామమ్మా ! ఇక్కడెందుకు నిల్చున్నావు. అల్లుడు బాగున్నాడా।" అచ్చక్క ప్రశ్న వేసింది.

" ఇంకెందుకమ్మా నీకు బాళప్పనికథ ? " తల్లి అన్నయీమాట సరళస్వభావురాలైన బిడ్డకు అర్థమేగాలేదు.

గౌరమ్మ తనదురభిప్రాయమును యీక్రిందిమాటలతో స్పష్టపర చింది: " సరసిని బాళప్పకు లగ్నంజేసి గణప్పకు నిషేకంచేయి. "

పిడుగుపడినపుడు దానిలో కమిలిపోయిన తీగవలె అయింది అచ్చక్కమనస్సు. నిలువడానికే చైతన్యంలేదు. పాదములుగడగడపడకినై. మెల్లగాగోడలుపట్టుకొని వంటింటినిచేరి దేవుని అరుగుదగ్గర తలచేర్చి అరాగేపడుకుంది.

" గణపతీ! పుస్తకంతీసుకో! పాఠంముగించు "

అమాయకురాలైన సరస్వతి గణపతితో అన్నది.

"ఇప్పుడే వస్తానమ్మా !" గణపతియేదో సాకుతోయింటినుంచి బయటపడ్డాడు. భోజనానికి తిరిగిరాలేదు. పండుకొనే ప్రొద్దైనా తిరిగి రాలేదు. బ్రహ్మసంధశాస్త్రి యింటికి వచ్చాడు. ఇల్లంతాస్మశానంలావుంది.

"మొదలంసరూ భోంచేయండి, తరువాతమాటలు" అంటూఅత్తను ఆదరించాడు బ్రహ్మయ్య.

ముక్కోటిదేవతలనూ కాలితో తన్నగలవారు వుండవచ్చునేమో గానీ - "అన్నబ్రహ్మ"ను తన్నగలవారులేరు.

భోజనంచేస్తూనే తానువచ్చినకారణం సూక్ష్మంగాతెలిపిందిగౌరమ్మ. రాత్రిపండుకొన్నప్పుడు బిడ్డతో యిలాసంభాషణమారంభించింది.

"మగవాడేగానీ - ఆడదేగానీ - వయస్సువచ్చిన తరువాత ఆవిషయమే వేరు చూచుకో ! ఎందుకంటావా? నీవు ... పండ్రెండుదాటుతూనే కాపురానికివచ్చావ్ ! అప్పటికీ నీమగనికికోపమే ! అవునా ? కాదా ? మగముండా కొడుకులు వయస్సులోవున్నప్పుడేదో ఒక అపకతవక చేసితీర్తారు. ఏమంటావ్. వాళప్పే వున్నాడనుకో."

అచ్చక్కకు వళ్ళంతా జోమెక్కింది. తల్లి యికముందేమి చెబుతుందో అని ఆమె దద్దరిల్లింది. గౌరమ్మ కెవరైనా మాటలు నేర్పించవలెనా? అబద్ధమూచెప్పరాదు! సత్యాన్నీ స్పష్టంగ చెప్పరాదు! మాటలన్నీ వూహకందవలె! ఎదుటివారికర్థముగావలె! ఉత్తరమివ్వడానికిన్నీ కష్టంగానూ వుండవలెను. ఈ రీతిగా పార్లమెంటుమంత్రుల సంభాషణంలా గౌరమ్మ ఒక అర్ధగంటసేపు మాటలను పెనవేసింది.

"ఆకలైనప్పుడన్నం పెట్టకుంటే యేలా ? కడుపొకటుందిగదా ! ఏమంటావ్ ! వాళప్ప అల్లాటివాడుకాడనుకో ? చిన్నప్పటినుంచే బాగా అదుపులోనేవుంచాను. అయితేమాత్రం నేనెన్నిరోజులు బ్రతుకుతాను ? రేపుచచ్చాననుకో ! మరల వరసినెవరు పలకరిస్తారు ? ఎంతజాగ్రత్తగా చూచుకున్నా ఏముందేలచ్చీ ? మొన్న వాళప్ప ... ఎంతవరకు కాచుకుంటాంచెప్పు. నీవేమైనా అను - యీమగపురుగులంటే నాకునమ్మకమే లేదు. ఏమే పడుకున్నావా ! ఏమని నీయభిప్రాయం?"

"ఏవిషయంలో నమ్మా?"

"ఇంతచెప్పినా నీకు తెలియలేదా? బాళప్ప శోభనము ఎప్పుడు చేస్తామూ అని."

"ఇపుడే యేంతొందరమ్మా! ఇంకా సరస్వతి పెద్దమనిషేకాలేదు. దేవుడా అని పదమూడేండ్లు నిండినై!"

"పదమూడేండ్లంటే యేంతక్కువ వయస్సా? ఈవయసుకు నేను కాపురానికి వచ్చి ఆరునెలలైవుండింది. నా పదునాలుగవయేట నీవు కడుపులో పడ్డావు. సరసియింకా వ్యక్తురాలు కాలేదూ?" ఆశ్చర్య సంశ యాలతో అడిగింది గౌరమ్మ.

"నేనబద్ధమెందుకు చెబుతానమ్మా! సరసి పెద్దమనిషయివుంటే నీదగ్గరమూసిపెట్టవలసిన అవసరమేముందీ?"

గౌరమ్మకు నిరాశఅయింది.

"ఇదేమి ఆశ్చర్యమమ్మా! పదమూడువెళ్ళి పదునాలుగు వచ్చినా పెద్దమనిషి కాలేదంటే ఏంమాట? లోకంలోలేని కోడలే నాకుదొరకింది. మగవాడుగా యేమన్నా మారుతుందాయేమి?"

ఇంతవరకూ గౌరమ్మ అన్నమాటలే అచ్చక్క మనసున కసహ్యా మనిపించినై! కడపటి మాట ఆమెహృదయానికి ములుకులా గుచ్చుకుంది.

గౌరమ్మకు యితరుల బాధతో యేమిపని! ఆమెనోరు కట్టెదై యుంటే యిప్పటికెన్నడో పగిలి పోయియుండేది. సంభాషణ ఇంకా సాగించింది.

"ఎవరికన్నా చూపించనన్నా చూపించు. ఎంతోమంది ఆడపిల్లలు నడివయస్సులో మగవారౌతారట !"

"ఆపుణ్యము నాకెక్కడుందీ !" అనుకొన్నది మనసులో అచ్చమ్మ.

"చూడు అచ్చీ ! నీబిడ్డ హితానికే చెబుతున్నాను, ఎంతతొందరగా వచ్చి కాపురంచేస్తే దానికంత మంచిది. వాళప్పగూడా అడ్డుత్రోవలకు అలవాటు పడకుండా ఉంటాడు లేకుంటే......మగముండా వాండ్లు ? ఏమిచెప్పేది ? కాకుంటే యింత నూగులపిండైనా తినిపించరాదా ? అదెందుకుకాదో చూస్తాను. ఏమంటావు?"

"అలాగేకానీమ్మా" ఈమాట అన్న కారణాన గౌరమ్మ అచ్చక్క పైన దయతలచి మాటలు చాలించింది. అచ్చక్కకు పండుకోవడానికి సాధ్యమైంది.

౧౬

గౌరమ్మ వచ్చినపని అయింది. కోమలమైన బిడ్డహృదయాన్ని గురిచూచి గౌరమ్మ గాడిదవలె కాలుఝాడించింది ఊరికి కాలుకదిపింది. కన్నతల్లి యింతకంటె యేం వుపకారం చేయవలె?

ఈసారి అచ్చుక్క యేడ్వలేదు. ఆమెదుఃఖం యేప్పుహద్దులను మించిపోయింది. మనస్సునకు నూత్నపక్వతను యిచ్చింది. రాబోయే అఘాతాలకు క్రుంగిపోకుండా సహించి నిలిచే ఓర్పునుగూడా దుఃఖమే ఆమెకు ఉపదేశించింది. ఏవిషయాన్నిగూడా మనస్సుకు పట్టించుకొనని అనాసక్తికి అలవాటవుతూవుంది.

అయినా అప్పుడప్పుడే మాతృదేవి వుపదేశించిపోయిన మాటలను జ్ఞప్తికి తెచ్చుకోవడానికిగూడా ఆమెకు అసహ్యంగావుంది.

తెల్లవారినా గణపతి రాలేదు. అచ్చుక్కకొక్కటేచింత : జరిగిన సమాచారాన్ని రాత్రే మగనికి సూక్ష్మంగా చెప్పింది. గౌరమ్మ వూరికి ప్రయాణమౌతూనే అచ్చుక్క బ్రహ్మానందశాస్త్రితో యిలాఅంది:

"మొదలు మీరుపోయి గణపతిని వెదుకుకొనిరాండి. నాకేమో చాల భయంగావుంది. చిన్నపిల్లవాడు అవమానమైనది అనే ఆవేశంతో యేమైనా చేసుకుంటే? - మొదలు మీరు బయలుదేరండి - నేనీనాడు

గణపతిముఖం చూచేవరకు స్నానంగూడా చేయను. వంటకూడా చేయను."
కన్నీరు తుడుచుకుంటూ అచ్చక్క వంటయింటిలో అడ్డంగా పడుకుంది.

"గణపతి నెక్కడికి పంపినావప్పా! నిన్నకూడా నాకు పాఠం కాలేదు. రాత్రి గణపతి భోజనానికన్నా రాలేదు."

సరస్వతిముఖం చిన్న పుచ్చుకొని తల్లిపైపు చూస్తూఅన్నది: "ఇదిగో వస్తానమ్మా!" బ్రహ్మయ్య పైవస్త్రంగూడాలేకుండా ప్రయాణమయినాడు.

ఇంటినుండేమో బయలుదేరాడు. గణపతి నెక్కడవెదకడం? ఆయనకేమీ తోచలేదు. అక్కడక్కడ చుట్టి నగరేశ్వర దేవళానికి వచ్చాడు. ఇక్కడేమైనా వుంటాడేమోఅని యోచించుకుంటూ మహా ద్వారంలోకి అడుగుపెట్టాడు. అప్పటికే మధ్యాహ్నం పన్నెండుగంటలు! శాస్త్రి ప్రదక్షిణ నమస్కారాలు ముగించి చేతులు జోడించి నగరేశ్వరుని ముందు నిలుచున్నాడు ఎంతసేపు నిల్చున్నాడో ఆయనకేతెలీదు.

ఎదుటనిలచి గణపతి అథర్వణవేదం జెపుతున్నాడు. శాస్త్రి చటుకున కన్నులు దెరిచాడు. గణపతిలేడు. అదిభ్రమ. శాస్త్రిమనస్సు విస్మయ చకితమైంది. ఆవేశ పరవశుడైనాడు. కండ్లనిండానీరు. రుద్ధకంఠంతో అరచాడు శాస్త్రి!

"నాగణపతి నెక్కడ దాచావప్పా?" శాస్త్రి కంఠధ్వనికి గోడలూ కంబాలూ - మంటపాలూ - అదరిపడ్డాయి.

గర్భగుడిలోని నగరేశ్వరుడు కదలలేదు. మెదలలేదు. అలాగే నిల్చున్నాడు.

శాస్త్రిమనస్సులో పట్టరానంతవేదన. దానిఫలంగా హృదయాన్ని రోషమాక్రమించింది. గట్టిగా అరవడాని కుపక్రమించాడు. నగరేశ్వరుణ్ణి మనస్సులోనే నిందించాడు,

"వంచకా! భక్తద్రోహీ! స్మశానంలో వుండవలసిన నిన్నుపూళ్ళోకి దెచ్చి పూజ సేయడానికారంభిస్తే - యిదికాక నీఉపకారమేముంటుంది? నీమూడవ కంటికిగూడా నేను భయపడను. కావలసివస్తే నన్నుగూడా దహించివేయి! కానీ - నాకొడుకువంటి గణపతిని మాత్రం నీకివ్వను. భీష్మాచార్యులవంటిదీక్షితులను నీపొట్టనపెట్టుకొంటివి. ఇంకనూ నీయాకలి తీరలేదా? గణపతినిగూడాతినడానికి బూనుకొన్నావా? నాగణపతినినాకివ్వు! గణ......" మూర్ఛిల్లి నేలబడ్డాడుశాస్త్రి!

పూజచేయడానికి పూలు తీసికొనివస్తున్న అర్చకులు మూర్ఛపడి వున్న బ్రహ్మయ్యనుజూచి గాబరాపడ్డారు. ఆయన కట్టినపంచ అస్తవ్యస్తమైనది. మోకాళ్ళపైన చిన్నగాయాలు! వానినుండి రక్తము గారుతోంది. నుదుటిపై దెబ్బతగిలింది.

కొంచెము నీరుదెచ్చి అర్చకులు మెల్లమెల్లగా శాస్త్రిగారి ముఖమును తడిపారు.

" శాస్త్రిగారూ! శాస్త్రిగారూ!" అర్చకులు గట్టిగా అరిచారు.

బ్రహ్మయ్యకు హెచ్చరిక గలిగింది. ఆయనకండ్లుదెరచి చుట్టూ చూచాడు. అర్చకుల నాపాదమస్తకంవిలోకించాడు.

"ఏమీ! నేనెక్కడున్నాను! నన్నీలోకానికి మళ్ళీ ఎందుకు తెచ్చారు? ఆభగవంతుని పాదాల దగ్గర సుఖిస్తూవుండిన నన్ను మళ్ళీ యీ ప్రపంచానికి..."

అర్చకులు బ్రహ్మయ్యను చుట్టుకొన్నారు. చేతులుపట్టుకొని ఆయన్ను లేవనెత్తారు.

"నన్నెందుకు తాకుతారు! నేనుమైల."

అచ్చుకులన్నారు: " మీరు నిత్యపవిత్రులు. మిమ్ములను తాకిన వారికిగూడా మానసిక చాపల్యాలు తొలగిపోతవి. లేవండి! ఇక్కడికెప్పుడు వచ్చారు? వయస్సు వచ్చినతరువాత యిలాగ ఒకరే..."

అచ్చుకులు బ్రహ్మయ్యను యింటివరకూ తీసికొనివచ్చారు. మగణ్ణి చూచినవెంటనే అచ్చక్క గుండె చెరువైనది. పరుగెత్తుకొనివచ్చి నట్టింటిలో చాపపరిచింది. బ్రహ్మానందశాస్త్రిని పట్టుకొని తీసుకొచ్చి పరుండబెట్టింది. సరస్వతి తలక్రింద దిండుతెచ్చివేసింది.

కాలికీ నొసటికీ దెబ్బతగిలింది. అచ్చుకులు అచ్చమ్మకు వివరించి చెప్పారు:

"తలకూ కాళ్ళకూ తగిలిన దెబ్బలంత గొప్పవిగావు. బ్రహ్మానందశాస్త్రి హృదయానికి దెబ్బతగిలింది. ఆదెబ్బ అన్నిటికంటే బలమైనది. అదిమాయని గాయం. తీసివేయరాని నొప్పి!"

"గణపతి యెక్కడా కనుపించలేదేమప్పా!"

ఆప్రశ్నకు వచ్చే జవాబు తనకేతెలుసు. అయినా ప్రశ్నించింది అచ్చక్క. అచ్చుకులన్నారు:

"మీయింటిలోనే వున్నారుగదమ్మా గణపతిదీక్షితులు! పోయిన సోమవారం దేవదర్శనానికి వచ్చారు..."

"ఆ దేవుడు చేసినపనే యిది. వంచకుడు. నగరేశ్వరుడు భక్తద్రోహి!"- బ్రహ్మయ్య అన్నాడు.

పరుగెత్తుకొనివచ్చి అచ్చక్క పతిదేవుని నోరుమూసింది. ఆమె కన్నీరు బ్రహ్మయ్య నుదుటిపై ధారగట్టింది.

"దేవా! ఏనోటితో యేంమాటలనిపిస్తున్నావ్! మీరిలాఅనరాదు. నగరేశ్వరస్వామి యిచ్ఛమేరకే సాగనీ! గణపతి యెక్కడికీ పోలేదు. వస్తాడు. వేదములూ - శాస్త్రములూ - పురాణములూ - వాక్యములూ - ఆగమములూ - ఆరుణోపనిషత్తు - అన్నీ పఠించిన బ్రహ్మయ్యశాస్త్రి ముఖం నుండే భగవంతుని నిందా!" అచ్చమ్మ మనసు నీరుచిలికిన సున్నంవలె కుతకుతలాడింది.

"కొంచెం యేమైనా పుచ్చుకోండి. మధ్యాహ్నం మారింది. ఆహారం లేకుంటే కష్టంకాదా?"

అచ్చమ్మ అంగలార్చింది. ఆగ్రహించింది. కాని శాస్త్రిముఖం శిలాప్రతిమలావుంది. ఇంతవరకూ ఆయన అన్నిభావాలనూ మనస్సులోనే మధించుకొన్నాడు. అనంతమైన అగ్నిప్రవాహాలనూ లోపల వుంచుకొని పైకి ప్రశాంతంగా కనపడే భూమాతవలె! ఇంతవరకూ శాస్త్రి మనస్సులో నడిచిన తుములవిప్లవాలు ఆ నగరేశ్వరునికి ఒక్కనికే దెలుసు! అపుడపుడూ భావభారం ఆయనకు ఎక్కువయ్యేది. అపుడొక నిట్టూర్పుతో ఆ భావాన్ని లోపలికి నూకివేసి నవ్వుతూ వెళ్ళిపోయేవాడు. ఇకనాతనికి సాధ్యంగాలేదు. భావోద్రేకం ఆయనశక్తినిమీరింది.

"సరస్వతీ" తీక్షణమైన స్వరంతో అన్నాడు.

"ఇక్కడే వున్నానప్పా!" చెక్కిళ్ళపై జారుతున్న కన్నీరు తుడుచుకుంటూ బిడ్డఅన్నది.

"గణపతి తప్పకవస్తాడు. ఎక్కడికోవెళ్ళాడు. వచ్చితీరుతాడు."

"లేదుసరస్వతీ! ఇక గణపతి యిక్కడకురాడు- నేనే అక్కడికి పోతాను."





"మీరిలా అనరాదు. గణపతిస్వభావం మీకుతెలీదా? అతడు తుచ్ఛమైనపని యెప్పుడూచేయడు. గణపతి బ్రతికివున్నాడు! నాకుతెలుసు." అచ్చక్క అన్నది.

శాస్త్రికన్నులలో ఆశ పులకరించింది.

"నిజము - నిజము - నీవేనిజమైన సతివి - సమయోచితంగా పలికినావు. సత్యముపలికినావు. గణపతి యెన్నడూ హీనకార్యం చేయడు. ఆత్మహత్యవంటి ఆత్మపతనానికి వాడెప్పుడూ పూనుకోడు! ఎందుకో చెప్పు ...చెప్పు..."

"అది శంకరదీక్షితుల పిండం!"

ఈమాటతో క్రొత్తచైతన్యమే ఆయింటిలో నిండింది. శాస్త్రిశరీరమంతా విద్యుత్సంచారమైనట్లుంది. లేచికూర్చున్నాడాయన.

"ఏమప్పాలేచావు! స్నానపుగదికి వెళతావా?"

సరస్వతి చేయిపట్టుకుంది. అప్పటికే శాస్త్రిదృష్టి మారిపోయింది. కన్నులలో అదేదో కొత్తకాంతి. అచ్చక్కగోడ కానుకొని కూర్చున్నది. ఆమె ఒకబొమ్మలా అయింది. తన పరదైవమనీ - సుమారు మూడు దశాబ్దాలనుండి పూజిస్తూ వచ్చిన తనఆరాధనా దేవత అనుభవిస్తూవుండే బాధనుజూచి అచ్చక్కమనస్సు రాయిగామారింది. ఆమె మంచినీరు త్రాగలేదు. వంటింటిదిక్కు తిరిగి చూడనూలేదు.

సాక్షాత్తు అన్నపూర్ణ స్వరూపిణియైన అచ్చమ్మయింటిలో మూడు రోజులనుంచి పిల్లినిద్రపోతూంది. శాస్త్రి ఒకగుటక పాలుత్రాగటానికీ నిరా

కరించాడు. మంచినీళ్ళుగూడా వద్దన్నాడు. సరస్వతికి ఆనాడే చల్లారి పోయింది. ఎప్పుడూ తండ్రిపక్క కూర్చొని వుండడమే ఆమెకుహాయి.

ఊరివారంతా వచ్చారు. చేతులు ముకుళించి యిలావేడుకున్నారు:

"మీరు ఋషులు, జ్ఞానులూ. హోమ యజ్ఞాదులుచేసి దేవతలంద రికీ ఆనందాన్నీ తృప్తినీ గలిగించిన గొప్పవంశముమీది. మేము మీ కింక రులము. మమ్ము క్షమించి కొంచెం అన్నం స్వీకరించాలి."

ఊరిపెద్ద - అనంత పద్మనాభాచార్యులు దీర్ఘదండ నమస్కారం పెట్టిఅనుకంపతో గౌరవంతో యిలాప్రార్థించాడు. "ఓ బ్రహ్మానందశాస్త్రు లుగారూ ! మీరు మహానుభావులు. మీనుంచి లోకకల్యాణం యెంతో జరుగవలె ! తమరిలా హఠంపట్టితే బావుంటుందా ! దయచేసి లేచి స్నానంచేయండి ! అగ్నినారాయణున కన్నంపేయండి. నాఒక్కని యిచ్ఛ మాత్రమేగాదు. ఊరందరూ చేసేప్రార్థన ! ఊరిలోని అన్నిజాతులూ - తమదర్శనానికి గాను బయట వచ్చి నిల్చున్నారు. మీదయ !"

పద్మనాభాచార్యుడు గొప్ప నిష్టావంతుడు. మధ్వమతాభిమాని ! గొప్పపండితుడు.ఆయనగూడా బ్రహ్మానందశాస్త్రికి నమస్కారంజేశాడు. ఈదృశ్యాన్ని జూచి వూరివారంతా పులకరించారు.

శాస్త్రిగారు కంటిసంజ్ఞతో పద్మనాభాచార్యులను దగ్గరికి పిలిచి వారి పాదములను చేతితోతాకి కండ్లకు అంటించుకున్నాడు !

"మీదర్శనము సకాలానికే అయింది."

బ్రహ్మానందశాస్త్రి బహుప్రయాసతో మాట్లాడుతున్నాడు:

"జగదీశ్వరుని ఆజ్ఞఅయింది. నాఅన్నా!ఇంక యీలోకానలేము - అక్కడ పైనవుంది. నాపై కోపగించకండి. మీ ఆజ్ఞనుమీరే శక్తిలేదు నాకు. సెలవు..."

కడుపున పుట్టినకొడుకు చచ్చినప్పుడుగూడా అనంత పద్మనాభాచార్యులు కంటితడి పెట్టలేదు. కొడుకుపెండ్లిచేసిన కర్తవ్యబుద్ధితోనే వాని దహనకృత్యంగూడా చేసినాడాయన! రాయిపలె - నిర్వికారుడై - వాని అంత్యక్రియలుగూడా చేసినట్టి మహాత్ముడతడు. అట్టివాని మనస్సుగూడా నేడు మంచుపలె కరిగిపోయింది. కండ్లనిండా నీరుపెట్టుకున్నాడు. బ్రహ్మానందుల కుడిచేతిని తనతలపై నుంచికొని చిన్నపిల్లవానివలె యేడ్చాడు.

"ఎందుకీఏడ్పు?" శాస్త్రి చేతిసైగతోనే అడిగాడు.

"శాస్త్రీ! యీయేడ్పు నీకోసంగాదు! నీ ఆప్తులకోసంగాదు.నిన్ను పోగొట్టుకుంటున్న యీభూలోకంయొక్క దురదృష్టానికి యేడుస్తున్నాను.

శాస్త్రి పద్మనాభాచార్యులను దగ్గరికి పిలచి ఆయనచెవిలో క్షీణస్వరంతో అన్నాడు:

"బహురత్నావసుంధరా!"

ఇద్దరి ముఖాలపైనా ఒకనవ్వువంటి క్రొత్తకాంతి ఆక్రమించుకుంది.

ఆచార్యులు లేచి బిరబిర గడ్డకువచ్చాడు. తలవాకిలిదాటేటప్పుడు తనలోతానే అనుకున్నాడు: "హరి సర్వోత్తముడు. వాయువు జీవితోత్తముడు. శ్రీహరీ నీమాయ..."

అపరిచితులూ - పరిచితులూ - రైతులూ - ధనికులూ - వైశ్యులూ - బీదలూ - అందరూ చూచిపోతున్నారు. చుట్టుపట్టులనున్న వూర్ల నుండిగూడా జనంవచ్చారు. చేతిలో శిశువుల నెత్తికొని వచ్చారుస్త్రీలు ! ఆనాడందరి పెదవులపైనా బ్రహ్మయ్యపేరే !

మార్గశీర్షమాసం. శుక్లపక్షం. నాడు వైకుంఠయేకాదశి. మధ్యాహ్నం సూర్యుడు సరిగ్గా నడినెత్తిపైకి వచ్చాడు. శాస్త్రిసంకట మన్నాడు. అలాయిలా పొర్లుతున్నాడు. ముప్పది ఏండ్లనుండి సేవలు చెల్లించిన దేహాన్ని విడవడం జీవునికంత సులభమా !

"ఏమికావాలి?" సరస్వతి అడిగింది ప్రక్కనకూర్చొని.

పెద్దకుంకుమ ధరించి అచ్చక్క కుడివైపు కూర్చుంది.

"ఏమికావాలి ! తినటానికేమైనా?" అచ్చక్క అడిగింది.

బ్రహ్మానందశాస్త్రికి సంపూర్తిగా స్మృతివచ్చింది. నుదుటిని జూపించి విభూతిగావలెనని సైగజేశాడు. సరస్వతి పరుగెత్తిపోయి తెచ్చి యిచ్చింది. బ్రహ్మానందశాస్త్రి విభూతిరేఖలను స్వయంగాఫాలతలంపై ధరించుకొన్నాడు. సరస్వతికి సైగజేశాడు. శంకరప్రణీతమైన ఆనంద లహరిని చేతులుజోడించి గానంచేస్తూ కన్నులు మూసికొన్నది సరస్వతి!

"నాగతియేమి ! నాకేమిచెప్తారు?"

సామాన్యస్త్రీలవలె ఆర్భటించి అరవలేదు అచ్చక్క. ధ్యానమగ్ను రాలై పతిదేవుని ప్రక్కన కూర్చొన్నది.

సాక్షాత్తు ఆదిశంకరులే సరస్వతి ముఖకమల మందునిల్చి పాడి నట్లున్నదాదృశ్యం ! శ్రీవిద్యామూలతత్వమును వివరించిన ఆ స్తోత్రమూ కవి సహజమైన ఆశైలీ - భాషామాధుర్యమూ - తత్వార్థగుంభనమూ - ఓహో ! బ్రహ్మానందులమనస్సు ఆనందంతో తొణికిసలాడింది. ఆ సన్ని వేశంలో భాగాన్ని గ్రహించడానికి దేవలోకమే అక్కడకిదిగి వచ్చింది.

"శృతిస్మృతిపురాణానాం ఆలయం కరుణాలయం
నమామి భగవత్పాదశంకరమ్ లోకశంకరమ్"

ప్రారంభంమాత్రమే సరస్వతి జేస్తుంది. ఇంకేమహాశక్తియో చివ రకు ముగిస్తుంది. కేవల నిమిత్తమాత్రంగా సరస్వతి అక్కడకూర్చొంది. ఆమె దివ్యవాణి గాలిలో గర్జిస్తూవుంది. నభోమండలాన్నే ఆక్రమించు కుంటూంది.

శివశ్శక్త్యాయుక్తో యదిభవతిశక్తః ప్రభవితుం
నచేదేవం దేవోనఖలు కుశలః స్పందితుమపి
అతస్త్వా మారాధ్యామ్ హరిహర విరించ్యాధిభిరపి
ప్రణంతుం స్తోతుంవా కథమకృతపుణ్యః ప్రభవతి ॥

సరస్వతివాణి నిరర్గళమైన ధారతో గంగాతరంగములవలె బ్రహ్మా నందుల ఆత్మను శబ్దబ్రహ్మంలో లీనంజేస్తూవుంది. ఆమెచేతులు జోడించి పాడింది.

శ్లో॥ క్వణత్కాంచీదామా కరికలభకుంభస్తనభరా
పరిక్షీణామధ్యే పరిణత శరచ్చంద్రవదనా

ధనుర్బాణాన్ పాశం సృణి మపిదధానాకరతలైః
పురస్తాదాస్తాంనః పురమథితురాహో పురుషి కా॥

"జై శివే" అన్నాడుశాస్త్రి।

బ్రహ్మానందులు అనిత్యమైన దేహాన్ని త్యజించారు. శిరస్సునుండి ప్రాణవాయువులు పైకెగిరిపోయినై. బ్రహ్మానందశాస్త్రి యొక్క ఆత్మ బ్రహ్మాండమంతయూ వ్యాపించి బ్రహ్మానందాన్ని అనుభవిస్తూవుంది. నాటినుండీ ఆయిల్లు 'బ్రహ్మానందమఠ' మైనది. శాస్త్రి అమరుడైనాడు. దేహాతీతమైన అతనిఆత్మ పరమానందంలో లీనమైపోయింది.

## ౧౭

" తీర్థస్వరూపులైన వారి పాదారవిందములకు—

చిరంజీవియైన గణపతియొక్క అనంతానంద ప్రణామములు. మీయొక్కయు, సాక్షాత్తు మాతృశ్రీయైన కుం॥ సౌ॥ అచ్చమ్మగారి ఆశీర్వాదం వల్లనూ నేను సుఖంగావున్నాను. తమకృపతో దేహమూ మనస్సూ ఆరోగ్యంగా వున్నాయి.

మీఆజ్ఞ తీసికోకుండానే నేను వచ్చినదానికి నాకు మనస్సులో చాల దుఃఖం కలిగింది. నాఅపరాధాన్ని తమరిద్దరూ మన్నింపవలెను. ఇన్నిదినములు తమరు నన్ను కడుపున పుట్టిన కుమారునికంటె ఎక్కువ ప్రేమతో సాకి సంతరించితిరి. మీ వుపకారాన్ని నేను ప్రతిదినమూ స్మరించుకుంటాను. మాతృ శ్రీ అచ్చమ్మగారి ఋణాన్ని నేనీ జన్మలో తీర్చుకోలేను. నిర్గతికుడనై నిరాశ్రితుడనైన నాకు ఆశ్రయాన్ని యిచ్చి పితృవియోగ దుఃఖాన్ని మరచిపోయేటట్లు చేశారు. చిన్నతనంలోనే మరణించి కేవలం నాస్మృతిపథంలో మాత్రమే నిలచివున్న నాతల్లియొక్క స్థానాన్ని కుం॥ సౌ॥ అచ్చమ్మగారాక్రమించుకున్నారు. వారు నాజీవితంలో ఒకనూతన తేజాన్ని నెలకొల్పారు. బంధుబలగములూ - తమ్ముడూ -

అక్కాచెల్లెలూ - ఎవ్వరులేక - స్త్రీసంపద సున్న నాజీవితానికి చెల్లెలుగా చిక్కిన సరస్వతి ఒకక్రొత్త వెలుగును ప్రసాదించింది.

ఇంతవరకూ యింతవయసుతో మీ ఆశ్రయ సౌభాగ్యాన్ని నాకుకలిగించిన దయామయుడైన భగవంతుడు మొన్న నన్ను మీ యింటి నుంచి వెడలగొట్టినాడు. అది వానియిచ్ఛ. వేరొకరి జీవనమునకు కంటకముగా, సుగమంగా సాగేవారి బ్రతుకుకడ్డంకిగా, యితరుల మనస్సులకు హింసకుడుగా నేను బ్రతికినచో, స్వర్గలోకంలో వున్న పితృదేవతలకు దుఃఖంకలిగి తీరుతుంది. నాచెల్లెలు సరస్వతి రెండువంశముల కీర్తినీ నిలుపవలెను. స్త్రీజాతికి ఆదర్శప్రాయంగా బ్రతుకవలె! నిష్కళంకమైన ఆమెకీర్తి శాశ్వతంగా నిలువవలె! ఉత్కృటమైన యీ యిచ్ఛ చేతనే నేను గృహ హీనుడనై, దేశభ్రష్టుడనై, యింటినుంచి బయటపడితిని. కుం॥ సౌ॥ గౌరమ్మగారిపై గూడ నాకెట్టి అసంతృప్తిలేదు. ఆమెది వ్యావహారికదృష్టి! సరస్వతికి అన్న అనిపించుకునే భాగ్యం నాకీజన్మలో వుంటే, నాకు అచ్చమ్మగారి కడుపుననే భగవంతుడు జన్మను ప్రసాదించి వుండేవాడు. ఆ అదృష్టం నాకులేదు. లేనిది వుందనుకుంటే వస్తుందా? లేనిది వుందనుకొన్నదానికి లోకంవేసే శిక్ష యిదే! గృహ నిష్కాసనము.

దీర్ఘమైన నాలేఖతో, మీకు తొందరగలిగించే భావము నాకులేదు.

నాయీ దేహంలో పూజ్యులైన శంకరదీక్షితులగారి రక్తం ప్రవహిస్తూవుంది. అల్పమానవులవంటి తుచ్ఛవిచారాలు, నాహృదయంలో ప్రవేశింపలేవు. అందరి శ్రేయోభివృద్ధికి తగిన మార్గమని తోచినపద్ధతినే అనుసరించాను. ఇకమీదగూడా అనుసరిస్తాను. దయచేసి నాకొరకు

పోషించడంగాని. నన్ను మళ్లా యింటికి తీసికొని పోయేప్రయత్నం గాని చేయవలదని మిమ్మల్ని సవినయంగా ప్రార్థిస్తున్నాను. నాయీ ఒక్క ప్రార్థననూ తమరు దయతో మన్నింపవలెను. మాతృశ్రీ కుం॥ సౌ॥ అచ్చమ్మగారికి నానమస్కారములను యిక్కడనుంచే అర్పిస్తున్నాను. చి॥ చెల్లెలు సరస్వతికి నా ఆశీర్వాదములు. ఆమెశ్రేయస్సునే యెప్పుడు గోరుతాను.’’

బ్రహ్మానందశాస్త్రి వైకుంఠ గమనమొనర్చిన మరుదినమే గణపతి వ్రాసిన వుత్తరం వచ్చింది. వాకిట నిలచిన వారెవరో దానిని తీసికొని చించి చదివినారు. సరస్వతి వెక్కివెక్కి యేడ్చింది. అచ్చమ్మ గోడ మరుగున నిల్చుంది.

గౌరమ్మ బంగారువంటి మాటతో ఆసందర్భాన్ని ముగించింది.

“పిచ్చిముండాకొడుకు! మదపిచ్చి ముండాకొడుకు! బుద్ధంతా ఖర్చుపెట్టి కాగితం వ్రాసినాడు - చచ్చిన బ్రహ్మయ్యకు! వాణ్ణిపోయి బ్రహ్మయ్య కిచ్చిరమ్మనండి ఆకాగితాన్ని. కూటికిచచ్చిన ముండాకొడుకులు! ఇంకేమనుకున్నావు? ఎల్లైనా ఒకసారి యింట్లో సామాన్లన్నీ జాగ్రత్తగ చూసికోవే అచ్చీ! వెండిసామానూ గీమానేమైనా కొట్టేసుక పోయాడేమో! ఆముండావాడు. పోలీసులతో చెప్పి వాని చర్మం వొలిపిస్తాను.”

ఈమాటలతో అచ్చక్కకు కలిగిన దుఃఖంకంటె వైధవ్యమేమీ గొప్పదిగాదు.

గణపతి వ్రాసిన జాబుజూచి వూరికివూరే పశ్చాత్తాపపడింది. కానీ గణపతి యేమనుకొన్నాడు? ఈ విషయ మూహించడమే అసాధ్యంగా

వుంది. ఆజాబులో వూహించడానికి యేగుర్తులేదు. ఉండకూడదనే వాడు రైలుకు తెచ్చివేశాడు.

"ఏవూరికి పోయివుంటాడు?" గుంపుచేరిన వారనుకున్నారు.

"ఎక్కడకి పోయివుంటాడు వానిపాడెలోకి! కాశీ రామేశ్వరం దిక్కు పోయివుంటాడు." గౌరమ్మ తనబుద్ధినంతా ఖర్చుపెట్టి అత్యుత్త మమైన సలహా ననుగ్రహించింది-

"పంద్రెండణాలు పోతేపోయింది. అదృష్టవశాత్తూ అక్కడే వుండేవస్తాడు."

ఎవరో ఒకరు ముందుపడి కాశీవిద్యాపీఠానికి తంతి ఇచ్చారు. బ్రహ్మానందుల ఆత్మకైనా శాంతిగానీ గణపతియేవచ్చి వుత్తరక్రియలు చేయనీ—

గణపతిని బ్రహ్మానందశాస్త్రికి కుమారుడుగా ఒప్పుకున్న లోకమే గణపతికి సరస్వతి చెల్లెలని అంగీకరింపదు. ఈ విచిత్రమైన చిత్తవృత్తి యేమిటో!

మూడుదినాలుగా గణపతి కాశీలోలేడు. గ్రామాంతరం వెళ్లాడు. నాలుగోదినంవచ్చి "టెలిగ్రాం" చూచుకున్నాడు. ఏకధారగా యేడ్చాడు. శంకరదీక్షితులు చనిపోయిన గాథను గణపతి యింకా మరువనేలేదు. ఇంతలో యిది పైతాపు. అయినా గణపతి మంచిమనోదార్ఢ్యం గలవాడు.

"నానుండి బ్రహ్మహత్యజరిగింది. నేను మహాపాపిని! నాకింక ప్రాయశ్చిత్తంలేదు. పునర్జన్మమూ లేదు. ఎప్పుడూ రౌరవ నరకంలోపడి వుండవలసిందే!

కంఫ్లు వాచేవరకూ గణపతి మేతుస్తూ కూచున్నాడు. గంగలో మునిగి అర్ఘ్యప్రదానంచాకా సంధ్యావందనం జేసి ! కాశీవిశ్వనాథుని దగ్గరకు వచ్చి, చేతులుజోడించి నమస్కరించి మరలాడు.

అన్నమూ, నీరూ, నిద్రా యేవీలేవు. స్నానములేదు. క్షౌరమూ లేదు. నాలుగు దినాలకు, గణపతిఅచ్చమ్మ యింటిముందువచ్చి నిలచాడు. వానిబట్టలూ అధ్వాన్నమై వున్నాయి. ముఖంవాడింది. పిచ్చివానివలెనో, భిక్షుకునివలెనో వున్నాడు.

ఇంటినిండా జనము. గౌరమ్మ కంఠధ్వని తలవాకిటిలోనే వినిపించింది. బాళప్ప. భాస్కరభట్టు వున్నారు. వారి పరిచయం గణపతికిలేదు.

"తానుతిని, ఆడి, దేహబుద్ధుల నభివృద్ధి నొందించుకొని మనుష్యుడైన దీయింటిలోనే ! తాను పరదేశియైనా గతియేమి?" అని ప్రార్థించడానికి ముందే, తనకు స్వాగతమిచ్చి పితృవియోగము, దుఃఖమును మరపించు నంతటి ఆశ్రయమిచ్చినదీ గృహమే ! బ్రహ్మానందశాస్త్రిల యిల్లిది. వారి యధ్యాత్మ పుత్రుడైన తన గేహమిది. ఈ విచారములతోనే గణపతి, దడదడ నట్టింటి వాకిలి వరకూ వచ్చాడు.

బాళప్ప భోజనానికి కూచున్నాడు. వాని అన్నరాశి వాని కడుపెత్తు.

"ఎవడురావాడు ! వాడు లోపలికొస్తాడు ! బ్రాహ్మలు భోజనం చేస్తుండేది కనపడలేదూ? శూద్రముండాకొడకా ! భిక్షానికి వచ్చినవాడివి, బయట నిలుచోవారిగాని, యింట్లోకిఐస్తావా?"

నోట్లో పెట్టుకున్న ముద్ద నోట్లో వుంచుకునే, మాట్లాడుతున్నాడు బాళప్ప ! వానికండ్లెర్రనైనాయి ! అన్నపుమెతుకులు, అటూయిటూ చిందుతున్నాయి !

బాళప్ప పంక్తిబ్రాహ్మణుడా. "గణపతిని నీవు శూద్రుడ"వని తిట్టిన పుడు, చూచిన దేవతలు గొల్లుమని నవ్వేలోని వుంటారు. ఏనుగు బల శాలియే కావచ్చు! కాని కుక్కకు స్థానబలమున్నదిగదా ! బాళప్పకు వదరే హక్కులేదూ?

ఈయింటిలో గణపతికి 'నీవెవ్వడు' అను ప్రశ్నయే! ఆ! ఒక వ్యక్తి పోయినదానివల్ల!—నిజమే. అస్తమించునది సూర్యుడొక్కడే; కాని అస్తమయమే జగత్తునకంతయు చీకటి!

వాకిలివైపుకు వెన్నుచూపి భోజనానికి కూర్చున్న సరస్వతి వెను దిరిగి చూచింది.

"గణపతీ!" పిలుచుకుంటూ ఆమె యెంగిలిచేత్తోనే లేచి వచ్చింది. మూలలో పడుకున్న అచ్చమ్మగూడా లేచివచ్చింది. తిలకహీనమైన ఆమె ముఖాన్ని చూస్తూనే గణపతి ప్రాణాలు అదిరిపోయినై. మాటలాడుట కిద్దరూ ఒకటేసారి ప్రయత్నించారు.

కాని యిద్దరి నాల్కలాడలేదు. హృదయాలు మాట్లాడుకొనే భాష ముందు. కండ్లు తెలిపే భావాలముందు, నాల్కయెందుకు పనికివస్తుంది.

సరస్వతి గణపతినిగట్టిగా కౌగలించుకుంది. వానియెదపై తలపెట్టి యేడుస్తూంది. అపసరపసరంగా భోజనాన్ని ముగించి బయటికి వచ్చిన బాళప్ప యీదృశ్యాన్ని చూచాడు.

"అయ్యయ్యో! మగవాళ్ళను ముడుతావుగదనే! ఈతట్టురావే సరసీ! మగవాళ్ళను ముట్టరాదు. నాయెదపై తలపెట్టి యేడుస్తువురావే! వాడు మగవాడు గాదేమో?"

ఒకచేరీతిగా కిష్టుసన్నాసు డాళప్ప కొంప కాలిపోయినట్లు! ఏమి మించిపోయిందోనని గాబరాగా బయటికి వచ్చింది గౌరమ్మ! ఇంకే ముంది? ఏదికాకూడదో అదేఅయింది! వినకండ్లముందే, డాళప్ప ఎదురుగానే, గౌరమ్మ తిట్టడానికి నోరుతెరచింది. సూక్ష్మగ్రాహియైన భాస్కరిభట్టు, పరుసని వుండే ఆదృశ్యాన్నంతా చూచాడు. ఒక్కమాట తోనే తల్లికొడుకులిద్దర్నీ గదిమి లోపలకంపి ఉపకారం చేశాడాయన!

గణపతి నగరేశ్వరుని గుళ్ళో పూజారి! ఆగుడి విడచిరాడు. అధ్యాత్మ జనకుడైన బ్రహ్మానందశాస్త్రిగారి ఉత్తరక్రియలు సక్రమంగా చేయడం, ఎవరైనా భోజనానికి పిలిస్తే వారియింటికి పోయి, ఒకముద్ద తినడం, నగరేశ్వరస్వామితో వుండడం! ఇంతే ఆయనపని!

సరస్వతీ ఒకటిరెండుసార్లు అన్నతో మాట్లాడడానికి గుడికి వచ్చింది. ఆయన ఒకటో, అరో మాట్లాడి ఆమెను పంపేవాడు! మూడవసారి ఆమె వచ్చినపుడు ముఖంముడుచుకొని యిలాఅన్నాడు.

“సరస్వతీ! నీతోమాట్లాడడానికి నాకు తీరికలేదమ్మా! నీవిలా యిక్కడికిరారాదు.”

కొంచెం బిరుసుగానే చెప్పాడు గణపతి!

సరస్వతి జీవితంలో కాఠిన్యానికి యిదే తొలి అనుభవం! తన్ను మరచిపోయే వరకు సరస్వతికి సుఖముండదని గణపతి బాగాయెరుగును. కాని డాళప్ప భార్యయైన సరస్వతికి సుఖంలేదని గణపతి యెరుగడు.

గణపతి చూపిన యీగడుసుతనంతో సరస్వతి మనస్సునకు కలుగవలసినంత బాధ కలిగింది. కాని గణపతి అపేక్షించిన ఫలమేమో

కలుగలేదు. అతనిపై సరస్వతికి కోపము రాలేదు. పైపెచ్చు యింకా ప్రేమాతిశయమే గలిగింది.

"గణపతీ! నీవు కోపపడవద్దు! తండ్రిపోయిన వెనుక నాకింక దిక్కెవ్వరు? అన్నవైననీవు దూరంచేస్తే... "

గణపతి మనసులో చేయివెట్టి కలచినట్లైంది. నిర్ణయమూ, నిష్ఠురతా, అన్నీ మాయమయినాయి! ఆతడు మెల్లగావచ్చి ముద్దుచెల్లెలి ముంగురులను తడవినాడు. సరస్వతి కండ్లనిండా నిండుకొన్న నీటితో అన్నది:

"గణపతీ! నామొగుణ్ని చూచావా?"

"చూచాను! తిట్లనుగూడా తిన్నాను. అవంతా జరిగింది నీముందే!"

ఆపై సరస్వతిఅన్నది.

"అతడొక రెండుకాళ్ళ పశువు!"

"ఛీ! పిచ్చిదానా! అలా అనరాదమ్మా."

"తోక ఒకటేలేదు! ఆనాడు మనమనుకొన్నట్లు!"

సరస్వతీ - గణపతీ యిద్దరూ యేడ్పులోనే నవ్వుకున్నారు. చీకటి పడడానికి ముందే సరస్వతి యిల్లుచేరింది.

పన్నెండూ - పదమూడూ దినాలుగడచినై. గణపతి ప్రయాణమయినాడు.

బ్రహ్మానందశాస్త్రిగారింటికి వెళ్ళి, ఆయింటినుండి, బయటబడవలసిన పని గూడావుంది. గణపతి ప్రారబ్ధానికి, అగ్నిలోకి దూకేవాని వలె నేరుగా యింటిలోకి పోయాడు. మంచానికి ఆనుకొని కూర్చున్నది

అచ్చక్క! గణపతి ఆమెకు దీర్ఘ నమస్కారం చేశాడు. గద్గదంగా రెండుమాటలన్నాడు:

"ఈకొడుకు తమకు కావలసినపుడు కాశీలో స్థాపింపబడిన బ్రహ్మానంద విద్యాపీఠానికి ఒక జాబుముక్క రాయండి తల్లీ! పరుగెత్తుకొని వస్తాను."

ఏవైపు చూడకుండా గణపతి తొందరగా నడిచాడు.

"నీపెండ్లికి పిలిపించవా! వస్తాను" అచ్చక్క అభిమానంతో అన్నది.

"గణపతి బ్రహ్మచారి తల్లీ!"

"సరస్వతికి చెప్పకుండానే పోతున్నావా! గణపతీ!" అచ్చక్కకు మాట నోటిలోనే వుంది. గణపతి యిల్లువాటాడు!

స్నానపు గదిలోవున్న సరస్వతికి తల్లిమాట వినబడ్డది. ఆమె ఒకటే పరుగున బయటికి వచ్చింది. నట్టింటి వాకిట్లో నిలుచున్న బాళప్ప 'హుమ్మని' గద్దించి గడారువంటి చేతులనూ—వాకిలి కడ్డుపెట్టాడు! బయటనున్న గౌరమ్మ గభీమని వాకిలి వేసింది! ఇంటినుండి బయట పడి రెండడుగులు వేసిన గణపతి హృదయంలో గౌరమ్మ గభీలుమని మూసిన వాకిలిశబ్దం ప్రతిధ్వనించింది. వాడుమాత్రం తిరిగి చూడనేలేదు.

౧౮

తండ్రిచచ్చిన సంవత్సరం యింట్లో యేశుభకార్యమూ జరుగరాదని మొదలు భాస్కరభట్టే అడ్డువేశాడు కొడుకునిషేకానికి—

"చాలు వూరుకోండి! మీమాట నే నొప్పను! మీచేతిమీద యే శుభకార్యం జరిగిందని పంచాంగం జెబుతారు? మీబ్రతుకంతా పీనుగులు మోయడంతోనే సరిపోయింది. కారావంట శుభకార్యం! ఏమో తెలిసినట్లు మాట్లాడితే సరిపోయిందేమి? మగవాళ్ళ విషయంలో యేపట్టింపూ లేదు,ఆడదాని కేమిచింత! ఇప్పుడు చచ్చింది సరస్వతితండ్రిగాని బాళప్ప తండ్రిగాదు."

స్పష్టంగా 'అనుకూలసింధువులో' ధర్మసందేహాన్ని తీర్చివేసింది గౌరమ్మ!

"బాళప్పతండ్రి కాపుణ్యమిపుడే యేల లభిస్తుందిలే! ఇంకాయేమేమి చూడవలెనో యీపాడుకండ్లతో -"

భాస్కరభట్టు గౌరమ్మభర్తగా తను బ్రతికినందుకు మనస్సులో యెంతో వ్యధపడ్డాడు!

వీరి సంభాషణ అచ్చక్కకు అసహ్యమనిపించింది. తండ్రితో యిలాఅంది:

"పోనీలే నాయనా ! ఆమాట లిప్పుడెందుకు? చావువచ్చేటప్పుడు పెద్దన్నా నిలువదు."

"బాగాచెప్పినావే అప్పే! అలామాట్లాడు ! నేనప్పుడే జ్యోతిష్కుల విచారించి వచ్చినాను. పదహైదు దినాలలోపలనే మంచి ముహూర్తం వుందట !"

"కాముని పున్నమముందు నీకే జ్యోతిష్కుడు వెతికి ముహూర్తం పెట్టినాడే ! ఇప్పుడైన అనర్థం చాలదా? ఇక రెండునెలలైనా పూరికే వుండనీ ! పిల్లయింకా ఒళ్ళుపట్టలేదు. దానికి మనస్సూ సరిగాలేదు. తండ్రి చావడం ! అన్నయిల్లు విడువడం అన్నీ చేరి బిడ్డ చాలా చిక్కిపోయింది పాపం ! ఏమంత తొందరనీకు ? ఇంత తొందరగా శోభనంచేసికొని నీ కొడుకు - యే యింగ్లండు - అమెరికాకు పోబోతున్నాడు ?"

భాస్కరభట్టు అన్న యీమాటకు తడవుకోకుండా వుత్తరం రానే వచ్చింది:

"మీరు యే యింగ్లండు - ఎమ్మికరక్కు పోయినారు? మీశోభన మంత తొందరగా యేచ్చుకోవడానికి?"

"చాలు నోరుమూసుకో !" మగవాడి అధికారాన్ని పురస్కరించి కొని భాస్కరభట్టు మాట్లాడాడు.

రెండునెలల తరువాతనే నిషేకం నిర్ధారణ అయింది. మరుదినమే గౌరమ్మ మొగుణ్ణీ కొడుకునూ పిలచుకొని, పూరిక ప్రయాణం అయింది. తలవాకిలివరకూ వెళ్ళిన గౌరమ్మ, ఆమాటను కడుపులోనే దాచుకుంటే కడుపు వుండవుతుందనేమోనని అన్నట్లుగా మరలివచ్చి బిడ్డతోఅననే అన్నది:

"నీవక్కడికి యిలానే వచ్చేవేఅచ్చీ! శుభ్రంగా మడుగు బట్టిరా పల్లెటూరిలో ఆక్షేపణలు జాస్తి! వాండ్లపిండ్లదాకా యెందుకు? అలాంటి చేష్టలు నాకేసరిపోవు!"

ఈమాటతో అచ్చక్క కేయాతనా కలుగలేదు. బ్రహ్మానందశాస్త్రి వంటి మొగుణ్ణి పోగొట్టుకున్న స్త్రీకి తన తల పోయినా దుఃఖంపుండదు. ఇక వెంట్రుకలమీద మమత యెందుకుంటుంది? అచ్చక్క జీవనంలో యేంమిగిలింది గనుక? బంగారువంటి మొగుడు బూడిదపాలైనాడు! కొడుకనుకొన్న గణపతియిల్లు విడచిపోయాడు. దగ్గరవున్న బిడ్డ కూతురు గూడా గండుపిల్లివంటి జాశప్ప పాలైంది.

"కానీమ్మా! రేపే మడిగట్టుకుంటాను. ఉండి ఆస్వరూపాన్ని గూడ చూచుకొనిపో."

అచ్చమ్మ గౌరమ్మబిడ్డయే గనుక అయివుంటే తడుముకోకుండా అనివుండేది. కాని ఆమె భాస్కరభట్టు బిడ్డ! వ్యథ అనే విషయం దిగమ్రింగు కోవడమే వారికలవాటు!

# ౧౯

"పెట్టకొంచెం పోత ఘన" మన్నట్లు - మూర్తిచిన్నదైనా "హార్పనహళ్ళి" కీర్తి దొడ్డది. పురాతన కాలమునుంచి ఆ వూరిని రెండు శక్తులు పట్టుకొన్నాయి. ఒకటి బుద్ధిశక్తి-వేరొకటి జీర్ణశక్తి. లక్ష్మీ సరస్వతులకు వలె యీ రెంటికి బద్ధద్వేషమైనా యీ రెండూ ఒక్కచోట వుండడమే దాని వైశిష్ట్యం! దానికి చుట్టుముట్టి వున్న తాలూకాలోని బుద్ధియొక్క భావానికి కారణమై యుంటుందంటే "హార్పనహళ్లి" లో ఎక్కువబుద్ధి కుప్పగా వుండడమే. బుద్ధిశక్తి యెక్కువయ్యే కొలదీ దాని సదుపయోగం తక్కువౌతుందో యేమో! బుద్ధిశక్తి దేశానికి వుపయోగపడకపోతే పోయింది, దయ్యానికి ఉపయోగపడితే యెలాగ? మాటల చాతుర్యాన్ని ఆ వూళ్ళోనే చూడవలె! ఆ వూరికి క్రొత్తగా యెవడైనా అమాయకుడు వస్తేచాలు! వాని బాధను దేవుడు విచారించవలసిందే! అత్త - మామ - అక్క - అనే అభిమానం లొటీకిసలాడే మాటలతో సంభాషణ ఆరంభించి కట్టకడకు వారిని ఫజీతాపట్టించి యేడ్చేంత స్థితికి తెస్తారు.

ఇటువంటి బుద్ధిశక్తిగల దుష్టులచేతిలో బాళప్ప పడితే వానిగతి యేమవుతుందీ అని చెప్పేది? అప్పళం విరచినట్టు విరచి గాలికి పూదేస్తారు.

రేపే బాళని శోభనముహూర్తం! బాళప్ప ఒంటిగా బజార్లో పోతున్నాడు. అంగీగింగీ లేకుండా గడ్డంపెంచుకున్న అనారి ఒక్కడు వానికి త్రోవలో అగుపించాడు.

"ఎవరండీ మీరు?"

అపరిచితుడైన యీ వ్యక్తి తన్ను పలకరించినందుకు బాళప్పకు దిక్కు తోచలేదు.

"అయితే నన్ను పూర్తిగా మరచావన్నమాటే! నీకిప్పుడుండే జోరులో మావంటి బీదవాళ్ళు కంటికి కనబడుతారా? గుర్తుచిక్కుతారా?"

పాపం! ఏమో బాంధవ్యావేశం కలిగినవానివలె పలికిన యీ మాటలుపిచ్చిబాళప్ప హృదయానికినేరుగా తాకడంలో ఆశ్చర్యమేముందీ?

"అయ్యో! జ్ఞాపకంలేదు! మీరెవరు?" ఆయనకప్పుకొన్న నీరుపంచ పట్టుకొని బాళడు వెంటబడ్డాడు.

"నీమామ మొగుణ్ణి-తమ్ముని బిడ్డ మొగుణ్ణి నేను. నీపెండ్లిలో చారు వడ్డించలేదూ నేను?"

బాళప్ప తన యీ క్రొత్త బంధువును ఆ పాదమస్తకం రెండుసార్లు చూచాడు!

"ఇప్పటికైనా గుర్తుచిక్కిందా లేవా? మహారాజా! చిక్కకుండా వుంటే 'చిక్కలేదూ' అను. నీవుచాలా గొప్పవాడవనుకొని పాకైపోతాము."

బాళణ్ణ కాస్తసేపు యోచించాడు. వాడికెక్కడినుంచో అపూర్వ జ్ఞానం పుట్టుకొని వచ్చింది.

"అవునవును. చూచినట్టే వుందిలే!"

"హోటలువైపు పోదాంరా ?"

బాళప్ప నికరంగా చెప్పివేశాడు. ఆపైన తకరారుండ కూడదనే వుద్దేశ్యంతో-

"నాదగ్గర నాలుగణాలే వున్నాయి! చూడప్పా! నీపేరేమంటివి?"

"గుండడు గాదేమిరా!"

"అదే చెబుతున్నాను గుండా! నీవు జాస్తీ తినకూడదు."

ఇద్దరూ బస్టాండు దగ్గర నున్న హోటలుకు దారి తీశారు. ఒక వుప్పిండీ -ఒకకాఫీ!

'మైసూరుసిష్టం!' ఒకదానిలోనే యిద్దరూ పంచుకొనిముగించారు. గుండడు బీడీ ముట్టించాడు బాళప్పకు ఒకటిస్తూ.

"ఏ! వద్దప్పా! నాకభ్యాసంలేదు!"

"అభ్యాసంలేదూ? చేసుకోవలెనోయ్! అభ్యాసాలన్నీ పుట్టుకతోటే వస్తాయా యేమిటి? అయితే నీకు విషేకం అభ్యాసం వుందేమి? ఈరోజెలా చేసుకుంటున్నావ్!"

బాళప్ప కెందుకో ఆమాటతో "గోబ్రాహ్మడు" అనేవ్రాత జ్ఞాపకం వచ్చింది.

"దీనికి ముందెప్పుడైనా నీకు శోభనమై వుండిందా?"

"లేదప్పా!" వెంటనే అబద్ధం చెప్పాడు బాళప్ప! గుండిడికి గూడా యీ వుత్తరమే కావలసింది.

"అయితే ఏంచేయదలచుకొన్నావు నీవు?"

గుండప్ప మొగంపైన నవ్వూలేదు. చిలిపితనమూలేదు. గంభీరంగా ప్రశ్నించాడు.

"మాఅమ్మ నడుగుతాను, ఎలాచెప్పితే అలాచేస్తాను"

"సీతల ! మీఅమ్మ నడుగరాదు ! ఇలాంటి విషయాలు మాపంటి స్నేహితుల నడిగి తెలుసుకోవలె ! మేమేం చచ్చినామటరా? మేముండేదే యిట్టివాట్లలో సలహాలివ్వడానికి. ఆవిద్య గురువులేకుండానే వస్తుందనుకో! అయినా చెప్పడం - తెలుసుకోవడం అనే ఆచారంవుంది గదూ!"

బాళప్ప కుతూహలం పెరిగింది.

"అదేమో కొంచెం చెప్పవోయ్ ! బాబూ ! ఇంకొక్క కాఫీ తెమ్మను. నాదగ్గర యింకొక రెండణాలు వుందిలే !"

ఇంకొక్క కప్పు 'కాఫీ' వచ్చింది ఇద్దరూ దాన్ని పంచుకొని త్రాగారు. గుండడు బాళనికి మంత్రోపదేశం ఆరంభించాడు :

"రెండుతులాలు యింగువ దీసుకో ! దుష్టూ గిడ్డూ వుందిగదూ ?"

"ఇంకా రెండురూపాయిలున్నాయి లేరా !"

"అదేనేననేది. ఒకటోరకం యింగువ ! రెండుతులాలు ! దాన్నెవ్వరికీ చూపించవద్దూ ! మీ అమ్మకున్నూడా ! రాత్రి గదిలోకిపోయి - వాకిలిమూసి - ఆరెండుతులాలు యింగువనోట్లో వేసుకో ! దవడలో వుంచుకోవాలి తెలుసా ! నీళ్ళు పూరిరే మింగేసేయి ! ఆ యింగువను వుమ్మేస్తేమాత్రం పని చెడిపోతుంది. కేవలం నీటిని మ్రింగుతూ వుండాలి! ఈమజా ఒకసారిచూడు !రేపునువ్వే అంటావ్ ! "గుండప్పా !ఉపకారం జేస్తివి" అని."

వాడు చెప్పేపద్ధతీ - ప్రకటించే ఆత్మీయతా - చూస్తే, ఎవడుగానీ గుండప్పమాటను నమ్మితీరవలసిందే! ఇకమేకవంటి బాళప్పయీజాలంలో పడినాడంటే ఆశ్చర్యమేముంది ?

గుండడు చెప్పిన మజా చేసితీరవలసిందేనని బాళప్ప నిర్ణయించు కున్నాడు. గుండడి వంటిస్నేహితుడు తనకింతవరకూ చిక్కనేలేదు. ఇంటికి పోవడానికి ముందు మరొక వుప్పిండీ, కాఫీ తెప్పించాడు; అందులో గుండడికి పెద్దభాగం పెట్టాడు.

సమయంమించితే అంగడికి పోవడానికి 'పురసత్తు' చిక్కుతుందో లేదోనని గుండప్పజతలోనే కుంటిలచ్చప్ప అంగడికివచ్చి 'మజా' చేయడానికి కావలసిన ఆసామాను - రెండుతులాలు యింగువను - తీసి కొని బాళప్ప యింటిదారి పట్టాడు. రొంటిలో చెక్కుకున్న యింగువను గంటకారుసార్లు ముట్టుకుంటూ యెప్పుడెప్పుడు రాత్రవుతుందా అని కండ్లన్నీ తెరిచిచూస్తున్నాడు బాళప్ప!

"పల్లెకుపోవాలి! పనివుంది."

భోంచేసి ఆమధ్యాహ్నమే భాస్కరభట్టు దారిబట్టాడు.

"నేననుకొన్న దొకటీకాలేదు. సరస్వతికీ గణపతికీ పెండ్లిగాలేదు. బాళప్పకు పెండ్లికాకుండా నిలువలేదు. బ్రహ్మానందశాస్త్రి యింకా నాలుగు కాలాలపాటు బ్రతుకుతాడను కొన్నాను. అదీ తప్పిపోయింది. నాకు తొందరగా చావన్నారాలేదు. 'సుంకలమ్మ' లావుండే నాపెండ్లాము గౌరమ్మకు పార్శ్వవాయువన్నా రాలేదు. ముఖ్యంగా దానికి నాలుక పడి పోయివుంటే యెంత బావుండేది? పోనీ పెండ్లి కావడానికి ముందైనా యీ బాళప్పగాడు చచ్చివుండగూడదా!" యింకా యేమేమో గొణు క్కుంటూ, భాస్కరభట్టు నడుస్తున్నాడు. చెప్పరాని వేదన ఆయనమన స్సులో. రాత్రికి శంకరదీక్షితుల గుడిసెచేరి అక్కడ కూర్చుని యేడుస్తు న్నాడు పాపం!

కొత్తగా వైధవ్యపట్టాన్ని కట్టుకొన్న అచ్చమ్మ ఒక మూలలో అణగివుంది, ఒక ప్రాణంలేని పదార్థంవలె. సరస్వతిగూడా ఒక మూలలో వుంది రాబోయే యమయాతన కెదురుచూస్తూ।

ఇంట్లోఅంతా గౌరమ్మదే పెత్తనం. ఆమెను పట్ట పగ్గాలులేవు. వంటపనంతా తనది. భోజనం పనంతా బాళప్పది.

శోభనపు గదిని శృంగారించే కార్యం పూర్తిగా గౌరమ్మదే। తన అభిరుచికి తగినట్లు ఆమె అలంకారం చేసింది. ఇక తిను బిండా రాలు। బాళనికి కావలసినన్నీ ఆగదిలో చేర్చింది, వాని తిండిప్రమాణ మామెకు తెలుసును గనుక।

ఊరంతా చెప్పివచ్చింది గౌరమ్మ। శోభనపుగది శృంగారం చూడడానికి రమ్మని। ఊళ్ళోని జనము, ఎవడైనా బావిలో పడిచస్తే, శవాన్ని చూడడానికి వచ్చేజనం లాగ తండోపతండంగా వచ్చారు. వచ్చినవారు, కాస్తసేపయినా నిలువడంలేదు. వెంటనే వెళ్ళిపోతున్నారు. ఊరంతా బాళప్ప శోభనంకథే।

"ఓహోహో। గౌరమ్మ ఆగదినంతా పటాలతో యేం అలంకారం చేసిందీ।"

ఈ విషయాన్ని చర్చించని యిల్లేలేదు.

"ఆపిల్ల పుణ్యం అలావుంది. దేనికైనా పెట్టి పుట్టవలె చూడు। మూర్ఖ చక్రవర్తి యీ బాళప్పవంటి మొగుడు - రాక్షసి గౌరమ్మవంటి అత్త - దొరికిన మీద శోభనపు గదిలో యెన్ని పటాలు వేస్తేనేం?" ఒకామె అంది.

ఇంకొక్కతె దానికి బదులిచ్చింది. వయసు మంపరంతో తోసుకు వచ్చిన చిరునవ్వుతో –

"శోభనపు గదిలో నరకయాతన మాయమ్మా!"

కూర్చున్నవారంతా గొల్లుమని నవ్వారు.

"నవ్వొద్దంటే! జీవితమంతా నరకమే ఆ సరస్వతికి."

ఆమె మందలించింది.

"తలవైపు వేసిన పెద్దపటం నీకు కనబడలేదూ!"

"ఆయన గ్రహచారం! ఆ యతికి యీ ప్రారబ్ధం పట్టుకుంది."

"ఆ రాఘవేంద్ర స్వామికి యీ శోభనపు గదిలో యేంపనీ?"

ఆడవాళ్ళంతా పడిపడి నవ్వారు.

"ప్రపంచాన్ని, కుటుంబాన్నీ అంతావదలి - రాఘవేంద్రస్వామి బృందావనంలో కూర్చుంటే - యీ పరమ భక్తురాలు అక్కడనుంచి ఆయన్ను లాక్కొని వచ్చి 'నాకొడుకు ప్రతాపం చూడ' మని ఆయింట్లో నిలిపింది."

"చాలులేండి! పాడుకథ! నాకువింటుంటే కడుపుతిప్పుతూంది. పాడుముండాకొడుకు సుద్ది!"

అందరూ ఆ ప్రస్తావన నిలిపివేశారు.

ఇంకొకయింట్లో కూడా యిదేసుద్ది!

"అన్ని ఫోటోలకంటె ఒకటి నామనసుకు చాలనచ్చింది. అదేదో చెప్పు!"

"లోధ్రా ఔషధం కాలిండరు కదూ!"

"అదీ ఒకటి. యింకొకటి దాని ప్రక్కనవుందే! కంప ఆస్పిరిన్ కాలిండరు! అదీ!"

"రెండూ ప్రక్కప్రక్కనే వేసింది. కడుపునొప్పికి ఒకటి - తల నొప్పికి ఒకటి - ఒకటి గౌరమ్మ తెచ్చే రోగం - ఇంకొకటి బాళప్పతెచ్చే

రోగం! ఇంకొకటి వున్నది చూచావా? మహిషాసురుని ఫొటో? దాన్ని మరచినావే!"

"మరవలేదమ్మా! ఆ మహిషాసురుడు బాళప్పవున్నట్లే వున్నాడు."

"ఛీ! మహిషాసురుడు బాళప్పఅంతటి కురూపిగాడే! వాణ్ణి తీసుకొనివచ్చి వీనికి పోలుస్తావు."

"ఊరుకోవే! మనమాటలు గౌరమ్మ చెవిలో పడితే- మన... తొలిచేస్తుంది."

"ఇక మీదట ఊర్లో యెవరింట్లో నిషేకమైనా గదిని శృంగారించడానికి గౌరమ్మనే పిలవాలి."

"పిలిచేవాళ్ళకేమి! ఊరికా పిలుస్తారు. గౌరమ్మకు తీరిక దొరకొద్దు?"

మధ్యాహ్నం అందరూ భోజనాలు చేస్తున్నారు. బాళప్పరొంటిలో వున్న డబ్బీని తాకుతూ తల్లిని చూచి గట్టిగా అరచాడు:

"ఎప్పుడే యింకా గదిలోకి అంపేది?"

కూర్చున్న వాళ్ళంతా పడిపడి నవ్వారు.

"తొందరపడకూడదప్పా! బాళప్పా!"

ఇలా కొడుక్కి సమాధానం చెప్పి భోజనానికి కూర్చున్న వాళ్ళ వైపు జూచి గౌరమ్మ సాధికారంగా అన్నది.

"సరసి" అంటే మా బాళనికి యెంతో ప్రేమ! వాణ్ణి పెండ్లి జేసుకోవడానికి అది యెంతపుణ్యం చేసిందో!"

"కాదామరి!" అంటూ భాస్కరభట్టు ముద్దనోట్లో దురుక్కున్నాడు.

భోజనమైన తర్వాత జరిగిన ఒక అసహ్యాకరమైన ఘటనతో ఆయనపూరే వదలిపెట్టాడు.

అందరి భోజనాలూ ముగిసినై! అత్త గౌరమ్మ గట్టిగా అరచింది:

"సరసీ! ఏమి! దొరసానిమాదిరి కాళ్ళుజాచి కూర్చున్నావు? ఆతట్టలన్నీ యెత్తి దొడ్లోకి తీసికొనిపోయి, వాటిని కడుక్కొనిరా! మాయింట్లో నీసోమారితనం సాగిరాదు! తెలిసిందా?"

సోమరితనమంటే యేమిటో తెలియదు సరస్వతికి! చెప్పకముందే లేచి మెరుపువలె పారాడి పనిముగించే స్వభావమామెది. పరుగెత్తే గుఱ్ఱాన్ని యింకా చమ్కీతో తంతే! ఆమె క్షణంలోలేచి తట్టలన్నీ యెత్తి దొడ్లో వేసి వంటిల్లు శుద్ధిపెట్టింది.

దొడ్లోవుండే తట్టలను కడగడానికి బూడిదకోసం ఒచ్చట్లోకి వెళ్ళింది.

చిలుకను పట్టుకోవడానికి పొంచివున్న బావురు పిల్లిలాగ బాళప్ప పొంచివున్నాడు సరస్వతికోసం! కట్టెల వెనుకనున్న బాళప్ప నామెచూడ లేదు. వాడు హఠాత్తుగా ఆమెపైన విరచుకపడ్డాడు.

సరస్వతికి నోటమాట రాలేదు. బాళప్పచేష్ట ఆమెకేమీ అర్థంగా లేదు పాపం! బాళప్పవైపు క్రూరంగా మాత్రంచూచింది. ఆమెకప్పుడు భయంగాలేదు. సరస్వతి అంత పిరికిదిగాదు. వాని అవివేకాన్ని చూచి, సరస్వతి మనస్సును కోపము, జుగుప్సా ఒకసారే ఆక్రమించుకున్నాయి!

"శుద్ధపశువు!" మనస్సులోనే గొణుక్కుంటూ, ఆమె వాకిలివైపు వెళ్ళింది.

"సరసీ! నీవు నాపెండ్లాము తెలుసా?"

"అయితే!" ఆమె వెనుదిరిగి చూచింది. ఆకన్నులు ఎఱ్ఱబారినై. బాళప్ప పరుగెత్తుకొని వచ్చి చేత్తోగట్టిగా సరస్వతి నోరుమూశాడు.

వెనుకనుండి మెల్లగా వచ్చి యెదుటవారికి నొప్పితగులకుండా, వారికండ్లు మూయడం కొందరికి ప్రణయలీల! పులివలె మీదబడి. పళ్ళు

విరిగేటట్టు నోటిలో చేయిపెట్టి ఒత్తడం బాళప్ప ప్రణయలీల ! పాపం ! సరస్వతికి యీరెండూ తెలియవు !

వారు యిద్దరటూయిటూ కొంచెంసేపు త్రోసుకొన్నారు. వేగంగా బాళప్ప సరస్వతిని నేలకులాగాడు. ఆ లాగడంలో, ప్రక్కనున్న చెంబు సరస్వతి తలకు కొట్టుకుంది. ఆమె అరచింది. బయట కూచున్నవారంతా 'ఏమి జరగిందో'నని లోపలికి వచ్చారు. సరస్వతి ఆర్తధ్వనివిని అచ్చమ్మ ముందుగా వచ్చింది. ఆమె వెంటనే గౌరమ్మగూడా ! వచ్చిన గుంపు బాళమహాత్ముని అవివేకాన్ని నిలచిచూచింది.

బయటనున్న భాస్కరభట్టు లోపలికి వచ్చి బాళప్ప వెన్నుపైన నాలుగు తన్నులు చరిచాడు. నాలుగూపడిన కుమారబాళప్ప మనుష్యుడైనాడు. లేచి పిచ్చిముఖంపెట్టి నిలుచున్నాడు. సరస్వతి జారిపోయిన కొంగు సవరించుకొని తల్లి దగ్గరకు పరువెత్తింది. ముసుగుపెట్టి పండుకున్న సరస్వతిని నిమురుతూ తల్లి యిలా అన్నది:

"మీతండ్రి పుణ్యాత్ముడమ్మా ! తొందరగా చచ్చాడు. నాకర్మ యింకా యెంతవుందో !"

భాస్కరభట్టు అపుడే యిల్లువిడచాడు. చీకటిపడినా యింటికి రాలేదు.

గౌరమ్మ బాళప్పను వేరుగా తీసికొనిపోయి, 'ఛీ' కొట్టింది: " గాడిదముండాకొడకా ! రాత్రివరకూ ప్రాణాలు పట్టుకోలేక పోయినావా?......"

బాళప్పకోపం గౌరమ్మపైకి దూకింది.

"సరసి నాపెండ్లామని నీవే చెప్పావుగా...నాపెండ్లాన్ని నేను..."

"థూ ! నీమొఖాని కగ్గిపెట్టా !"

## ౨౦

రాత్రి పదిముప్పావుకు ముహూర్తం !

గంట పదిన్నరకు పైబడింది. అయినా బాళప్ప శోభనపుగదిలోకి వెళ్ళలేదు. ముసుగుపెట్టి స్నానాలగదిలో పండుకున్నాడు. నాలుగు యేనుగులు కట్టియీడ్చినా, అంగుళమూ కదిలేటట్టు లేదు వానివాలకం ! పెట్టినముసుగు తియ్యనేలేదు. గౌరమ్మ యెంతో సాహసం చూపెట్టింది. కానీ ఒకటీ పనికిరాలేదు.

"ఇదిగో ! తీసికో ! పెసరులాడు వుండలు తెచ్చాను. ఇవి తీపటుకులు."

వానికి ప్రీతికరమైన తిండ్లు చూపించి గౌరమ్మ కుక్కను పిలచినట్లు ఎంతోయిదిగా పిలచింది.

" నీవే తిను. "

"కొత్త జలతారుపంచ తెచ్చినానురా ! లేవరా నాదేవుడూ"

"నీవేకట్టుకో !"

"తలంతా అసహ్యంగా పెరిగిందిరా ! నిన్న క్షౌరమైనా చేయించుకొనివుంటే బావుండేది."

"నీవే చేయించుకో."

"ఓరినీవుచావా ! ఏం అపభ్రంశ కూతలురా ! అన్నిటికీ "నీవు నీవు" అంటావా ! ఈప్రొద్దు చెడ తిట్టహాడదవని నిన్ను వదలిపెట్టినా ! రేపు తెల్లవారనీ! నిన్ను చావగొట్టి యెముకలు గడ్డకుదీస్తాను."

సాధ్యం అయినంత సాహిత్యంతో ముద్దుకుమారుని నోటినిండా ఆశీర్వదించి, సాధ్యంకాక ఉసూరుమని, తలపై చేయిపెట్టుకుని కూచుంది గౌరమ్మ !

హారతీ, అక్షతలూ భార్యా భర్తలను పీటలపైన కూర్చోబెట్టి పాలూ, నెయ్యీ యివ్వడం మొదలైన వేడుకలన్నీ చూడడానికీ, శోభనపుగది వాకిలి వేసిన తరువాత ద్వారం సందులగుండా తొంగి చూడడానికి వచ్చిన చిన్నచిన్న ముత్తయిదువులకు బాళప్ప హఠంతో చాలా వేసరిక వచ్చింది. వారు 'యిండ్లకువెళ్ళి వస్తా' మనే సూచనను చేశారు గౌరమ్మకు !

రెండుగంటలకు ముందే సరస్వతికి శృంగారించి వాళ్ళమ్మదగ్గర కూచోబెట్టారు - పిలచిన వెంటనే పీటలపైకి రావాలని బోధించి. కసాయి దగ్గరకు తీసుకపోవడానికి తయారుచేసిన మేకలాగే కూర్చుంది సరస్వతి.

అచ్చుకక్క మనసును అద్భుతవైరాగ్య మాక్రమించుకుంది. సరస్వతి తనబిడ్డ అనే సంగతే మరచిపోయిందావిడ! ఎవరికో,యేమిటో జరుగుతూంటే మరెవ్వరో చూస్తున్నట్లు ఉన్నదామె వాలకం !

"గౌరమ్మగారూ ! మేమిక వెళ్ళివస్తాము ! ప్రొద్దు పోయింది." పేరంటానికి వచ్చిన ముత్తయిదువలు ఒకరొకరే జంకుతూ సెలవు తీసుకోడానికి గౌరమ్మను సమీపించారు.

"ఏం చచ్చేదమ్మా ! యీ ముండాకొడుకుతో ! ఎంత పిలచినా గడ్డకురాడు ! తినడానికేమిచ్చినా పలకడు."

సూక్ష్మబుద్ధియైన గౌరమ్మకు యీ రగడకంతా కారణం మరెవ్వరికీ తోచనిదొక్కటి తోచింది.

"ఎవరైన యేమైనా మంత్రమూ, తంత్రమూ చేసివుంటారా అని నా అనుమానం! ఏవో వుంటాయిగదా! మంత్రాలూ, తంత్రాలూ-అవేవైనా! ఈ పనంతా ఆ నీచముండాకొడుకే చేసివుంటాడు! గణపతిగాడు! తెల్లవారనీ! వాడు చేసిందానికి బదులు మంత్రం చేయించి కాశీలోనే రక్తం కక్కుకుని చచ్చేటట్లు చేస్తాను."

గౌరమ్మ యీ మాటలంటుంటే అచ్చుక్క చెవిలో సీసం కాచి పోసినట్లయింది.

"సరి ప్రొద్దుపోయినా! యింకాయేం చేస్తున్నాదర్రా!" వృద్ధ విధవ తారవ్వ వణకే శరీరంతో నడుంమీద చేయిపెట్టుకొని లోపలికి వచ్చింది.

"ఇంకా పంపలేదేమే గౌరీ! యింట్లోకి! యెందుకింత ఆలస్యం చేస్తారు?"

బాళప్ప హఠంపట్టి యింట్లోకి పోనని కూర్చున్న వృత్తాంతం గౌరమ్మ ఆమెకు మనవి చేసింది.

"ఎందుకింత హఠం? మంచిసమయంలో యీ పిల్లముండా వాండ్లు యిలాగే చేస్తారు! నేనొప్పిస్తాను! తట్టుకోండి! ఎక్కడున్నాడు వాడు?"

తారవ్వకు స్నానపుగదివైపు సైగచేసింది గౌరమ్మ. ఆవిడ వదరుకుంటూ వెళ్ళింది.

''ముప్పైఐదు సంవత్సరాలక్రితం మా యజమానులూ యిలాగే చేశారు! ఇంట్లో వాళ్ళంతా కాళ్ళూ కడుపూ పట్టుకొన్నా లేచిరాలేదు. పంద్రెండు ఓళిగలూ, అర్ధసేరు బియ్యం అన్నమూతిని చేతులు కడుగుకొని లేచింతరువాత - తినటానికి రెండు బెల్లపప్పుచ్చులు మా అత్తను అడిగాడట ఆయన! ''రాత్రి గదిలో యెలాగయినా పెట్టివుంటారు అక్కడ తినకూడదేమిరా! ముండావాడా!" అన్నదట ఆపె! ఇక మా మామగారు - వారికి ముక్కుమీదకోపం! ''గడ్డి తినరాదా! గడ్డి" అన్నాడట...

"బాళప్పా! లేవరా! నాదేవుడా! ఇలా చేయరాదు. పాపం మీ అమ్మచూడు, చిన్నమొఖంచేసుకుని కూర్చున్నది. ఏంచేస్తుందీ అది మాత్రం? అదీచిన్నపిల్లే! వాడు - భాస్కరుడేడీ!"

అపుడు గౌరమ్మకు మొగుడు జ్ఞాపకం వచ్చాడు. తారవ్వప్రశ్నకు ఉత్తరమివ్వడాని కెవరికీ కాబట్టలేదు. అయినా తారవ్వ అనుత్సాహపడలేదు.

"లేవరా బాళప్ప! గదిలోకి పద!"

"నీవే పో! కావలసివస్తే!"

బంగారువంటి యీమాట అనడానికి బాళప్ప నోరుతెరిచాడు.

"థడ్డాబోడీ! నేనే యింట్లోకి పోయేది. అంతాముగిసి కట్టుకొన్న మొగుణ్ణి కట్టెల్లోపెట్టి ముండమోసుకూర్చున్నాను. నీ పెండ్లాం దగ్గరికి నీవు పోవడానికెవరి సిఫారసు కావలెరా?"

గభీమని లేచి కూచోని బాళప్ప ఉరిమిచూచి యిలాఅన్నాడు:

"ఊః(...నాపెండ్లాం! ఇప్పుడు నాపెండ్లాం! మధ్యాహ్నం నాపెం డ్లాం గాదేం? మళ్ళీ అమ్మ నన్నెందుకు తిట్టిందీ ?"

తారవ్వకు సందర్భమే అర్థంగాలేదు. తెలుసుకునే ప్రయత్నమూ చేయలేదు. బుజ్జగిస్తూనే కూర్చుంది. భాస్కరభట్టు స్నేహితులైన అన్నం భట్టు, ఉద్దినవడె వుద్దానయ్యా, జైన భూపాలప్పా మొదలైన వూరిపెద్ద లంతా వచ్చి బాళప్పకు బుద్ధివాదం చెప్పారు! వారందరిదీ ఒకటేమాట! బాళప్పదీ ఒకటేమాట!

''ఇలాచేయరాదు! నిషేకపుగదిలోకి పోరా! బాళా!"

"మీరేపొండి కావలసివస్తే."

ఒకరొక్కరూ తలగోక్కుంటూ గడ్డకు వచ్చారు. అన్నం భట్టు మాత్రం తట్టుకోలేక పోయాడు. ఆయనిలా అనివేశాడు:

"మూఢో మూర్ఖో గార్ధభో ఏకరాశిః"

తారవ్వ సులభంగా తన అపజయాన్ని ఒప్పుకొనేదిగాదు. కూర్చున్నది లేవకుండా, అన్నమాటేఅంటూ భార్యాసత్యాగ్రాహియైన బాళప్పను భంగపోతోంది.

"లేవరా! బాళా! రేపుసాయంకాలం మాయింటికిరా! నేను చేసు కున్న వుప్పిండిలో అర్ధంనీకు పెడతాను. లేయ్."

తారవ్వ బాళప్పముఖం తడవుతూ భంగపోతోంది. గడ్డం పట్టు కుంది, ముఖం నేలకు ఆనించి పండుకున్న బాళప్పవీపుపైన చేయి తడవింది. తడుముతూవుంటే యేమోచేతికి తాకింది.

"ఇదేమిట్రా బాళా! రొంటిలో యేదోడబ్బీ"

తారవ్వమాట ముగియకముందే గభీమని లేచి కూచున్నాడు బాళప్ప ! రొంటిలో వుండేడబ్బీ యెవరూ చూడరాదని గుండడన్నమాట వానికి జ్ఞాపకం వచ్చింది.

"ఊఁ...అలాలేయ్ ! నాబంగారునీవు ! మాదేవుకివి నీవు ! చిన్న చిన్నదానికంతా కోపం చేసుకోరాదు ! బుద్ధిమంతుకివిగదానీవు !''

మాటలన్నీచెప్పి తారవ్వ బాళప్పను లేపింది.

గదిలోకి పోవడానికిముందు బాళడు ఒక కరారు చేశాడు- "నిషేకపుగదిలో అమ్మ వుండకూడదు - అవైతే పోతాను."

"అది యెందుకుంటుందిరా ! పిచ్చిముండావాడా ! లే లే !" కడకు తారవ్వ గెలిచింది.

నిషేకపుగదివాకిలి ధప్పుమని పడ్డది. లోపల చిలుకువేసిన ధ్వని కూడా వినపడింది.

ఈగడిబిడనంతా వినియైనా తన ప్రాణపక్షి ఎగిరిపోవచ్చునని అచ్చక్క యెంతో ఆశపెట్టుకుంది. కాని- అలా జరుగలేదు ఆమెకెంతో నిరాశ అయింది. ఇంకా అనుమానమే ఆమెకు! తాను బ్రతికానోచచ్చానో అని గుండెపై చేయివేసుకుంది. గుండె ఆడుతూనేవుంది. " ఇంకా యేమేమి చూడవలెనో " అనుకుంది.

అయిదు నిముషాలు గడచాయి.

సరస్వతిదేహం బాళప్పకు భార్యఅయింది. ఒద్దనుకున్నా యీ మాట ఎన్నిసార్లో తలపునకు వచ్చింది అచ్చక్కకు. గభీలుమని ఎవరో క్రిందపడిన శబ్దము గదిలో......సరస్వతి గట్టిగా అరచింది.

"ఏమిజరిగిందేమిటి?"

బయట గూర్చున్నవారు పరుగెత్తి వచ్చారు. గౌరమ్మ వాకిలికి నోరానించి సరస్వతిని గద్దించింది:

"ఊరుకోవే! పిచ్చిముండా! వాడేమి పులా! సింహమా?"

గౌరమ్మ చూచినదృశ్యం అద్భుతమైంది. ఆ దృశ్యం గౌరమ్మను యేడ్పించే లావుంది

బాళప్ప భూతంలాగా నేలపైన వెల్లకిల పడ్డాడు నోటిగ౦డిజొల్లు కారి మొగమంతా నిండిగొంతుమీదుగా కారుతూవుంది. వానికిస్పృహ లేదు.

"ఏమిచేస్తివే మొగుణ్ణి! గయ్యాళిముండా?" గౌరమ్మ సరస్వతిని చంపేటట్లు చూచింది సరస్వతి గడగడ వణకింది.

"నాకప్పుడే అనుమానం, యీ గణపతిగాడు యేమో చేసివుంటాడు. లేకుంటే, ఆ బ్రహ్మయ్యగాడైనా దయ్యమై పట్టుకొని వుంటాడు."

గౌరమ్మయిష్టంవచ్చినట్లు తిడుతూ కొడుక్కు శైత్యోపచారం ఆరంభించింది. వారూ, వీరూ చుట్టూచేరారు. సరస్వతిని, అచ్చక్క దగ్గరికంపి బాళప్పను యెత్తి మంచంపై పడవేశారు.

ముక్కుకింద వేలుపెట్టి చూచారు. ఊపిరాడుతూంది. నాడికొట్టుకుంటూవుంది.

"సరస్వతి మాంగల్యపు పుణ్యం"

"ఏమిటీవాసన!" అందరినోట్లోనూ యీమాటే!

"అదేమిటి! వానినోట్లో!" గుంపులోవున్న కృష్ణాచారి, బాళప్ప దవడ చూపిస్తూఅన్నాడు.

మధ్యాహ్నం గుండని వేషంతో బాళప్పకు సలహాయిచ్చింది యీ కృష్ణాచారేనని ఎవరికి తెలుసు?

నోట్లోవేలుపెట్టి గడ్డకు తీశాడు - పెద్ద యింగువవుండ, నోట్లో నుంచీ గడ్డకువచ్చింది.

"ఇంగువ ఎందుకు దవడలో పెట్టుకున్నాడో వీనియిల్లుకాలా! దాంతోనే పైత్యోద్రేకమైంది. హెచ్చరిక తప్పిపడ్డాడు". కుచేష్టల క్రిష్ణాచారి సర్వసమ్మతమైన అభిప్రాయం చెప్పి యింటికి పోయాడు. బాళప్పకు స్పృహవస్తే తన్ను గుర్తుపట్టుతాడేమో అనే భయంఆయనకు. అందరూ యిండ్లదారి పట్టారు. బాళప్పకు స్పృహవొచ్చింది. ప్రాతః కాలమూ అయింది ॥.

౨౧

తాననుకొన్న ప్రకారం పనులన్నీ నెరవేరినాయనే సమాధానం గౌరమ్మకు కలిగింది కానీ......

ఆనాటి మధ్యాన్నం యింటినుంచి బయలుదేరి వెళ్ళిన భాస్కరభట్టు మూడుదినములైనా యింటికి తిరిగిరాలేదు. దీనితో గౌరమ్మకు మాత్రమేమీ కొరత తోచలేదు. బియ్యం మిగిలినవి లెమ్మని మనస్సులోనే సంతోషపడింది. వాండ్లు వీండ్లు అడిగినప్పుడు మాత్రం సంకటమున్నట్లు అభినయిస్తూ వుండేది.

"నాన్న ఎక్కడికి వెళ్ళినాడు?"

మూడవదినం నాలుగు ఖర్జీకాయలు నోటిలో ఆడించుకుంటూ బాళప్ప అడిగాడు.

"మీనాన్నగారు కాశీ రామేశ్వరంవైపు పోయినారు."

అడిగినవారికంతా గౌరమ్మ యీ సమాధానమే చెప్పింది. అన్ని విషయాలు తాననుకొన్నట్లు సరిగా జరిగిపోయినై. కాని, ఒక కొరత మాత్రం యింకా తీరలేదు. సరస్వతి తనకోడలైంది. కానీ, బాళప్పకింకా

భాగ్యమాత్రం కాలేదు. బాళప్పను మాటిమాటికీ గుచ్చిగుచ్చి అడిగి గౌరమ్మ యీవిషాద వృత్తాంతాన్ని తెలుసుకొన్నది.

తెల్లవారుతూనే, గౌరమ్మ అర్థగర్భితంగా బాళప్ప ముఖంవైపు సైగచేస్తుంది. బాళప్ప లేదన్నట్లుగా సైగచేస్తాడు. వారిర్వురి మధ్య యిది నిత్యకర్మమై పోయింది.

పెండ్లామింటికివచ్చి నెలలుగడిచినై. బాళప్పకుసుఖంమాత్రంలేదు.

గౌరమ్మ అత్త అధికారాన్ని చెలాయించింది:

"ఇరువదినాలుగు గంటలూ వంటింట్లోనే వుండి ఏంచేస్తావే సరసీ! ఎద్దుమాదిరి ఎప్పుడూ నెమరువేస్తూ మాయిల్లు నాశనంచేస్తు న్నావు! బయటికిరా!"

బాళప్ప మగనికుండే అసాధారణాధికారాలను ఒకటొకటిగా జారీచేయడం మొదలు పెట్టాడు. "ఎవడైనావస్తానని చెప్పినాడాఏమి? తల వాకిలిచూస్తూ అలా కూర్చున్నావు? ఆ గణపతిగాడేమీ రాలేదులే! యింట్లోకి నడు!"

సరస్వతి సంధ్యాదీపం వెలిగించింది. తులసిచెట్టుకు నమస్కరించింది. గొంతులోవున్న మాంగల్యానికి కుంకుమ పట్టించుకొని రాత్రి వంట చేయడానికి మొదలుపెట్టింది. ఎందుకోగానీ, ఆనాడు ఏవేవో విషయాలామెకు జ్ఞాపకం వచ్చినై. ఆమె హృదయంలో సుషుప్తమై దాగి వున్న సరస్వతీమూర్తి యింకా ఆరిపోలేదు. కవికుల గురువైన కాళిదాసుని రఘువంశంలోని కొన్నిశ్లోకాలు ఆమెకు జ్ఞాపకం వచ్చాయి. తన పరిసరాలను గూడా సరస్వతి మరచింది. ఆమె ముఖకమలము నుండి ఆ శ్లోకాలు బహిర్గతములై తనకు తెలియకనే ఆమె పాడుకో మొదలు

పెట్టింది. ఆమె కంఠము గంభీరమై వుండినది. గాన మాధుర్యం అతిశ యిస్తూ పోయింది. ఆమె గట్టిగా పాడడానికి మొదలు పెట్టింది. ఆ కంఠ మాధుర్యానికి చకితులై దేవతలు భూలోకానికి దిగివచ్చి గుప్త శరీరులై ఆ గానాన్ని వింటున్నారు. కాళిదాసు మహాకవి కవితాత్మ పులకరించింది.

కాకులగుంపులో కోకిల బ్రదుకుతుందా ? ఎక్కడనుంచో వచ్చిన గౌరమ్మ కంఠనాదం పిడుగువలె సరస్వతిని బెదరించింది.

"ఇదేం భోగమిల్లు అనుకున్నావా యేమి ? మర్యాదస్తుల యిల్లు తెలిసిందా ? ఇంకొక్కసారి నోరుతెరచు చూస్తాను. నోటికి వాత పెడ్తాను. హద్దూ ఆజ్ఞా లేకుండా ఇరవైనాలుగు గంటలూ తననవా ?"

మరోదినం ఒంటిగా కూర్చున్న సరస్వతికి వేసరిక గలిగింది. తన పెట్టెలో వున్న రామాయణాన్ని బైటికి తీసింది. సీతావనవాస కథను చదువుతూంది. ఈ మహాపరాధానికి తగిన శిక్ష కాకపోలేదామెకు.

" ఇంకొక్కసారి పుస్తకం ముట్టుకో నీగతి చెప్తాను. చేతులు విరుగగొడ్తాను."

పతి దేవుడైన బాళప్ప భార్యకు హెచ్చరిక యిచ్చి ఆ రామాయణాన్ని కాస్తా కాల్చి వేశాడు.

ఒక సాయంకాలం గౌరమ్మ బాళప్పను కూర్చోపెట్టుకొని చెవులు పిండి, ఛీకొట్టి, నీతులు నేర్పించింది. ధైర్యం నూరిపోసింది. ఆ రాత్రి బాళప్ప కొత్త ధైర్యంతో శయ్యాగృహాన్ని ప్రవేశించాడు.

ఐదు నిముషాలలో బాళభూపదు ఏడుస్తూ బయటికి వచ్చాడు : "ఏమైందిరా బాళా ? ఏడుస్తావెందుకు ?" తల్లియైన గౌరమ్మ ప్రేమతో

వాని తల తడవి పలుకరించింది. బాళప్ప ముత్యంలాంటి ఒకటే పలుకు పలికి వూరికంతా హాస్యరస ప్రదానం చేశాడు. ఏడుస్తూనే వాడన్నాడు:

"భ...య...మౌ...తుం...ది..."

తారవ్వ బాళప్పకు దిష్టి మంత్రం తీసింది. పీర్లకు చక్కెర మంత్రం చదివించారు. వాని ముఖానికి హుళిగమ్మ బండారు పెట్టారు. హయూత్ శాస్త్రి పంచాంగం చూచి గ్రహచారం పలికాడు. ఒక సాహెబుతో తాయెత్తు గట్టించాడు. దయ్యాల రామప్ప యింటికి అష్టదిగ్బంధన చేశాడు. శంభులింగం యింటికి విభూతిని మంత్రించి బాళని ముఖానికేసి మూడు సార్లు వూదాడు. ఊళ్ళోవుండే మారెమ్మకు సేరు అన్నం పంపి గౌరమ్మ నైవేద్యం పంపింది. ఒక షష్టిపంచ, ఏడు నిమ్మకాయలూ, ఏడు రాగి వుంగరాలూ, గోకర్ణేశ్వరుని గుడి దగ్గర అమావాస్యనాటి రాత్రి పెట్టి వచ్చారు. ఇన్ని చేసినా బాళప్పకు బయటి అరుగుపై పండుకొనే ఖర్మ మాత్రం తప్పలేదు. ఒకటి రెండు రోజులు బాళప్ప ఎవరితోటీ చెప్పకుండా ఎక్కడెక్కడో తిరిగి వచ్చాడు. వాని కామానికి మితిలేదు.

ఇంట్లో బ్రహ్మచర్యం అనుష్టించడానికి బాళప్ప ఒప్పుకున్నా, గౌరమ్మ ఒప్పుకోవద్దూ...? ఆమెకీవిషయమేమీ సరిపోలేదు. అన్నివుపాయాలూ వ్యర్థమై పోయినై. కడకు గౌరమ్మ బాళప్పకు దైనిక కర్తవ్యాన్ని కంఠపాఠంగా వల్లె వేయించింది. అచ్చక్క కూడా తన యింటికి వెళ్ళిపోయింది. ఇక భయంలేదు. చెంపలమీద నాలుగు దెబ్బలు, వీపుపైన ఆరు కట్టెతో, మోకాలు చిప్పల పైన మూడు దెబ్బలు కొట్టడం బాళప్పకు నిత్యాచారమై పోయింది. రెండు తొడలూ గట్టిగా గిచ్చుతూ: "ఆ గణపతిగాడిట్లంతా చేసేవాడేమే ?" అని అడుగుతూండేవాడు. ఈ కార్యాలన్నీ జరిగడం గౌరమ్మ సన్నిధానమందే; ఆమె

అధ్యక్షత క్రిందనే. బాళప్ప క్రమం తప్పకుండా యీ పనులు నెరవే రుస్తూ వుండేవాడు. ఇంక సరస్వతికాయింటిలో దిక్కెవరు ? సరస్వతి రెండు చేతులూ కట్టుకొని, ఒక్క మాటైనా బదులు పలుకకుండా ఆ దెబ్బలు తింటూ వుండేది. ఒక రోజు తట్టుకోలేక అరవబోయింది. అప్పుడు గౌరమ్మ తానే స్వయంగా సరస్వతి నోట్లో గుడ్డలు కుక్కింది.

"వేయరా బాళా ! ఆ కట్టెతీసుకోని ?"

గౌరమ్మ కొడుకును ప్రేరేపించింది.

"మాతృదేవోభవ" బాళప్ప తల్లియాజ్ఞను అక్షరక్షరమూ పాలించాడు. ఆమె చెప్పినదానికంటే, రెండుదెబ్బలు ఎక్కువగానే గానీ - తక్కువమాత్రం బాళప్ప కొట్టి ఎరుగడు.

సరస్వతికి ఊపిరాడలేదు. నేలపైపడి విలవిల తన్నుకుంటూంది. వీపుకు గురిచూచిన బాళప్ప కట్టెవేటు సరస్వతి తలకు తగిలింది. ఒకటే దెబ్బకు సరస్వతి స్మృతితప్పి పడిపోయింది.

అనేక దినములనుండీ యిలాంటి సుసమయానికి కాచుకొని ఉన్న బాళప్ప, యీ అవకాశాన్ని జారవిడుస్తాడా ? గౌరమ్మ బయటికి వెళ్ళి పోయింది. బాళప్ప వాకిలి వేసుకున్నాడు....

అచ్చక్కకు సరస్వతి గర్భంతో వున్నదని కాయితంవచ్చింది. ఈవార్త వినడానికే సాధారణంగా లోకంలో తల్లులుకాచుకొనివుంటారు. ఈ వార్తవినడానికి నూరారుదేవతలకు దీపాలు వెలిగించి కొలుస్తారు. కానీ యిదేవార్త అచ్చమ్మకు హృదయవిదారకంగా వుంది. ఆ జాబామెకు క్రొత్త వేదనను కలిగించింది.

సరస్వతి గర్భవతి యైనదనివచ్చిన జాబుకంటే సరస్వతి చచ్చె నని జాబు వచ్చివుంటే - అచ్చక్కగుండెకీ వేదనకలిగేది గాదు.అచ్చమ్మ

దుఃఖమునకు మేరలేదు. ఆమెగతి కయ్యో అనేవారులేరు. కైవట్టిన మగడు కన్నుమూసినాడు. కన్నతండ్రి యేమైనాడో ఆయనజాడేతెలీదు. కుమారునితో సమానుడైన గణపతి దూరదేశములో వున్నాడు. తాను ఒంటిగానే యీలోకానికి వచ్చింది. ఒంటిగానే తిరిగి పోతుందికానీ ... జీవితంలో పలుకుతోడుకైనా ఒక మనిషి వుండొద్దూ!...

ఒకనెల గడిచింది. గౌరమ్మనుండి రెండోజాబు వచ్చింది. ఆజాబు సర్కారుతాకీదులా వున్నది. " మొదటి కాన్పుయొక్క ఖర్చులన్నీ పుట్టింటి వారే భరించాలి. కనుక యీజాబు చూచినతక్షణం అచ్చమ్మ వచ్చి బిడ్డనుపిలుచుకొని పోవలసింది.అలాచేయకపోయినట్లైతే సరస్వతికి కలిగే కష్టనష్టాలకు తానుగానీ, తనకొమారుడు బాళరాజుగానీ కారణ భూతులుకారని ఆజాబులోని సారాంశము.

సరస్వతికి తొమ్మిదిమాసాలు నిండినై. ఆమెతనరక్తాన్ని పంచుకొన్నది. తానామెనెన్నో సారులు ముద్దాడినది. పోషించినది. ఆమె దేహమనస్సులను తాను వృద్ధిపొందించినది. ఆమె కన్నూ, ముక్కూ, చెవులూ చూచి ఎన్నియోసారులు తనలోతాను మురిసిపోయినది. కాని నేడు తనబిడ్డ తనయింటికి వస్తున్నదంటే, అచ్చక్కకు యిష్టంలేదు. ఆమె గౌరమ్మజాబునకు బదులు వ్రాయలేదు. సరస్వతి తనబిడ్డయేకానీ, బాళని భార్య. ఆమె ధరించిన గర్భం బాళవృకుచెందినది. ఈ రెండువిషయాలూ, అచ్చక్క దేహాన్నీ మనస్సునూ, కాల్చి వేయదగినంతటి వేదనలు.

" తనకెవ్వరూలేరు. సరస్వతికి మాత్రమెవరున్నారు? కష్టములలో నున్న తనకు, చిత్తశాంతినొసగు వారెవ్వరును లేరనిమాత్రమే అచ్చమ్మ చింత. సరస్వతికున్నవి రెండు చింతలు. ఆమెకాత్మశాంతి యొసగు

వారెవ్వరును లేరుకానీ, అశాంతిని గూర్చువారు మాత్రమనేకులు ఉన్నారు. మరి యిట్లున్నప్పుడు తనబిడ్డనుతాను బహిష్కరించడం ఎందుకు? ఇదితన అవివేకమేగదా! అచ్చమ్మ మనస్సులో రేగుచున్న ఆలోచనలలో యిదియొక ధార.

ఇక ఎప్పుడేగానీ, గౌరమ్మ యింటిలో కాలుపెట్టరాదని అచ్చమ్మ నిశ్చయించుకొని తిరిగివచ్చినది. ఈపట్టుదలను సడలించుటకు మాత్రము అచ్చమ్మ కిష్టములేదు. సరస్వతి కోసరమేమి? దేవతలుకోరినా ఆమె గౌరమ్మ యింటిలో అడుగుపెట్టదు. ఉన్నట్లుండి ఒకనాడు, అచ్చమ్మ ప్రత్యుత్తరము మాత్రము వ్రాయించినది.

ఏకాకిని యైన సరస్వతి బండిలోనుండి అచ్చమ్మ యింటిముందు దిగినది. బ్రహ్మానందశాస్త్రి మరణించిన నాటినుండి ఆయింటితలవాకిలి యెప్పుడూ వేసివుంటుంది. సరస్వతి కష్టంతో తలవాకిలిని త్రోసికొనిలోన ప్రవేశించింది.

స్తంభానికానుకని కూర్చున్నతల్లి ఏమ్మని సరస్వతిని పిలువలేదు. బాగున్నావా! అని అడుగలేదు. తల్లివాలకాన్ని సరస్వతి గమనించింది. కాని ఆదుఃఖాన్ని ఏ మాత్రమూ తోపనీయక శాంతంగా వచ్చి ఆమె తల్లికి నమస్కారంచేసింది.

"ముత్తైదువుకమ్మ! సావిత్రివిగమ్మ! మొగవాడు పుట్టనీ!" యిత్యాది వాక్యాలతో లోకంలో తల్లిదండ్రులు కన్నకూతుండ్లను ఆశీర్వదించడంకద్దు.

ఈ మాట ఒక్కటిగూడ అచ్చమ్మ కంఠంలోనుంచి వైటికి రాలేదు. ఆమె నిశ్శబ్ధంగా బెల్లంకొట్టిన రాయిలా కూర్చొనివుంది.

తల్లిభావాన్ని తెలిసికొనడానికి సరస్వతికెంతో కాలంపట్టలేదు. తానే తనదేహాన్ని ద్వేషిస్తూన్నది సరస్వతి. తల్లి కూతుంద్రమధ్య కుశలప్రశ్నలు యిలా ఆరంభమయ్యాయి.

" ఇంకా బతికే వున్నావేమమ్మా సరస్వతీ! "

" చావురాలేదు : అందుకే బతికున్నాను. "

" ఇద్దరికంఠాలనుండీ ఒకసారే దుఃఖం పెగిలిపైటికి వచ్చింది. ఒకరినొకరు కౌగలించికొని బావురుమంటూ ఏడ్వడం మొదలుపెట్టారు. ఇక ఏడ్పు చాలించమనడానికి మూడవ మనిషివుంటేనా? తల్లీ - కూతురూ యిద్దరూ దుఃఖ సముద్రంలో ఉత్తాలంగా మునకలు వేశారు. ఏడ్చి ఏడ్చి చేతగానప్పుడు లోలోననే కుములుకున్నారు. కుమిలి - కుమిలి ఏడ్చి అదీచేతగానప్పుడు చచ్చినవారివలె పడిపోయారు.

ఇద్దరికీ అన్నం కాబట్టలేదు. ఒకరినొకరు కౌగలించికొని కూర్చున్నట్లే పండుకున్నారు. తెల్లవారింది.

●

## ౨౨

గడచిన రాత్రి అచ్చమ్మ బిడ్డ మొగాన్ని అంత చక్కగా గమనించలేదు. తెల్లవారిన తరువాత సరస్వతిని చూచిన అచ్చమ్మకు ప్రాణాలు యెగిరిపోయాయి.

శరీరమంతా బక్క చిక్కి పోయింది. ముఖంపైన యెముకలు యేర్పడ్డాయి. గడ్డము ముందుకు వచ్చింది. మొగమునిండా ముక్కే కనపడుతూ వుంది. కన్నులలో కాంతులు మందగించాయి. సరస్వతి ముఖం పైన ఆడుతున్నది ప్రేతకళ.

"నీవు భోజనం చేసి యెన్నాళ్ళయిందమ్మా !, చాలనిదానికి యీ వైభవాన్ని గూడా దేవుడు ఎందుకిచ్చాడో ?"

సరస్వతి ఊరికే తల ఆడించింది. తల్లి అడిగిన రెండో ప్రశ్నకు సమాధానం యివ్వవలెనంటే - ఆ దినమంతా చెప్పదగినంత విషయం వుంది సరస్వతికి. ఆ విషయాన్ని తలుచుకుంటే సరస్వతి గుండె కదలాడుతుంది. తల్లితో తన గొడవంతా వెళ్ళబోసుకుందామని ఆమె మనోవేదన. కానీ తల్లికి గూడా చెప్పుకొనే ధైర్యం లేదు సరస్వతికి.

జీవనం ఎంత కాబట్టకపోయినా ప్రతిదినమూ మరణానికి స్వాగతం యిస్తూవున్నా బతకడమే జీవితంలోని రహస్యం ! చావు

తానై వచ్చేవరకూ బ్రతికి తీరవలసిందే ! జీవిత మెంత అరుచికరమైనా అనుభవించ వలసిందే !.

"తలపైన కొంచెం నూనె పెడ్తాను. ఎన్నాళ్ళయిందో తలకు పోసుకొని......"

పీటవేసి సరస్వతిని తల్లి పిలిచింది. బిడ్డ పీటపైన కూర్చుంది. తల్లి అంటే టప్పుడు బాధతో "అమ్మా" అంటూవుంది బిడ్డ.

"తలనిండా వాపులు ఎక్కడివే సరస్వతీ !"

అచ్చక్క తలంటు నిలిపి అడిగింది.

"ఏమీ లేదు. స్నానపు గదిలో అడ్డపెట్టె తలకు తగిలింది, అంతే !"

సరస్వతి ఏమీ అనుమానించకుండా మాతృదేవితో అబద్ధం చెప్పి వేసింది. ఆమె అబద్ధం చెప్పడం ఇదే మొదటిసారి. మొదటి అబద్ధం తల్లితోటే చెప్పింది. తల్లి మనసుకు కష్టం కలగరాదని ఆమె ఆశ !.

కాళ్లూ - చేతులకూ అచ్చక్క నూనె రాసింది.

"ఇదేమే సరస్వతీ ! మోకాళ్ళ నిండా గాయాల గుర్తులు ?."

"ఔను ! వంటింట్లో అడ్డపెట్టె తగిలింది."

"ఒంటినిండా గాయాలే! ఇవన్నీ ఎవరి ప్రసాదమమ్మా ? మగని ప్రసాదమా? లేక అత్తగారు అనుగ్రహించినవా ?"

సరస్వతికి దుఃఖం ఆగలేదు. సత్యాన్ని దాచుకోలేక పోయింది. వెక్కి వెక్కి యేడ్చింది.

"చెప్పవమ్మా సరస్వతీ ! యీ దెబ్బలెవరివి ?" ఏడుస్తూనే అడిగింది తల్లి.

సరస్వతి యేడుస్తూనే జవాబు చెప్పింది: "ఇద్దరివి".

తల్లీ పాతురూ "గోడు" మని మెప్పుకున్నారు. ఆ మెప్పులో తాను గర్భముధరించిన వృత్తాంతాన్నిగూడా బిడ్డ తల్లికి చెప్పివేసింది. గర్భవతియైన సరస్వతి పుట్టినింటికె వచ్చిన వృత్తాంతం ఊరికంతా తెలిసింది.

"నిన్న వచ్చిందట సరస్వతి! మాకెందుకమ్మా తెలుపలేదు!"

"ఎన్నినెలలమ్మా! సరస్వతమ్మా!"

"మళ్లీ యీకడుపులో బ్రహ్మేశ్వరస్వామి పుట్టబోతాడు."

"వేకటి మనిషి యిట్లుందేమమ్మా! ఒళ్లంతా చిక్కిపోయింది? ఆ గౌరమ్మ అన్నమన్నా పెడుతూవుండెనా, లేదా?"

"పాపం! గణపతిని పిలిపించండమ్మా! చెల్లెలంటే ప్రాణం వాడికి. గణపతి యెప్పుడువస్తాడు?"

జనవాక్యాలు ఎన్నో! వాళ్లసూచనలు గంపెడు. పోషణలోకొంత యేమీలేదు. కానీ దినదినానికీ సరస్వతి చిక్కిపోతూవుంది. ఒకటి గాకుండే మరొక్కరోగం. తొడలనొప్పులు. కాళ్లు పీకుతున్నాయి! కన్నులలోవాపు. మధ్యాహ్నం పగడకాయలఆట ఆడడానికి వచ్చినకోమటి సుబ్బక్క యిలాఅన్నది.

"అప్పక్కా! యిదేమి? యెవరన్నా నవ్వేరు? మొదటి కాన్పు వేకటి మనిషి యిలాగేనావుండేది? ఇలావుంటే సరస్వతి మనిషై పారా దేదేమొంది? కాసంతన్నా బలంలేదు. ముఖమంతా పాలిపోతూవుంది. మన వైద్యం శ్రీకంఠశాస్త్రిలను పిలుచుకొని వస్తాను" అంటూనే సుబ్బమ్మ కదిలింది.

బ్రహ్మానందశాస్త్రి బిడ్డకు అనారోగ్యంగా వున్నదనే విషయం చెబుతూనే శ్రీకంఠశాస్త్రి పరుగెత్తి వచ్చాడు. ఆయన రోగిని చాలాసేపు పరీక్షించి నోరుతెరవమన్నాడు. వైద్యునికి నోటమాటరాలేదు.

“ నీవు నావెంటరావమ్మా సుబ్బక్కా ”

శ్రీకంఠశాస్త్రి బయటికి సాగిపోయాడు. తలవాకిలి దాటుతూనే శ్రీకంఠశాస్త్రి యిలా అన్నాడు:

“ ఔషధం యిద్దరూ తీసికోవాలి. మొగుడూ పెళ్లామూకూడా!”

సుబ్బమ్మకు యేమీ అర్థంకాలేదు. శ్రీకంఠశాస్త్రి మొగం వైపు చూచింది.

“ ఇది పతిదేవుని ప్రసాదం. ”

సుబ్బక్క అచ్చమ్మ దగ్గరకువచ్చి నిలిచింది. గట్టిగానిట్టూర్చిలేచిన అచ్చక్క వంటింట్లోకి వెళ్లి చేతులు జోడించి దేవుని ముందు నిలుచుంది.

“తొందరగా నాబిడ్డకు మరణాన్ని ప్రసాదించవయ్యా ”

పాపం! అడుగుతూనే యితరులకు చావుపుట్టుకల నిచ్చే శక్తి వుంటే, వాడెందుకు గుళ్ళో రాతిబొమ్మవై కూర్చుంటాడు?

దినాలు గడచినై. సరస్వతి రోజుకు రోజుకూ క్షీణిస్తూ వచ్చింది. లేచి పొరాడడానికిగూడా ఆమెకు కష్టమైంది. ఎప్పుడూ యింట్లోనే కూర్చుని వుంటుంది. తాను ముందాయింట్లో పడుకున్న స్థలమూ తనకు గణపతి పాఠముచెప్పిన చోటూ చూడడం - యేడ్వడం - ఇది ఆమెకు నిత్యకృత్యమై పోయింది.

ఒకరోజు ప్రక్కవూరినుంచి అంబణ్ణ సరస్వతిని వెతుక్కుంటూ వచ్చాడు. అంబణ్ణ బ్రహ్మానందశాస్త్రికి ఖాతాశిష్యుడు. తాను నాటకంలో

ద్రౌపదివేషం కట్టాలంటే దాన్ని ప్రాక్టీసు చేసే అన్నినాళ్లూ అంబణ్ణకు నివాసం శాస్త్రిగారింట్లోనే. బ్రహ్మానందశాస్త్రిగారే అంబణ్ణకు పాటలు నేర్పించాలి. మాటలు చెప్పించాలి. ఆటరోజురాత్రి " అంబణ్ణ "కు చీర గూడా శాస్త్రిగారే కట్టేవారు. అప్పటికి సరస్వతి యింకాచిన్నది. ఆమె పండుకునే వరకూ అంబణ్ణ మెడపైవేసుకొని జోకొట్టేవాడు.

ఇంట్లోకి అంబణ్ణ అచ్చక్కపై కోపంచేసుకొంటూనే ప్రవేశించాడు:

"సరస్వతిని ఇంట్లోనే దాచిపెట్టుకున్నావుగదమ్మా! ఆమె వస్తూనే నాకు చెప్పిపంపవద్దూ ? రావమ్మా ! బైటికిరా సరస్వతీ, నీమొగ మెలా వుందో కొంచెంచూడనీ !"

అంబణ్ణ నవ్వుతూనే సరస్వతిని పిలిచాడు.

"అయ్యో ! ఇలా చిక్కిపోయిందేమమ్మా !"

సరస్వతి అంబణ్ణ ముఖంపైన ఆడుకొన్న పిల్ల.

"నీకూ తల వణకుతూవుందిగదూ అంబణ్ణా అప్పుడే !" సరస్వతి అడిగింది.

"అప్పుడే ! బాగా అడిగినావమ్మా ! తల వణకడానికి ఆరంభించి పదిసంవత్సరాలైంది. ఇంకెన్ని దినాలు వొణుకుతుంది చెప్పు ? దానికీ కాలమై పోతూవుంది. ఆ చెయ్యిలా తేవమ్మా సరస్వతీ ! ఒక నాలుగు గాజులు తొడుగుతాను."

ఒద్దు ఒద్దంటున్నా బలవంతంగా అంబణ్ణ సరస్వతి చేయి పట్టుకున్నాడు.

"కుంకుమా - గాజులూ ఎవరన్నా వద్దంటారేమమ్మా పిచ్చిదానా? వేకటి మనుషుల చేతిలో పచ్చగాజులు వుండి తీరాలి. అదిలక్షణం."

అంబణ్ణ సరస్వతి చేయిపట్టుకొని పసుపు కుంకుమతో పాటు, తెచ్చిన గాజులను ఆమె చేతికి ఎక్కిస్తున్నాడు. తలవాకిటిలో కాలి చప్పుడు. సరస్వతి తలయెత్తి చూచింది. బాళప్ప: "లోపలికి రాండి" అని తల ఆడించి సరస్వతి సైగ చేసింది.

" అమ్మయ్యో ! మొగవాని చేతిలోకి చేయిచ్చి, గాజులు తొడిగించు కోవడమా? "

అడవిమృగంలా బాళప్ప హుంకరిస్తూ సరస్వతిని పుట్టచెంపుపై కాలితో ఒకసారి బలంగా జాడించాడు.

"అమ్మా".... అరుస్తూ సరస్వతి నేలపై పడ్డది. తలవణకుతూ వుండేవృద్ధుడు అంబణ్ణకు దిక్కుతోచలేదు. ఆయనతలపై పిడుగుపడ్డట్టు యైనది.

"అయ్యో ! పుణ్యాత్ముడా ! ఎవరప్పా నీవు ? సరస్వతిని తన్నిన నీకాలిని పాముకరుస్తుందిలే! "

ఎనభై సంవత్సరాలు జీవించిన అంబణ్ణను ఒకరుగూడా యింత వరకూ వ్రేలుచూపి చెప్పినవారులేరు. కన్నుతెరచి ప్రపంచంలోకివచ్చిన ప్రతిశిశువునూ అంబణ్ణ తనసొంతబిడ్డవలె చూచేవాడు. ఆయన దృష్టిఅంత పవిత్రమైనది. అందులోనూ సరస్వతిఅంటే వానిపాలిటిదేవత.

అంబణ్ణ కళ్ళనిండా నీరుపెట్టుకున్నాడు. వానిహృదయం దహించుక పోయింది. సరస్వతిని ఎత్తి కూచోపెట్టడానికి చెయ్యిచాచాడు. బాళరాజు ముఖమంతా చిట్లించుకొని యిలా గద్దించాడు:

" నాపెండ్లాన్ని తాకుతావా ? ముసలిముండాకొడకా ! కదులు, లేకుంటే చేతులు విరుగగొట్టుతాను."

" అయ్యో ! నాబోరా ! కావలసిఫుంటే, నాలుగుదెబ్బలు నన్ను తన్నవయ్యా! పచ్చిమనిషి ఆమె గర్భంలో బ్రహ్మప్పవచ్చి కూర్చున్నాడు. విష్ణువునుకొట్టిన భృగువువలె ఆ పిండాన్ని కొట్టినావుగదయ్యా! సరస్వతిని నేను ముట్టుకుంటే ఏమితప్పుంది స్వామీ ! ఆపిల్ల నామోకాళ్ళ మీద పడుకొని నిద్రపోయింది. నా యెదపైన ఆడుకొంది. అచ్చమ్మకు శరీరం జబ్బుచేసినప్పుడు సరస్వతి నాభుజాలపై నిద్రపోయింది. ఆమెకు లాలి గట్టి నేను వూపాను. ఆమెముఖంపైన ముద్దులుపెట్టాను. నేను ముట్టు కున్న బిడ్డలంతా నాకు తల్లుల్లాంటివారే !"

" నోరుమూసుకోని నడు "

ఏదోపనికి పక్కంటికి పోయిన అచ్చక్క యింతలోనే యింట్లోకి వచ్చింది. జరిగిన అన్యాయాన్నంతా ఆమె అర్థంచేసుకుంది ఆమె పల్లెత్తు మాట పలుకలేదు. మెల్లిగాచేయిపట్టుకొని సరస్వతిని చాపపైకి తీసుకొని వెళ్ళింది.

అంబణ్ణ పిచ్చిమొగం వేశాడు. వానితలపై పిడుగు పడినట్లైనది "చిన్నపిల్లల కష్టాలూ బాధలూ చూచుకుంటూ యింకా యీప్రపంచంలో బ్రతకడానికంటే, తొందరగా నాకు చావురాగూడదా!" గొణుక్కుంటూ బయటికి పోయాడు.

కోపంచేసుకున్న బాళప్పమూర్తి మూడు పంకలుపెట్టి నడవలో కూర్చున్నాడు.ఆతిథ్యమిచ్చి - తమ్ముడని ప్రేమించి - అల్లుడనిగౌరవించి వానికోపం శాంతించడానికి నూరుమాటలు పలికి ఓదార్చేచైతన్యం అచ్చక్క కెక్కడుంది కనుక?

స్మృతితప్పి పడిపోయిన సరస్వతిని చాపపైన వదలిపెట్టి అచ్చక్క వంటింట్లోకి వెళ్ళింది. దేవునికి నమస్కరించి యిలా అన్నది:

"మూర్ఛలో మునిగిన యీ సరస్వతి కిలాగే దీర్ఘనిద్ర దయచేయ వోయీ భగవంతుడా! నన్ను యీ లోకంనుంచి తొందరగా తీసుకొని పోయి పుపకారంచేయి."

అడిగిన వారికంతా అడిగినట్లుగా చావును దేవుడు ప్రసాదించ గలిగితే, యీ భూలోక మెన్నడో వట్టిపోతుంది. జగన్నాటక సూత్రధారి యైన ఆయన నాటకానికి కావలసిన వేషధారులే లేకపోతారు. మరణం అంత సులభంగా దొరకే పదార్థంకాదు. "చచ్చేవరకూ బ్రతుకు"- యిదే భగవంతుని శాసనం.

మామూలు ప్రకారం కోమటి సుబ్బక్క భోజనంచేసి తాంబూలం వేసుకుంటూ అచ్చక్క యింట్లోకి వచ్చింది. వాకిటిలోనే దర్శనమిచ్చాడు బాళప్ప. వాణ్ణిచూచి మనస్సులోనే తిట్టుకుంది సుబ్బక్క.

"ఇంతలోనే వచ్చాడు శనిముండాకొడుకు"

"ఎందుకమ్మా సరసీ! పండుకున్నావు?"

సుబ్బక్క హెచ్చరించింది. సరస్వతిని చూచిన సుబ్బక్కకు ప్రాణాలెగిరి పోయినై. కోమటి సుబ్బమ్మ కంఠధ్వని విని, అచ్చక్క దేవునిఅరుగు దగ్గరినుంచి బయటికి వచ్చి జరిగిన కథను సంక్షేపంగా తెలిపింది.

" బాగచేసినాడులే శని. ఇంతగుడ్డకాల్చి సరస్వతి ముక్కుదగ్గర పెట్టు స్పృహవస్తుంది. నేనిప్పుడేవస్తాను "

కోమటి సుబ్బక్క అచ్చక్క విషయంలో యింత పట్టుకొని పారాడడానికి కారాణం ఆమెకు వీరిపైనున్న ప్రీతివిశ్వాసాలే! సుబ్బక్క నిమిషంలో పోయి మంత్రసానిని తీసుకొని వచ్చింది.

సందర్భజ్ఞానంలేని వాళప్ప యింకా అలానే కూర్చొని వున్నాడు. ఒక్క అంగుళమన్నా కదలలేదు.

మంత్రసానికొంచెం కోపగత్తె. ఆమె ఎదురుగా కూర్చొనివుండే వాళప్పను చూచి యిలా గదరించింది:

"ఎవడు వీడు, యీలా కూర్చొనివున్నాడు? ఇంత మాత్రంగూడా తెలీదా? లేచిపో బయటికి!"

ఆ పురుషాకృతి ఆ యింటికి అల్లుడనేవిషయం సుబ్బక్క కను సైగతో దానికి తెలిపింది. మంత్రసాని వాళప్పను బయటికి తోసి వాకిలి వేసింది.

"శిశువు అడ్డంగాపడ్డది. పెద్ద ప్రాణానికే ప్రమాదం. తొందరగా ఆస్పత్రికి చేర్చండి." మూడుమాటల్లో వున్నవిషయాన్నంతా చెప్పివేసి మంత్రసాని వెళ్ళిపోయింది.

బ్రతుకగోరే వారికి ఆస్పత్రి.

అచ్చక్క కీకథలే కాబట్టలేదు. సుబ్బక్కను మెల్లిగా బయటికి దాటించి సరస్వతివున్న గదికి చిలుకుపెట్టి స్వస్థంగా పండుకుంది.

## ౨3

మార్గశీర్ష మాసము. శుక్లపక్షము. దశమి. రాత్రి సుమారెనిమిది గంటలైనది. చంద్రుడింకా మబ్బుతెరల వెనకాలే దోబూచు లాడుతున్నాడు.

ఒక అపరిచితుడైన వ్యక్తి అచ్చక్క యింటిముందు రెండు మూడుసార్లటూ, యిటూ తిరిగాడు. ఆ యింటివాకిలి తలుపు వేసివుంది. దానితో అతడు అనుమానించి అక్కడ నిలుపకుండా ముందుకు సాగాడు. పుష్టమైన కాయమూ, నిండుముఖముపై దండిగా పెరిగిన మీసమూ, గడ్డమూ ఎన్నడూ దువ్వకపోవడంతో చెదరు చెదరుగా వున్న జుట్టూ, విశాలమైన నుదిటిపై నిర్మలంగా ప్రకాశిస్తూండే విభూతీ, కను బొమ్మల మధ్య నిగనిగలాడే కుంకుమబొట్టు కట్టుకొన్న పంచ తప్పితే శరీరంపై రెండోవస్త్రం లేదు. వక్షస్థలంపై తెల్లగా యజ్ఞోపవీతంమాత్రం ప్రకాశిస్తూ వుంది. చేతిలో జోలె. ఆ అక్షయపాత్ర సమస్త ప్రపంచాన్నీ కాచి రక్షించేశక్తిగల అన్నపూర్ణ. ఆ బహ్మచారి కన్నుల్లోని తేజస్సూ, ముఖంలో కనపడే ప్రతిభా అత్యాశ్చర్యకరంగా వున్నాయి.

ఆ బాలసన్యాసి వూరంతా యింతకుముందు పరిచయమయినట్లు ఏమాత్రం జంకుగొంకులు లేక వీథుల్లో నడచివెళ్ళాడు. 'జైశివే' అంటూ నగరేశ్వర దేవాలయంలోకి అడుగుపెట్టాడు. సాయంకాలపు హారతి

ముగిసిపోయింది. ప్రసాద వినియోగంకూడా జరిగింది దర్శనానికి వచ్చిన వారు యిండ్లదారిపట్టారు.

"నగరేశ్వరుని మూర్తి చాలా బాగుందప్పా. ఆ మీసాలూ, ఆ కిరీటమూ, హారతి జరిగేటప్పుడుండే ఆ తేజస్సూ. చూస్తూనే మనస్సుకు ఆనందమౌతుంది" ఒక యువకుడన్నాడు.

మధ్య వయస్సులో వుండే వేరొక అయనిలా వుత్తరమిచ్చాడు:

"పోయింది ఆకాలం. నగరేశ్వరుని హారతిని నీవు ఆనాళ్ళలో చూచివుంటే యేమనే వాడివో! శంకరదీక్షితులనే ఒక మహానుభావుడుండే వాడు. ఆయనపాండిత్యమూ, వాగ్ధురీ, తపోబలమూ - శివశివా! అవి అసామాన్యములు. ఆ సింహం కడుపులో ఒక మహాసింహమే పుట్టింది. ఆ పిల్లవానిపేరు గణపతిదీక్షితులు. సాక్షాత్తు సరస్వతి, ఆ బ్రహ్మచారి నాలుకపైన నట్టువలు త్రొక్కుతూండేది.

ఈ మాటలు వినీ విననట్లు బాలసన్యాసి ముందుకుసాగాడు.

"ఇంకొక పుణ్యాత్ముడుండేవాడు. గడచిన సంవత్సరమే ఆయన మరణించాడు. ఆయనపేరు బ్రహ్మానందశాస్త్రి. గణపతిదీక్షితుల పెంపుడు తండ్రి ఆయన. ఆయనవంటి అవధూత ముందుపుట్టలేదు. ఇకముందు పుట్టబోడు. వారంతాచావును జయించారు. సంకల్పసిద్ధులు" మంత్ర బంధితునివలె నిలుచున్న ఆబాలసన్యాసి కంటినిండా నీరు పెట్టుకొని, యీ సంభాషణము వింటూనిలబడ్డాడు. ఎడమచేత నీరు తుడుచుకొని గబ గబా గుడిలోకివెళ్ళాడు.

" వారంతా ఎక్కడకు పోయినారు స్వామీ !" ఇంకొకయువకుడు కుతూహలంతో అడిగాడు.

"ఆ వృద్ధు లిద్దరూ గతించారు. గణపతిదీక్షితు లెక్కడో వెళ్ళి పోయాడు. బ్రహ్మానందశాస్త్రి బిడ్డ సరస్వతి. ఆమె జీవితం అవివేకియైన మగనికి ఆహుతియైపోయింది. ధాన్యంవంటి మహాత్ములంతా గతించి పోయారు. పొట్టువంటి మేము మిగిలినాము. ఈశ్వరేచ్ఛ."

కన్నీరును తుడుచుకుంటూ అందరూ యిండ్లకు వెళ్ళిపోయారు. అర్చకుడు నందా దీపంలో కొంచెం నూనె పోశాడు. వత్తి కొడిని సరి చేశాడు. గర్భగుడికి బీగంవేసి ఆయనగూడా యింటికి పోయాడు. గుడి లోకి వచ్చిన బ్రహ్మచారిని ఎవ్వరూ గమనింపనట్లే అర్చకుడు కూడా గమనింపలేదు.

బ్రహ్మచారి గుడికి ప్రదక్షిణం చేసి, దీర్ఘదండ నమస్కారాలు చేశాడు. గర్భగుడి తలుపులోనుంచి, నగరేశ్వరుని దర్శనమును చేసు కొన్నాడు. మనసార నమస్కరించికొన్నాడు. కండ్లుమూసికొని ఆ గర్భ గుడి ముందు కూర్చొని ధ్యానముద్రలో లీనమై పోయాడు. పదినిమిష ములు గడిచాయి.

"ఇంటికిపో ! గణపతీ...నేను సర్వాంతర్యామిని."

ఈమాటలు గణపతిచెవిలో స్పష్టంగా వినపడ్డవి. వెంటనే లేచి చేతులుజోడించి వాల్బ్రహ్మచారి యింటితట్టు దారిబట్టాడు. తలవాకిటిలో అడుగుపెడుతూనే శిశువుఏడుపు వినపడ్డది. బ్రహ్మచారి కాశ్చర్యమైనది. ఇది యెవరి యిల్లో అనుకొని మరలా ఒకసారి పరీక్షించాడు. ఆ యిల్లు

బ్రహ్మసంపత్కార్తి లదే. అచ్చక్కదే! తనచెల్లెలు సరస్వతి పారాడిన యిల్లే అది. అదే తనయిల్లు.

బ్రహ్మచారికి ధైర్యం వచ్చింది. అతడు నేరుగా యింట్లోకి వచ్చాడు. వేకటిమనిషిగదిలోంచి అచ్చక్క బయటికి వచ్చింది. తల్లి రూపమూ, వేషమూ మారాయి. కాని, అంతమాత్రంతో కొడుకుకు గుర్తు చిక్కకపోతుందా? 'జైశివే' అంటూ గణపతి అచ్చక్కకు నమస్కరించాడు. హఠాత్తుగావచ్చి తనకు నమస్కరించిన బ్రహ్మచారిని చూచి ఆమె చకితురాలైనది. అచ్చక్క ఆ క్రొత్తవానిని నఖశిఖ పర్యంతం ఒక్కసారి చూచింది.

"నేనమ్మా! నీకొడుకు గణపతిని!" అతడు నమస్కరించి లేస్తూ అన్నాడు.

"క్షేమమేనా తల్లీ?"

"ఉన్నాను చూడప్పా యీ అవతారంతో!"

"అవతార మేదైతేనేమి? కుమారునికి తల్లి తల్లియే!"

"నీవేమి గణపతీ, యిలా మారినావు?"

"చెల్లెలు సరస్వతి...."

"కాళ్ళూ - చేతులూ కడుగుకొని లోనికి రా! సరస్వతి ప్రసవించి మూడు రోజులైనది."

"ఏం శిశువు?"

"మగపిల్లవాడు."

"అయితే బ్రహ్మానందస్వామి నాకు పునర్దర్శన మిచ్చాడిన్న మాట ;"

నీళ్ళింటిలోకి పోయి కాళ్ళూ - చేతులూ కడుగుకొని వచ్చాడు. అచ్చక్క పురిటింటిలోకి గణపతిని తీసుకొనివచ్చింది. సరస్వతి నిద్రిస్తూ వుంది. ఆమె ప్రక్కలో నవ్వుతూన్నాడు శిశువు.—

" పిల్లవాణ్ణి నేను ముట్టుకో వచ్చునేమమ్మా ? ఇంకా సరస్వతికి వృద్ధిస్నానం కాలేదుగదా !"

ఆ శిశువును తాకి ముద్దిడవలెననే ఉత్కటమైన యిచ్ఛ బ్రహ్మ చారి మనస్సులో ! ఆకోరికను అచ్చక్క కనిపెట్టింది.

" ముట్టుకోనాయనా కావలసివస్తే అందులో యేముందికనుక ? అవధూతలైన బ్రహ్మానందులకు నీవుకూడా ఆధ్యాత్మిక పుత్రుడవేగదా ? మీదంతా అవధూతజాతి "

మూడుదినముల వయస్సుగల శిశువును గణపతిమెల్లిగా చేతుల్లోకి తీసుకున్నాడు.

" సంవత్సరం కిందట నన్ను ఎదలిపెట్టి పోయినారు. ఈనాడు మరలా వచ్చినారుగదూ ! మీదర్శనంలేక ఒక వర్షం గడిచిపోయింది. నుదురూ, కాలూ, కన్నూ, చెవీ, గడ్డమూ, ప్రేళ్ళూ - సాక్షాత్తూ బ్రహ్మా నందస్వామిగారేనమ్మా !"

" ఔను "

అచ్చక్క కంఠధ్వనిలో అదేమికో వుత్సాహంలేదు. బ్రహ్మా నందులను ఎత్తుకొని గణపతి బ్రహ్మానందాన్ననుభవిస్తూన్నాడు. అచ్చక్క లోని నిరుత్సాహాన్ని అతడు గమనించనే లేదు.

" నీసుమారునితో మాట్లాడవయ్యా ! "

గణపతి శిశువు చెక్కు_గీయుతూ అన్నాడు. ఆ పిల్లవాడు బోసి నోరు తెరచినవ్వాడు.

"అమ్మా"

గణపతి కంఠధ్వనిలో కాతరభావం ఆవరించుకొంది. ' ఏమి గణపతీ '

బయట నిలుచున్న అచ్చక్క యింటిలోనికి వచ్చింది.

" కండ్లూ ?''

'' అవునునాయనా"

" గ్రుడ్డి "

" రెండుకండ్లూ గూడా "

" శిశువు కండ్ల కేమైనదమ్మా"

" ఏముకావాలి : పుట్టుకలోనే వాడట్లు పుట్టినాడు. రెండుకండ్లూ లొట్టలు. వానికీ జన్మలో కంప్లులేవు."

'' ఇలా యెందుకైనది?''

" కొడుకుకు తండ్రియిచ్చిన బహుమానం''

సరస్వతికి హెచ్చరిక గలిగింది. ఆమె గాబరాగా అన్నది " ఎవరది ఎవరది ... బిడ్డను"

గణపతి మెల్లిగా శిశువును సరస్వతి పక్కలో పడుకోబెట్టాడు.

"నేనమ్మా గణపతిని"

"ఓ ! గణపతి"

సరస్వతితో రెండుమాటలు మాటలాడి, గణపతి నట్టింటిలోకి నడచాడు. అచ్చక్కతో అన్నాడు:

"రేపు తంత్రిగారి ఆబ్దికము"

"జ్ఞానౌను"

"అందుకే వచ్చానమ్మా ! నగరేశ్వరుని దేవాలయములోనే చేస్తాను."

"మంచిది నాయనా"

గణపతి తిరిగివచ్చి ఆ రాత్రి దేవాలయంలోనే పడుకొన్నాడు. రాత్రంతా వానికి నిద్ర పట్టలేదు. బ్రహ్మానందశాస్త్రి కంస్థులేకుండా యీ లోకంలో ఎందుకుపుట్టాడు? ఈ లోకంలోని పాపాన్ని చూడలేకనా ?

## ౨౪

అచ్చక్కకు ప్రాప్తించిన నూరారు కష్టాలు చాలవన్నట్లుగా సరస్వతి కడుపులో యీ గ్రుడ్డిపిల్లవాడొకడు పుట్టాడు. శిశువు చిలుకలా వున్నాడు. కాని ఏమి లాభం ? రెండుకండ్లూ గుడ్డి. అచ్చక్కకు యీ జన్మ చాలనిపించింది. తనకీ లంపటమంతా దేనికి ? ఎందుకోసరం యీ దుఃఖసాగరంలో ఆశఅనే పడవనెక్కి తాను త్రోసుకుంటూ పోవలె ? ఆ విషయమే ఆమె గణపతితో యిలాఅన్నది:

"చేయిపట్టిన యజమానులు మరణించారు. ప్రేమించిన కన్న తండ్రి మాయమైనాడు, ఇంక సరస్వతి సంసారమందామా ? అది యిలా ముగిసింది. నేనిక్కడ వుండడమెందుకు ?"

"తల్లీ తమ్ముడూ వున్నారుగదమ్మా !"

"వాళ్ళున్నారు గాబట్టే నేను వూరు విడువవలసి వచ్చింది. తల్లి అందామా ? పుట్టినప్పటినుంచీ శత్రువై కూర్చుంది. ఇక తమ్ముడా ! వాని మాటంటే నాకు సరిపోవడంలేదు."

"సరస్వతి గతి ?"

"దాసిగతి దానిది. నేనిక్కడుండిమాత్రం దానికి చేసేదేముంది ? అది ఏడుస్తుంటే కన్నీరు తుడిచే స్వాతంత్ర్యంగూడా లేదునాకు. వాళ్ళ

యింటిలో నేను అరక్షణం వుండలేను. సరస్వతి పడుతూండే యమ యాతనలు దినదినమూ చూచుకుంటూ, నేనక్కడ వుండడం సాధ్య మౌతుందా? ఇంతకుముందే ఎక్కడికోపోయి నా ప్రాణాన్ని ముగించు కొని వుండేదాన్ని. కానీ, భాస్కరభట్టుకు బిడ్డనై, ఋషివంటి బ్రహ్మా నందులకు భార్యనై నీవంటి కుమారునికి తల్లినై ఆత్మహత్యవంటి అవివేకం చేయరాదనే వుద్దేశ్యంతో యిలా బ్రతికివున్నాను."

"పరమాత్ముడు సృష్టించి యిచ్చిన పంచప్రాణాలనూ, నాశనం చేసే అధికారం మనుష్యునికి లేదమ్మా తల్లీ! ఇలాంటి క్షుద్రవిచారం తమరు మనసులో గూడా తేకూడదు. నాకు సంబంధించినంత వరకు మీరెలా ఆజ్ఞయిస్తే అలా నడుస్తాను!"

గణపతి యీ మాట అన్నదే తడవు అచ్చమ్మ పలికింది:

"నేనుగూడా నీవెంట కాశీకి వస్తాను గణపతీ! యిక్కడ వుండ లేను."

"అగత్యంగా' సంతోషంగా మిమ్మల్ని పిలుచుకపోతాను. దేవత వలె పూజించుకుంటాను. రేపే బయలుదేరండి కావలసివుంటే!"

అచ్చమ్మ కన్నులనుంచీ పలపల నీరు జారినాయి. ఆపత్సమ యంలో ఆమెకు గణపతి దేవునిలా దొరికాడు.

'ఈ సరస్వతి వుందిగదా! దాన్ని అత్తగారింటికంపి మనంపోవాలి'

"నిజమేనమ్మా! ఆమె కని యింకా పంద్రెండుదినాలే అయింది· మూడుమాసాలైనా కానిది ఎలాపంపేది?"

"అదెంతకాలం బతుకుతుంది గనుక? బతికి చేయడంమాత్రమే ముంది? కళ్ళులేనిసంతానం - కళ్ళున్నా గుడ్డివాడైన మగడు. రాక్షసి వంటి అత్త. రేపునీవేపోయి సరస్వతినీ, బిడ్డనూ అత్తగారింట్లో వదిలి వేసిరా!"

ఈ యాజ్ఞను పరిపాలించడం మాత్రం చాలకష్టమనిపించింది గణపతికి. తనపిల్లయిప్పటికే ఎన్నోకష్టాలు కలిగాయి సరస్వతికి.

"నాపైన గౌరమ్మకూ, బాళప్పకూ, మంచి అభిప్రాయంలేదమ్మా! అది నాదురదృష్టం. చాలనిదానికి సరస్వతి నావెంటవస్తే...వాండ్లు"

"నిన్నేంచేస్తారు?"

"నన్నేంచేసినా ఎదిరించగలను. ఓర్చుకోగలను. కాని చెల్లెలైన సరస్వతిని అనావశ్యకంగా..."

"హింసలు పెడతారు. అంతేగదూ! అది సరస్వతి తెచ్చుకొన్న పుణ్యం. నామట్టుకు నేనాదిక్కుకైనారాను. గణపతీ! నీవే పోయిరా! నీవేపోయితీరవలె?"

"జైశివే"

తల్లి కొడుకులు చేసుకొన్న నిశ్చయాన్ని అచ్చక్క సరస్వతికి తెలిపింది సరస్వతికది సముచితంగానూ తోచింది.

"నీవు కాశీకి పోవడమే మంచిదమ్మా! నాగోడునీకు తప్పుతుంది. సుఖంగా వుండడానికి వీలవుతుంది."

"నాకు సుఖం యీజన్మలో లేదు అక్కా లేదుగూడా! నాసుఖం నాభర్తతోనేపోయింది. మరలా అది లభించడం మరణంతోనే. మరణాని కెదురుచూస్తూ యిక్కడ కూర్చునేబదులు, అక్కడే - ఆ విశ్వనాథుని సన్నిధిలోనే, కూర్చొని చావుకెదురు చూస్తాను నీకష్టాలవార్తలు కాశీ వరకూ ప్రాకిరాలేవు. అవి నాచెవుల్లోపడవు. నాకంతేచాలు."

తల్లిబిడ్డల సంభాషణ చిటికెలో ముగిసిపోయింది. ఇద్దరికీ వైరాగ్యదృష్టి అయితంగా వుంది. అట్టివారు దేహబంధాలను త్రెంచుకోవడం అంతకష్టంగాదు. ఇరువురూ పక్వమైన జీవులు.

గణపతి అచ్చుకన్నను ముందే హోసపేటకు పంపించాడు. తాను సరస్వతిని వదలిపెట్టి వచ్చేవరకూ, ఆమె అక్కడవుంటే - అక్కడి నుంచీ రైలులో కాశికి యిద్దరూ ప్రయాణించవచ్చు.

సరస్వతిని ఎడ్లబండిలోకూర్చోపెట్టి, పిల్లవాణ్ణి తనచేతిలో తీసుకొని గణపతి కూర్చున్నాడు. ఎందుకోగాని, గణపతికి ఆశిశువును వదలిపెట్టిపోవడం చాలకష్టంగావుంది. తనగురువూ, తండ్రీ, సంరక్షకుడూ, అయిన బ్రహ్మానందులఆత్మను గణపతి ఆశిశువులో గుర్తించాడు. త్రోవపొడుగునా గణపతి ఆశిశువుతో ఆడుకొన్నాడు, నవ్వినాడు. ఏడ్చుకొన్నాడు: " కండ్లుతెరవవయ్యా నాస్వామి ! నీకుమారుణ్ణి నన్నుచూడు. నీబిడ్డ సరస్వతిని ఒకసారిచూడు. నీవునవ్వి మమ్మునవ్వించు. నీవు బ్రహ్మానందమూర్తివి. నీవెవ్వరో నేనెరుగుదును. నీవుకన్నులు తెరచేవరకూ నేను విడువను. కండ్లుతెరచి మాటాడవయ్యా !"

గణపతి శిశువైన బ్రహ్మానందులతో, దారిపొడుగునా ఆడుకుంటూ ఒళ్ళు మరుస్తూన్నాడు. సరస్వతివూరు సమీపించింది.

"అన్నా కొంచెందిగు. నాకేమో తల తిరుగుతూంది"

సరస్వతి ఆయాసంగా అన్నది.

శిశువునెత్తుకొని గణపతి దిగాడు. సరస్వతిచేయి పట్టుకున్నాడు. ఆ చేయివూతతో సరస్వతిక్రిందికి దిగింది.

సరస్వతి తిన్న ఆహారమంతా వాంతి చేసుకుంది. " అయ్యో " "అమ్మా" అంటూ చేయిచాచింది. గణపతిభుజంపైన చేయివేసింది. నిలుచోవడానికిగూడా ఆమెకు సాధ్యంగాలేదు, త్రోవలోనే పడుకునేస్థితికి వచ్చింది.

" రెండడుగులునడచి రావమ్మా సరస్వతీ ! ఆ కట్టపైన పడుకోపెడ్తాను. కొంచెం నీడగూడ వుంటుంది."

గణపతి తిన్నగా సరస్వతిని గోకర్ణేశ్వరునిగుడిఅరుగుపైకి సాగించాడు. ఆమెకాళ్ళు జాచి పడుకున్నది. తలక్రిందరాళ్ళు పెడితే, ఒత్తుకుంటాయనే వుద్దేశ్యంతో. తనఒడినే తలదిండుగా చేకూర్చాడు గణపతి. ఐదారు నిమిషాలు హాయిగా గడచాయి.

x..........x..........x..........x..........x

బాళప్పకు బ్రహ్మచర్యంగూడా అప్పుడప్పుడే సడలింది. వానిదాపద్ధతి యీపద్ధతి అంటూలేదు. ఆవిషయంలో వాడు మహాఅద్వైతి. ఉచ్ఛనీచములు, యోగ్యా యోగ్యములు, పాత్రా పాత్రలనే తారతమ్యమే ఆవిషయంలో వానికి కాబట్టదు. అతికాముకుడైన బాళప్పకు కేవలశారీరిక సుఖమే కావలసింది. తనదప్పి తీరితే చాలు.

తనపాత బిరుదైన"గో బ్రాహ్మణుడ"నే పేరును మరలా సార్థకం చేయదలచుకొన్నాడు బాళప్ప. మధ్యాన్నపుటెండ తీక్షణంగావుంది. కానీ వానికేమిలెక్క ! నేరుగా గోకర్ణేశ్వరుని గుడివైపు పరుగెత్తాడు. అక్కడ వాడు చూచినదేమి ?

గౌరమ్మ తన తలలో విత్తిన అనుమానాలన్నీగూడా ఆకారమెత్తుకొన్నదృశ్యం! ప్రతిహింస వానిమనస్సులో భూతంలా నిలుచుంది. వానిక్రోధానికి మితిలేకపోయింది. అసూయ, ఆవేశమూ యీ రెంటితో వాడు రాక్షసుడుగా మారాడు. పెదవికొరికి కొన్నాడు. పండ్లుగీటాడు. మనస్సులో యిలా భావించాడు:

" ఇంకా యీ బైరాగిగాణి స్నేహంవదలలేదూ ? పాడుముండా! వానితొడపైన నీతలనా ! కానీ...కానీ..."

తాను చూచినదంతా తన అనుమానాన్ని ప్రోదిచేసేందుకే వినియోగించుకొన్నాడు బాళప్ప. వివేకం వానిజన్మకే లేదు. ఏమిచేయద

మనేది బాళరాజు మనస్సులోనే నిర్ణయించుకొన్నాడు. కానీ, బైరాగి దేహం దుండుదుండుగా వుంది. వానితో కలియబడితే తన్ను చిదుగ గొడుతాడు. బాళప్ప ఒకచెట్టు వెనకాల నిలువబడి అవకాశానికి కాచు కున్నాడు. సరస్వతి మెల్లిగా లేచింది. వాంతి చేసుకొన్నదానితో ఆమె నోరు చెడిపోయింది. నీరుపుక్కిలించివేతామనుకున్నదామె. నీరు తేవ డానికి గణపతి బండిదగ్గరకు వచ్చాడు. చెంబులోవున్న నీళ్లన్నీ బండి అదురులకు ఒలికిపోయాయి. గణపతి వట్టిచెంబు తీసుకొని వచ్చాడు. దగ్గరే దిగుడుబావి వుంది. దానిలో దిగి నీరు తెద్దామనుకొన్నాడు.

ఇంతలోనే సరస్వతి దడదడ వావిమెటికలు దిగింది. వద్దువద్దని గణపతి అరుస్తున్నా ఆమె లెక్కించలేదు.

అప్పుడై పొంచున్న పులిలాగా, ఎక్కడినుండో హఠాత్తుగా వచ్చి పడ్డాడు బాళప్ప. వచ్చినవూపులోనే సరస్వతిగొంతు పట్టుకున్నాడు వాడు.

"అయ్యో!" అన్నది సరస్వతి.

చేతిలోవున్న శిశువునెత్తుకొని గణపతి పరుగెత్తి వచ్చాడు.

అప్పటికే బాళప్ప తన ప్రయత్నంలో ముక్కాలు ముగించాడు. సరస్వతియొక్క అవతార కథ కడముట్టింది.

దడదడ మెటికలు దిగుతూ గణపతి అరచాడు.

"పెండ్లాన్నేమి చేస్తావురా బాళప్పా!"

"గొంతుపిసికి బాయిలో వేస్తాను!"

బాళరాజు సత్యసంధుడు. చేసినప్రతిజ్ఞ నెరవేర్చుకొన్నాడు. పుణ్యా త్ముడు.......!

---

# SARASWATHI SAMHARAMU

By

*B. Chi.*

Translated by

*'Puttaparti'*

*Published by*

ADARSA SAHITYA MALA

17-5-350 outside Dabirpura,

HYDERABAD - 2

**Price Rs 2/-**



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA130B127 |
| పుస్తకం పేరు | సరస్వతీ సంహారము |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 169 |
| పెద్ద సైజు పేజీలు | నో |
| ఖాళీ పేజీలు | [illegible] |
| లేని పేజీలు | IV,V,1-16 |
| తయారు చేసినది | Kasimbi |
| పేజీలు విడదీసినది | Kasimbi |
| | Susmitha |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |